# శ్రీ భగవదుత్తర గీత



దీపికా వ్యాఖ్యాత

బోధానందనాథ

(కాశీభొట్ల సుబ్రహ్మణ్య గణేశకుమార్)

## శ్రీభగవదుత్తరగీత


దీపికావ్యాఖ్యాత ః కాశీభోట్ల సుబ్రహ్మణ్య గణేశ కుమార్ (బోధానన్దనాథ)


---




ప్రతులు ః 1000

మొదటి ముద్రణ ః శ్రీనన్దన నామ సంవత్సర చైత్రమాసం 2012

**గ్రంథప్రాప్తి స్థానములు** ః ఆగమ విజ్ఞాన ఛారిటబుల్ ట్రస్టు
2 – 7A – 12, వెంకట నగర్
కాకినాడ – 533 003
0884 – 2362337

**మూల్యము** ః 150రూ॥లు

**ముద్రణ** ః రత్నాస్క్రీన్స్, కాకినాడ

కృతి

సమర్పణము

నా జననీ జనకుల పాదపద్మములకు

పురాణవాచస్పతి,బ్రహ్మవిద్యాసరస్వతి
పులవర్తి నూకాలరావు,M.A., B.Ed.
Rtd ప్రిన్సిపాల్

# ప్రశంసాపారిజాతము

ఉత్తరగీత పూర్వగీతవలెనే పద్మనాభముఖపద్మావిర్భూతమైనది. కృష్ణార్జున సంవాద కథాసమన్వితమైనది. సమస్త వేదసమ్మితమైనది. అతిరహస్యోపనిషన్మన్త్ర గర్భితమైనది. మన ప్రాచీనాచార్యులందరిచేతను పరమాచార్యశిరోమణిగా ప్రశంసింపబడిన, జగద్గురు గౌడపాదాచార్యుల వారు దీనికి వ్యాఖ్య వ్రాయుటనుబట్టియే ఈ గ్రంథముయొక్క ప్రాముఖ్యము వ్యక్తమగుచున్నది. ఇట్టి మహత్త్వ పూర్ణమగు గ్రంథరాజము మహాభారత కథాంతర్భాగమైయుండియు కాలవశమున విడిపోవుట విచిత్రముగానే ఉన్నది.

పూర్వగీతయందు ఆధ్యాత్మిక యోగవిద్యా ప్రభావమున పరిపూర్ణ బ్రహ్మస్వరూపావేశమునంది విశ్వాత్మ భావనాభావితుడై, శ్రీకృష్ణ భగవానుడు తన ప్రియసఖుడగు అర్జునునకు పరమార్థోపదేశమును గావించెను. ఈ మహోపదేశము పదునెనిమిది యోగములతో ఏడువందల శ్లోకములలో భగవద్గీతా నామమున ప్రఖ్యాతమైనది.

ఇట్టి దివ్యోపదేశానంతరము కూడ తానే కర్తను భోక్తను అని భావించుకొనుచు, భీష్మద్రోణాది గురువులను బంధువులను, చంపుట వలన ఇహలోక, పరలోకములందు సుఖమును కోల్పోయి, దుఃఖమును అనుభవించవలసి వచ్చునని చింతాక్రాంతుడైయున్న పార్థునిచూచి అతని యోగ్యతకుతగిన శరణాగతిరూప ప్రపత్తిభావమును ఉపదేశించుచు...

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి మాశుచః॥

"ఓ అర్జునా! సమస్త ధర్మములను విడిచిపెట్టి నన్నే శరణాగతి నందుము. నేను విముక్తుని గావించెదను. ఇంక నైనను దుఃఖము వీడుము" అని పలికెను. మహాభారత యుద్ధానంతరము పాండవులకు రాజ్యప్రాప్తి కలిగిన తరువాత, నూతన రాజ్యములలో శ్రీకృష్ణుడు,అర్జునుడు కలిసి చాలకాలము విహరించిన పిమ్మట ఇన్ద్రప్రస్థమునందలి యొక్క దివ్యసభయందు ఇష్టాగోష్ఠియందుండి ప్రసంగవశమున శ్రీకృష్ణునితో అర్జునుడు ఈ క్రింది విధముగా పలికెను.

శ్లో॥ యత్తద్భగవతా ప్రోక్తం పురాకేశవ!సౌహృదాత్।
తత్సర్వం పురుషవ్యాఘ్ర! నష్టంమేభ్రష్టచేతసః।
మమకౌతూహలంచాస్తి, తేష్వర్థేషుపునఃపునః
భవాంశ్చ ద్వారకాగంతా చిరాదివ భారత।

"ఓకృష్ణా! పూర్వము నీవు మన సౌహృదమును పురస్కరించుకొని, చేసిన ఉపదేశము అంతయు ఘోరసంగ్రామ చింతావిష్టచిత్తుడను అగుటచే నష్టమైపోయినది. ఆ విషయములన్నియు మరల,మరల వినవలయునని మిక్కిలి కోరికగా ఉన్నది. నీవుకూడ ద్వారకకు పోవలయునని తొందరపడుచున్నావు. కావున ఆ గీతోపదేశమును మరియొక మారుగావింపుము" అని కోరెను. ఆ మాటలను విని, తాను ఉపదేశించి నపుడు సరిగా వినక పెడచెవిని పెట్టినందులకు యోగీశ్వరుడగు కృష్ణుడు ఆగ్రహించి అర్జునుని బాగా మందలించెను.

శ్లో॥ నూనమశ్రద్దధానోసి, దుర్మేధాహ్యసిపాండవ!
నశక్యం తన్మయాభూయః తథావక్తుమశేషతః।
పరంహిబ్రహ్మ కథితం యోగయుక్తేన తన్మయా।
ఇతిహాసంతు వక్ష్యామి తస్మిన్నర్థే పురాతనమ్॥

కాని అర్జునునిపై గల అవ్యాజమైన అనురాగాన్ని పురస్కరించుకొని, తాను తెలవెనుకనేయుండి అనేక ఉపాఖ్యానముల రూపమున ముప్పదియారు

అధ్యాయములలో వేయికిపైనగల శ్లోకములలో పరమ తత్త్వమును వివరించి తెలిపి ద్వారకకు పయనమై వెడలెను. ఈ అనుగీత పూర్వగీతకన్న చాలా భిన్నమైనది. సాధక జనానీకములో బాగా ప్రసిద్ధి పొందింది.

ఆ తరువాత ఉత్తరగీతయొక్క ఉపదేశానికి తెరలేస్తుంది. ఈ ఉత్తరగీత పైనపేర్కొన్న రెండు గీతలకన్నను చాలా చిన్నదిగా సంగ్రహముగానున్నను సమగ్రముగానున్నదని చెప్పవచ్చును. ఇందులో మొత్తము నాలుగు అధ్యాయములు, రెండువందలలోపు శ్లోకాలు ఉన్నవి. పైనపేర్కొన్న రెండు గీతలు చదివిన తరువాత కలిగే సంశయములన్నిటికి ఉత్తరము (జవాబులు) దీనిలో ఉన్నాయి.

ఇందుగల నాలుగు అధ్యాయములలో మొదటి అధ్యాయమున వాయుధారణము వలన ప్రయోజనము, హంసరూప మన్త్రానుష్ఠానము, నాసికాగ్రదృష్టి, ఖేచరీముద్ర, నాదానుసంధానము, సాంఖ్యతత్త్వము, జ్ఞానికిగలుగు సర్వాత్మ భావము, ప్రణవోపాసనము, జీవబ్రహ్మైక్యాను సంధానము, బిందునాదకళా వివరణము,ఇవియేగాక సాధకులకు సహజముగా గలుగు అనేక సంశయములకు సమాధానములు చెప్పబడినవి.

ద్వితీయానువాకమునందు బ్రహ్మవేత్తకు దేహపాతానంతరము గమనముకలదా? లయము ఎక్కడ? ఇడా పింగళా నాడుల వివరణము, మేరుదండమునగల ఇన్ద్రాది లోకముల విజ్ఞానము,ఆత్మనిష్ఠుడు సమస్త పాపముల తరించి అమృతత్వమందుటయును, ధ్యానయోగమహిమయు, మమకారమునకు బంధకారణత్వము, నిర్మమత్వమునకు మోక్షహేతుత్వము బాగుగా నిరూపింపబడినవి.

తృతీయాధ్యాయమున చాలాభాగములు లుప్తమైనట్లు తెలియుచున్నది. ఇందు ఇన్ద్రియ జయము వలన కలుగు లాభములు, వైరాగ్యముయొక్క మహత్వము వర్ణింపబడినవి.

చతుర్థాధ్యాయమున ప్రణవార్థము,ప్రాణాయామ ప్రయోజనము, హృదయకమలమున శివమహాదేవుని ధ్యానము,అష్టదళ పద్మస్వరూప నిరూపణమును కలవు. ఈ గ్రంథము నందంతటను, సాంఖ్య యోగ శాస్త్రములందలి రహస్య విజ్ఞానమునంతటిని వెలికి తీసి సాధకులకు అందించు ప్రయత్నము జరిగినది.

ఇట్లు సాధకజనులకు పెన్నిధి, ముముక్షువులపాలిటి కల్పవృక్షము అనదగు ఆధ్యాత్మిక గ్రంథమును శ్రమపడి సంపాదించి, సరళము, సుబోధకము, శిష్టవ్యావహారికముఅగు తెనుగునందు వ్యాఖ్యను రచించి పాఠకలోకమునకు అందించిన శ్రీ కాశీభొట్ల సుబ్రహ్మణ్యగణేశకుమార్ ఎంతయు అభినందనీయులు. ఇట్టి మహత్త్వ పూర్ణమైన గ్రంథరచనకు వీరికి సాంఖ్యయోగ శాస్త్రములలో ప్రగాఢ పాండిత్యము, సంస్కృతాంధ్ర భాషలలో సమధికమగు ఆధిపత్యము, బ్రహ్మవిదులగు మహాత్ములతో నిత్యసాంగత్యము, మహాత్ములగునట్టి గురు దేవతామూర్తుల అనుగ్రహమును కారణములుగా తలంచుచున్నాను.

కరచరణాద్యవయవములు దాల్చిన జ్ఞానవిజ్ఞానములనదగు జననీజనకుల పదకమలములకు కానుకగా సమర్పింపబడుటచే ఈ గ్రంథగౌరవము మరింత పెరిగినది. మహోన్నతాశయములుగల ఈ గ్రంథకర్తకును వారి కుటుంబ సభ్యులందరకును, సమస్త జగత్పితరులగు పార్వతీపరమేశ్వరులు, దీర్ఘాయురారోగ్య భోగభాగ్యములు కలిగించ వలయునని హృదయ పూర్వకముగ కోరుచున్నాను.

9-3-2006,
కాకినాడ.

పురాణవాచస్పతి బ్రహ్మవిద్యాసరస్వతి
**పులవర్తి నూకాలరావు**

## ఉపక్రమము

**విశ్వేశ్వర మజం విష్ణుం సర్వకారణ కారణం।**
**రామలాల గురుం వన్దే చతుర్వర్గార్థ సిద్ధయే॥**

ఆధ్యాత్మ విద్య ఉపనిషత్తుల యందు సాఙ్గోపాఙ్గముగా వివరింప బడినది. శ్రీకృష్ణుడు ఆ ఉపనిషత్తుల సారమును అర్జునునకు ఉపదేశించెను. ఇది అంతయు **'భగవద్గీతలు'** అను పేరున లోకమున మిక్కిలి ప్రచారమున నున్నది. పార్థునకు ఆ ఉపదేశము అప్పటికి చక్కగా అవగాహన యైనట్లేయున్నది. పునః రాజ్యభోగాది విషయ సంబంధ నిష్ఠుడగుటచే స్మృతి పథమునుండి ఉపదేశ జ్ఞానము చెదరినదాయెను. మరల పార్థుడు భగవానుని శరణుజొచ్చి తత్త్వబోధకై ప్రార్థించెను. అప్పుడు పరమాత్మ మరెన్నడూ చ్యుతినొందని విధమున **'ఉత్తరగీతలు'** అను పేరున భగవద్గీతా సారమంతయు అనుభూతమగునట్లుగా చెప్పెను. ఈ ఉత్తరగీత మహాభారతాశ్వమేధపర్వము నందలిదని గ్రంథాంత గద్యంబున గలదు. కాని ఇది అలభ్యముగానున్నది. శ్రీవ్యాస హృదయమును యథాతథముగా ప్రతిషించిన ప్రస్థానత్రయ భాష్యకారులైన శ్రీ ఆచార్య శఙ్కర భగవత్పాదుల పరమ గురువులైన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య గౌడపాదయతి ఈ ఉత్తరగీతకు వ్యాఖ్యను వ్రాసియున్నారు తృతీయాధ్యాయమున కొంతభాగము ప్రక్షిప్తమని తెల్పియున్నారు. దానంజేసి శ్రీ గౌడపాదుల కాలమునకే మహాభారతము మార్పులకు చేర్పులకు గురియైనదని స్పష్టమగుచున్నది.

ఉత్తరగీత శ్రీకృష్ణార్జున సంవాద రూపమైనది. ఉపదేశకుని, పృచ్ఛకుని సామర్థ్యమును దృష్టియందుంచుకొని ఈ ఉపనిషత్సారమును భావన చేయవలెను.

**వసుదేవ సుతం దేవం కంసచాణుర మర్దనమ్।**
**దేవకీ పరమానన్దం కృష్ణం వందే జగద్గురుమ్॥**

ఇచట ఉపదేశకుడు జగద్గురువైన శ్రీకృష్ణుడు. కంస చాణుర మర్దనచే జగద్గురుత్వాన్ని పొందినవాడు. ఈ జగద్గురుత్వము ఎలా వచ్చింది...

**"నిగమో వసుదేవో యో వేదార్థః కృష్ణరామయోః"**

**"యః వసుదేవః సః నిగమః"** ఏ వసుదేవుడు గలడో అతడు ఉపనిషత్తు. వసుదేవుడే ఉపనిషత్తులు. మూర్తీభవించిన ఉపనిషత్తుల సారమే శ్రీకృష్ణుడు. ఇక్కడ కృష్ణుడు కంసచాణుర మర్దనుడు. "కంసః" కంసుడు అనగా ప్రాణాపానములు మొదలుగాగల ముఖ్య ప్రాణపఞ్చకము. "చాణురః" ఇది శ్రేష్ఠము సూక్ష్మము అయిన దేవదత్త ధనఞ్జయాది సూక్ష్మవాయుపఞ్చకము. వీనిని బాగుగా మర్దించినవాడు. ప్రాణోపప్రాణ సహితముగా మహాప్రాణమును అణచినవాడు. ఇట్టివాడు కేవల కుమ్భకమందుండు వాడు. ఊర్ధ్వరేతస్కుడు, జితమనస్కుడు.

దేవకీ యనగా **'దేవైః కాయతే ఇతి దేవకీ'** దేవతలచే కొనియాడ బడునది. బ్రహ్మవిద్య. **"శ్రు. దేవకీ బ్రహ్మవిద్యా"** ఈ బ్రహ్మవిద్యను ఉపనిషత్తులు రక్షించుచుండుటచే ఈమే వసుదేవునకు భార్యగా చెప్పబడినది. ఈ బ్రహ్మవిద్యకు ప్రయోజన రూపమైనది పరమానన్దము. పరమానన్దము ఆవిర్భవించుటచే విద్యయు ఆనందించు చున్నది. ఊర్ధ్వరేతస్కుడు, జితమనస్కుడు, పరమానన్దరూపుడు కావున కృష్ణుడు జగద్గురువు.

ఇట్టి ఆనన్దరూపుడైన పరమాత్మను ఆశ్రయించినవాడు పార్థుడు (జీవుడు).
జీవ పరమాత్మల మధ్య సంభాషణ...
ఉత్తమ పృచ్ఛకుడు, సద్గురువు...
వీరి మధ్య వెట్టిమాటలుండవు.
పరమాత్మ తన స్థాన స్వరూప స్వభావాదులను తెలియజేస్తూ...

**సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥**
**"బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవచ"**
**"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"**
**"సర్వస్య చాఽహం హృది సంనివిష్టో"**
**"వేదానాం సామవేదోఽస్మి"**

అని శ్రీభగవద్గీతలో అనేకముగా చెప్పాడు.

ఈ భగవద్గీత వలన ఏమి జరిగింది...

**"నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత**
**స్థితోఽస్మిగత సందేహః కరిష్యే వచనం తవ॥**

ఇది పూర్వగీతకు ఫలశ్రుతి. ఉపదేశము వలన మోహము నశించింది. పూర్వజ్ఞానము కలిగింది.

పూర్వజ్ఞానం అంటే జీవుడు గర్భస్థుడైయున్నపుడు కలిగియున్న జ్ఞానం.

**"జాతశ్చాస్మి మృతశ్చాస్మి సంసార్యస్మి పునః పునః"**
**సంసారశృఙ్ఖలం దిగ్ధిగాచార్యర్జ్ఞా న మాప్నుయాం**
**యది యోన్యాం ప్రముఞ్చామి సాంఖ్యయోగం సమాశ్రయే**
**అశుభక్షయ కర్తారం ఫలముక్తి ప్రదాయకం**
**యది యోన్యాం ప్రముఞ్చామి తం ప్రపద్యే మహేశ్వరమ్॥**
**సర్వశక్తిం చిదాత్మానం సర్వకారణ కారణమ్**
**యదియోన్యాః ప్రముచ్యేయం ప్రపద్యే పరమేశ్వరమ్,**
**భర్గం పశుపతిం రుద్రం మహాదేవం జగద్గురుమ్॥**

ఇదిగో ఆ జ్ఞానాన్ని పునః పొందాడు. ఆత్మానాత్మ సంబంధమైన సర్వసందేహాలు తొలగినవాడైనాడు. పార్థుడు (జీవుడు) పరమాత్మయైన జగద్గురువును ఇక పునఃచ్యుతి పొందని విధముగా మార్గోపదేశము చేయమని ఆశ్రయించాడు,

ఏమిటా ఉపదేశము...

అది ఉత్తరగీతలో చెప్పాడు.

ఈ ఉత్తరగీత పరమాత్మతత్త్వ దర్శనరూపమగు మహామార్గము. ఇది సర్వభావ నివర్తకమగు తత్త్వజ్ఞాన సాధానానుష్ఠానము.

ఇది బ్రహ్మానుభవనకు ఉపయుక్తమగు సాధన రహస్యముల కాణాచి.

బోధానన్దనాథ

అస్యశ్రీ భగపదుత్తరగీతా శాస్త్రసార మహామన్త్రస్య బ్రహ్మవిష్ణుమహేశ్వరా ఋషయః। గాయత్రీ త్రిష్టుబనుష్టుప్ ఛన్దాంసి। అవహనీయ గార్హపత్య దక్షిణాగ్నయ స్థానాని। ఋగ్యజుస్సామవేదాః। నీల పీత శ్వేత వర్ణాః। అకారో బీజమ్। ఉకార శ్శక్తిః। మకారః కీలకమ్। ప్రణవాది సంపుటమ్। శ్రీమహావిష్ణు ప్రీత్యర్థే జపే వినియోగః॥

**కరన్యాసః।**

శ్రీమద్జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అఙ్గుష్ఠాభ్యాం నమః।

శ్రీమదైశ్వర్యాత్మనే ఛన్దసే తర్జనీభ్యాం నమః।

శ్రీమచ్ఛక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాం నమః।

శ్రీమద్బలాత్మనే బలభద్రారామాయ అనామికాభ్యాం నమః।

శ్రీమద్దయాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాం నమః।

శ్రీమద్విజయాత్మనే గాండీవధన్వనే అర్జునాయ కరతలకరపృష్ఠాభ్యాంనమః

**హృదయన్యాసః।**

శ్రీమద్జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృదయాయ నమః।

శ్రీమదైశ్వర్యాత్మనే ఛన్దసే శిరసే స్వాహా।

శ్రీమచ్ఛక్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయైవషట్।

శ్రీమద్బలాత్మనే బలభద్రారామాయ కవచాయహుమ్।

శ్రీమద్దయాత్మనే వాసుదేవాయ నేత్రత్రయాయ వౌషట్।

శ్రీమద్విజయాత్మనే గాండీవధన్వనే అర్జునాయ అస్త్రాయ ఫట్।

భూర్భువస్సువరోమితి దిగ్బన్ధః

**ధ్యానమ్॥**

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం।

దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

అనన్త మాహాత్మ్య మచిన్త్యరూపమృషిం పురాణం కవిమాదిదేవమ్।

జగద్ధితాయోగ్ర తపశ్చరన్తం నమామి నారాయణ మబ్జనాభమ్॥

తథా నరం తద్భజనానురాగ విద్యోతితోదార తపఃప్రభావమ్।

దమ్భోద్భవాహం కృతినాశ హేతుం నమామి సద్ధర్మవిదాం వరిష్ఠమ్॥

నమామి కవిమాతంగం వ్యాసం సత్యవతీసుతమ్।

యస్య వాఙ్మదగన్ధేన చర్చితం భువనత్రయమ్॥

వాచకః ప్రణవోయస్య క్రీడాదఖిలం జగత్।

శ్రుతివాఙ్మనసాతీతం తం వన్దే దేవకీసుతమ్॥

అఖణ్డసచ్చిదానన్ద మవాఙ్మానస గోచరమ్।

ఆత్మానమఖిలాధార మాశ్రయేఽభీష్ట సిద్ధయే॥

పరంపరస్యాః ప్రకృతేరనాది మేకం విశిష్ఠం బహుధాగుహాసు।

సర్వాలయం సర్వచరాచరస్థం త్వామేవ విష్ణుం శరణం ప్రపద్యే॥

ఇతి ధ్యానం కుర్యాత్॥

శ్రీరామలాల సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీభగవదుత్తరగీతా

## ప్రథమోధ్యాయః

**॥అర్జున ఉవాచ॥**

**యదేకం నిష్కళం బ్రహ్మ వ్యోమాతీతం నిరఞ్జనమ్।**
**అప్రతర్క్యమవిజ్ఞేయం వినాశోత్పత్తి వర్జితమ్॥ ౧**
**కైవల్యం కేవలం శాన్తంశుద్ధమత్యన్త నిర్మలమ్।**
**కారణం యోగనిర్ముక్తం హేతుసాధన వర్జితం॥ ౨**
**హృదయామ్బుజ మధ్యస్థం జ్ఞానజ్ఞేయ స్వరూపకమ్।**
**తత్క్షణాదేవముచ్యేత యద్జ్ఞానా ద్బ్రూహి కేశవ॥ ౩**

**టీ॥ హే కేశవ** = ఓ కేశవ, **యత్+ఏకమ్** = ఏది స్వజాతీయ విజాతీయ స్వగతభేద రహితమును, **నిష్కళమ్** = కలాభేదములు లేనిదో (అవయవ రహితమైనదో), **వ్యోమాతీతమ్** = చతుర్వింశతి తత్త్వాతీతమైనట్టి, **నిరఞ్జనమ్** = స్వయం ప్రకాశమానమును, **అప్రతర్క్యమ్** = వాఙ్మనసాతీతమైనట్టి, **అవిజ్ఞేయమ్** = ప్రమాణములచే తెలియ శక్యముగానిదియు, **వినాశోత్పత్తి వర్జితమ్** = ఉత్పత్తి నాశములు లేనిదియు.

**టీ॥ కైవల్యమ్** = మోక్షస్వరూపమైనదియు, **కేవలమ్** = బన్ధ మోక్షములు లేనిదియు, **శాన్తమ్** = రాగాదిపరిణామ రహితమైనదియు, **శుద్ధమ్** = ప్రపఞ్చ సంబంధము లేనిదియు, **అత్యన్తనిర్మలమ్** = కళఙ్కరహితమైనదియు, **కారణమ్** = సర్వోత్పత్తి నిమిత్తోపాదాన రూపమైనదియు,

**యోగనిర్ముక్తమ్** = వస్త్వన్తర సంబంధ రహితమైనదియు, **హేతుసాధన వర్జితమ్** = సర్వకారణుడగుటచే ఇతర కారణములు సాధనములు లేనిదియు,

**టీ॥ హృదయామ్బుజ మధ్యస్థం** = హృత్పద్మ మధ్యమందున్నదియు, **జ్ఞానజ్ఞేయ స్వరూపకమ్** = జ్ఞానము, జ్ఞేయము అను ఉభయసత్తాత్మక మైనట్టిది, **యత్+జ్ఞానాత్** = ఏ జ్ఞానమువలన, **తత్క్షణాదేవ** = ఆ జ్ఞానోత్తర క్షణమునందే, **ముచ్యేత** = విడువబడునో, **బ్రూహి** = చెప్పుము.

**దీపికా:** హేకేశవ! ఏది సర్వలోకములను ప్రళయ(మోక్ష)కాలమునందు తనలో లీనము చేసుకొనుచు సమస్తలోకములను సృష్టి స్థితి సంహారముల నొనర్చునదో; దేశకాలవస్తుపరిచ్ఛేద శూన్యమై జగత్కారణమగునట్టి వస్తువో; దర్శ, దృష్టా, దర్శితా, విశ్వరూపాది కలాభేదములు లేనిదో; ఆకాశ సముదాయములకు అతీతమైనదియు (అనుటచే చతుర్వింశతి తత్త్వాతీతమైనదనియు స్పష్టము); స్వయంప్రకాశమానమైనదియు; ఏకాదశేన్ద్రియములచే గ్రహింపశక్యముగానిదియు; ప్రత్యక్షాది ప్రమాణము లచే గ్రహింపనలవిగానిది (ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి అను ఆరు ప్రమాణములు ఏతద్విషయమై ప్రయోజన శూన్యమని చెప్పుచున్నారు); ఉత్పత్తినాశములు లేనిదియు అనగా త్రికాలాబాధ్యమైనది; మోక్షరూపమైనదియు; బన్ధమోక్షములు లేక కేవలమై యుండునదియు; (మాత్రాభేదము శాంతించిన ప్రణవము) వాఙ్మనఃకాయములయొక్క త్రివిధ తాపనిగ్రహ రూపమైనదియు; అత్యన్త నిర్మలమైనదియు (అనగా పఞ్చవిధ మలస్పర్శలేనిది); సర్వోత్పత్తి నిమిత్తో పాదాన రూపమైనది; ఇతర వస్తువులతో సంబంధములేనిదియు; నిమిత్తత్వోపాదానత్వ ధర్మాదులచే విడువబడినది; హృత్పుణ్డరీక మధ్య





నుందునదియు; జ్ఞానము, జ్ఞేయము తదుభయ సత్తాత్మకమైనట్టియు; ఏ జ్ఞానముచే ఆ క్షణమందే అవిద్యా నివృత్తిరూప ఆనన్దప్రాప్తియో దానినిగూర్చి చెప్పుము అని అర్జునుడు ప్రశ్నించెను. ఈ విధమైన ప్రశ్నముచేతనే నరుని స్థితి అవగతమగుచున్నది. గ్రన్థము అనుబన్ధ చతుష్టయపూర్వకముగా నుండవలెను. కావున విషయము, ప్రయోజనం, సంబంధము, అధికారియను వానిని ఇచట సూచించెను. వేదాన్తగ్రన్థము లు బ్రహ్మతత్త్వ ప్రతిపాదకములు. ఇందును ఆ బ్రహ్మతత్త్వ ప్రతిపాదనమే విషయము. వేదాన్తశాస్త్రములచే చెప్పబడుచున్న మోక్షమే **'తత్క్షణాదేవ ముచ్యేత'** ప్రయోజనమగుచున్నది. దీనియందు ప్రతిపాద్య ప్రతిపాదక భావసంబవధము కలదు. ఇతఃపూర్వము తత్త్వమును ఆకర్ణించియుండుటచే అది లభింపు మార్గమును చెప్పుమని అడుగుచున్నాడు.

**॥భగవానువాచ॥**

**సాధుపృష్టం మహాబాహో! బుద్ధిమానసి పాణ్డవా।**
**యన్మాం పృచ్ఛసి తత్త్వార్థ మశేషం ప్రవదామ్యహం॥ ४**

**టీ॥ మహాబాహో** = గొప్పబాహువులు కలవాడా! **పాణ్డవా** = పాణ్డు కుమారుడా! **సాధుపృష్టమ్** = చక్కగా అడుగబడినది; **బుద్ధిమానసి** = బుద్ధిమంతుడవైతివి; **యత్** = దేనినిగూర్చి; **మామ్** = నన్ను; **పృచ్ఛసి** = అడుగుచున్నావో, (**తత్** = అట్టి); **తత్త్వార్థమ్** = ఆత్మతత్త్వమును; **అహమ్** = నేను; అశేషమ్ = నిశ్శేషముగా; **ప్రవదామి** = చెప్పుచున్నాను.

**దీపికా:** సత్కులమందు పుట్టినవాడా! హేమహాబాహో అని సంబోధన, గొప్పబాహువులు కలవాడా! అనుటచే, బాహువులు సర్వకర్మలకు హేతు భూతములగుటచే 'ధర్మాధర్మములు' అని గ్రహించునది. ధర్మాధర్మము

లను బాగుగా గ్రహించినవాడా అని. ఇచట **'ధర్మము'** అహఙ్కారము ఆదిగా స్థూలశరీరము అన్తముగాగల జగత్తునకుగల వృధిక్షయములు, దీనికి సంబంధించిన జ్ఞానమును; **'అధర్మము'** అనగా అహఙ్కారము ఆదిగా స్థూలశరీరము అన్తముగాగల జగత్తునందున్నప్పటికి వృద్ధిక్షయ ములు లేకుండునట్టి జీవుని స్వభావము. వీనిని బాగుగా గ్రహించిన వాడా! అని. బాహువులు క్షాత్రసంబంధమైనవి. గొప్పబాహువులు కలవాడా! అనుటచే బాహ్యాభ్యన్తర శత్రువులను బాగుగా నిగ్రహించిన వాడా! చక్కగా అడుగబడినది. నిత్యానిత్య వస్తువివేకము, వైరాగ్యము, శమాదిసంపత్తి, ముముక్షత్వము అను సాధనసంపత్తి గలవాడా! నన్ను ఏ తత్త్వమునుగూర్చి అడిగితివో దానిని నిశ్శేషముగా చెప్పెదను. అని ఇచ్చట అధికారి నిర్ణయము చేసారు.

**ఆత్మమన్త్రస్య హంసస్య పరస్పర సమన్వయాత్।**
**యోగేన గతకామానాం భావనా బ్రహ్మచక్షతే॥** ౫

**టీ॥ ఆత్మమన్త్రస్య** = ఆత్మమన్త్రమునకు, హంసస్య = జీవునకు, పరస్పర **సమన్వయాత్** = పరస్పర సంబంధముండుట వలన, **యోగేన** = చిత్తవృత్తి నిరోధముచే, **గతకామానామ్** = కోరికలు విడిచిన వారియొక్క **భావనా** = ధ్యానము, **బ్రహ్మ** = పరబ్రహ్మమని, **చక్షతే** = చెప్పుచున్నారు.

**దీపికా:** ఆత్మమన్త్రమునకు, జీవునకుగల అన్యోన్య ప్రతిపాద్య ప్రతిపాదక భావసంసర్గము వలన, యోగముచే (చిత్తవృత్తి నిరోధరూపమైన స్థిరమగు ఇన్ద్రియధారణమే యోగము) కామము గతించినవారల ధ్యానము బ్రహ్మమని చెప్పుచున్నాడు. మలినచిత్తముగల వారలకు మోక్షమునందు ఇచ్ఛ యున్నప్పటికి వేదాన్తశాస్త్రసిద్ధాన్త శ్రవణముచే మృత్యుగ్రాస రూప మగు జ్ఞానము కలుగుటలేదు. కనుక యోగాభ్యాసముచే చిత్తమందున్న





అరిషడ్వర్గ రూప మలినము హరింపబడిన దగుచుండగా, ఇదివఱకు ఉపదేశింపబడిన జ్ఞానము ఆభాసత్వమును వదలి సమ్యక్ జ్ఞానమును పొందుచున్నదని చెప్పుచున్నాడు. దానంజేసి అదేమి బాహ్యప్రయత్నము చేత పొందతగిన అన్య వస్తువుకాదని చిత్తవృత్తులను నిరోధించుటచే అప్రయత్నముగ తెలియబడుచున్నదని చెప్పుచున్నాడు.

**శరీరిణా మజస్యాన్తం హంసత్వం పారదర్శనమ్॥**
**హంసో హంసాక్షరం చైతత్కూటస్థం యత్తదక్షరమ్**
**తద్విద్వానక్షరం ప్రాప్య జహ్యాన్మరణ జన్మనీ॥** ౬

**టీ॥ శరీరిణామ్** = జీవులకు, **అన్తమ్** = నిశ్చయాత్మకమైన, **హంసత్వమ్** = జీవన్ముక్తత్వము, **అజస్యపారదర్శనమ్** = బ్రహ్మయొక్క సాక్షాత్కారము, **హంసః** = బ్రహ్మమును, **హంసాక్షరమ్ చ** = ప్రణవమునుకూడ, **ఏత త్కూటస్థమ్** = అట్టి ఒకేరూపమైయుండునది, **యత్** = ఏది, (కూటస్థమ్), **తదక్షరమ్** = అది నాశముకానిది, **విద్వాన్** = జ్ఞాని, **తత్ అక్షరమ్** = ఆ ప్రణవమును, **ప్రాప్య** = పొంది, **మరణజన్మని** = జననమరణములను, **జహ్యాత్** = విడిచి పెట్టుచున్నాడు.

**దీపికా: హం** అనునది ప్రాణవృత్తి, **సః** అనునది అపానవృత్తి. జ్ఞానియైన జీవుడు ప్రాణాపానవృత్తిరూపమైన ఉచ్ఛ్వాసనిశ్వాసములు అనుసంధాన ముజేసి కూటస్థుడైన పరమాత్మనుపొంది జననమరణములను విడిచి పెట్టుచున్నాడు. అట్టి జీవులకు నిశ్చయాత్మకమైన జీవన్ముక్తత్వము బ్రహ్మ యొక్క సాక్షాత్కారము. **"శ్రు. 'ఉచ్ఛ్వాసశ్చైవ నిశ్వాసో హంస ఇత్యక్షర ద్వయమ్। తస్మాత్ప్రాణస్తు హంసాఖ్య ఆత్మకారేణ సంస్థితః నాభేరు చ్ఛ్వాస నిశ్వాసా హృదయాగ్రే వ్యవస్థితాః"**

**కాకీముఖ కకారాన్త ముకారశ్చేతనాకృతిః।**
**మకారస్యతు లుప్తస్య కోఽర్థః సమ్ప్రతిపద్యతే॥ ౭**

**టీ॥ కాకీముఖ కకారాన్తమ్** = కాకీ పదాది క వర్ణాన్తము 'అకారము' **ఉకారశ్చేతనాకృతిః** = చేతనమైన హిరణ్యగర్భరూపమగు ఉకారము, **మకారస్యతు** = (మకారమనెడి అవ్యాకృతమునకు) మకారమునకూ, **లుప్తస్య** = లోపము కలుగగా, **కోఽర్థః** = ఏ అర్థము, **సమ్ప్రతిపద్యతే** = పొందబడుచున్నది.

**దీపికా:** జీవునిచే హంసమన్త్రానుసంధాన రూపముగా పొందబడిన నిశ్చయాత్మకమైన జీవన్ముక్తత్వము బ్రహ్మయొక్క సాక్షాత్కారము. ఈ బ్రహ్మపదార్థము ఇట్టిదని చెప్పుటకు వీలులేనిదని చెప్పుచున్నాడు. అకార ఉకార మకారములు లోపించగా ఏ అర్థము పొందబడుచున్న దనగా, అకార ఉకార మకారములను వర్ణత్రయము వేదత్రయము, లోకత్రయము, గుణత్రయమని చెప్పబడుచున్నవి. శరీరత్రయ అధిష్ఠాత లగు; విరాట్ విశ్వస్థూలరూపుడు బ్రహ్మ...అకారము
హిరణ్యగర్భుడు తైజసుడు సూక్ష్మరూపుడు విష్ణువు...ఉకారము
అవ్యాకృతుడు ప్రాజ్ఞుడు కారణరూపుడు రుద్రుడు...మకారము
విరాడ్విశ్వస్థూల రూపమైన అకారము ఉకారమునందు, హిరణ్యగర్భుడైన తైజసుని సూక్ష్మరూపము ఉకారము మకారమునందు, అవ్యాకృతుడు ప్రాజ్ఞుడు కారణరూపమైన మకారమునకు లోపము కలుగగా, అనగా మకారము నాదమునందు లీనముకాగా; ఈ జాగ్రత్స్వప్నసుషుప్తులను అతిక్రమించి యుండునట్టి అర్ధమాత్రారూపమైన నాదమే ఆత్మస్వరూపము సర్వసాక్షి. ఇది అద్వితీయము, తురీయము, కాలత్రయాబాధ్యమైనట్టి, అనవచ్ఛిన్నమైనట్టి పరబ్రహ్మము. ఇది బుద్ధిసహాయముచే ఇట్టిదని





చెప్పుటకు శక్యముకానిది. కనుక దీనిని ఏ పదార్థమనవలెను? అనిన ఆనన్దఘన స్వరూపమైన బ్రహ్మమే...

**గచ్ఛన్తిష్ఠన్సదాకాలం వాయుస్వీకరణం పరమ్।**
**సర్వకాలప్రయోగేన సహస్రాయుర్భవేన్నరః॥ ౮**

**టీ॥ గచ్ఛన్** = నడచునప్పుడును, **తిష్ఠన్** = స్థిరముగాయున్నప్పుడును, **సదాకాలమ్** = ఎల్లప్పుడును, **పరమ్** = శ్రేష్ఠమైన, **వాయుస్వీకరణమ్** = ప్రాణాయామమును, **సర్వకాలప్రయోగేన** = నిరంతరము చేయుటచే, **నరః** = నరుడు, **సహస్రాయుః** = వేయి సంవత్సరములాయుస్సు కలవాడు, **భవేత్** = అగును.

**దీపికా:** ఉత్తమ ప్రాణాయామము అనగా హంసమన్త్రానుష్ఠానము. సర్వకాల సర్వావస్థలయందు ఇట్టి ఉత్తమప్రాణాయామమును ఎల్లప్పుడు చేయుచుండవలెను. ప్రాణమనగా దేహమందున్న వాయువు, దీనిని లాగుటయనగా కుంభించుట. ఇదే ప్రాణాయామమని చెప్పబడుచున్నది. ఈ కుమ్భకము సహితకుమ్భకము, కేవల కుమ్భకమని రెండు విధములు. కేవల కుమ్భకము సిద్ధించువఱకు సహితకుమ్భకమును అభ్యాసము చేయుచుండవలెను. **కార్యా అశీతి పర్యన్తం కుమ్భకాస్సుసమాహితైః** ౮౦ కుమ్భకముల వఱకు అభ్యాసము చేయవచ్చునని శ్రుతి ప్రమాణీకరించింది. **పరం వాయుస్వీకరణం** శ్రేష్ఠమైన (ఉత్తమ) ప్రాణాయామ మనుటచే; రేచకపూరక రహితమైన కేవల కుమ్భకమనియే, ఈ కేవల కుమ్భకముచే నాడీగత మలము శుష్కించినదగుచుండగా సుషుమ్నయందు ప్రాణగతికూడ స్తంభించును. అట్టివారు అన్నియు తమ వశమందుంచుకొన్న వారగుటచే నరులని పిలవబడుచున్నారు. ఇట్టి కుమ్భక వాతాఘాతప్రజ్జ్వలిత జ్వాలలచే గ్రన్థిత్రయము భేదింపబడి పరావస్థను పొందిన యోగి (నరుడు)

జీవన్ముక్తుడగునని ఇతఃపూర్వమే చెప్పబడినది. ఇట్టివాడు లోకమునందు జరామరణములులేక ఖేచరాధిపతియై సర్వ కాలములందు వసించును. అనగా జరామరణములగూర్చి భయము లేనివాడగును.

**యావత్పశ్యే త్ఖగాకారం తదాకారం విచిన్తయేత్॥** ౯

**టీ॥ యావత్** = ఎంతవరకు, **ఖగాకారమ్** = హంసరూపమును, **పశ్యేత్** = చూచునో, (**తావత్** = అంతవరకు) **తదాకారమ్** = ఆ ఖగాకారమును, **విచిన్తయేత్** = ధ్యానింపవలెను.

**దీపికా:** ఎంతకాలమునకు హంసస్వరూపమును దర్శించునో, అంత వఱకు, అనగా అభ్యాసకుమ్భకముచే ఖేచరీసిద్ధి గలవాడై ఎప్పటికి ఖేచరాధిపతిని చూచునో అంతకాలము వఱకు; ఖేచరాధిపతిని చూచుట యనగా ఆత్మ స్వరూపుడు తానగుటయే. అంతవఱకు ఆ ఖేచరాధిపతి యైన బ్రహ్మ స్వరూపమును ధ్యానించవలెను. **ఏవం సమభ్యసేద్వాయుం సబ్రహ్మాణ్డ మయో భవేత్** అని శ్రుతికూడ ఈ విషయమునే ప్రమాణీక రించుచున్నది. ఖగమనగా హకారము. ఖగాకారం అనగా హ్రీఙ్కారమని రహస్యం. శ్రు. **'ఖేచరావసథం వహ్నిమమ్బుమణ్డల భూషితం ఆఖ్యాతం ఖేచరీబీజం తేన యోగః ప్రసిద్ధ్యతి'** హ్రీఙ్కార సాక్షాత్కార పర్యన్తము ఆ రూపమును ధ్యానింపవలెను. (ప్రాణాయామ సాధన గురుముఖైక వేద్యము, అన్యథా సాహసమేయగును).

**ఖమధ్యే కురుచాత్మాన మాత్మమధ్యే చ ఖం కురు**
**ఆత్మానం ఖమయం కృత్వా నకిఞ్చదపి చిన్తయేత్॥** ౧౦

**టీ॥ ఖమధ్యే** = (పరమాత్మరూప) ఆకాశమధ్యమున, **ఆత్మానమ్** = (మనస్సును) బ్రహ్మరూపమును, **కురు** = ఉంచుము. **ఆత్మమధ్యేచ** =





ఆ పరమాత్మమధ్యయందు, **ఖం కురు** = ఆకాశమును ఉంచుము. **ఆత్మానమ్** = పరమాత్మను, **ఖమయమ్** = ఆకాశముగా, **కృత్వా** = చేసి, **కిఞ్చిదపి** = కొంచముకూడా, **నచిన్తయేత్** = చింతింపకూడదు.

**దీపికా:** ఆకాశమధ్యమున బ్రహ్మరూపమును, పరమాత్మమధ్యయందు ఆకాశమునుంచుట అనగా పరమాకాశమును బ్రహ్మముగా, పరమాత్మను పరమాకాశముగాను యెఱుంగుట. ఆకాశమందు బ్రహ్మమును, బ్రహ్మమందు ఆకాశమును ఉంచుమని చెప్పుట ధ్యేయవస్తువు సర్వవ్యాపకమైనదని చెప్పుటకే. శ్రు. **పరమాత్మ గగనే బిన్దుం నిక్షిప్య॥ శ్రు. మన ఏవహి బిన్దుశ్చోత్పత్తి స్థితికారణమ్.** శూన్యమున మనస్సును ఉంచుము, మనస్సును శూన్యముగా చేయుము అని శ్రుతి చెప్పుచున్నది. మనస్సును శున్యముగాచేసి కొంచమైనను చింతింపగూడదు. అనగా పరమాకాశ మధ్యమున మనస్సునుంచి మనస్సుని వృత్తిశూన్యముగా చేయుము అని; వ్యష్టి ప్రపఞ్చముయొక్క ఉత్పత్త్యాదికమునకు కారణ భూతమగుటచే మనస్సు బిన్దువగుచున్నది. బిన్దువనగా ఈశ్వరుడు. వృత్తిశూన్యమైనట్టి సర్వకారణమైన మనస్సు '**శ్రు. పరమాకాశం ఏవం తత్తలక్ష్యదర్శనా తత్తద్రూపో భవతి.'** పరమాకాశరూపమైన పరమాత్మయే యగును. ఇట్టి మనస్సుచే ఇతర వస్తువులను చింతింపకుము. **'ఆత్మ సంస్థం మనఃకృత్వా న కిఞ్చదపి చిన్తయేత్'** అని భగవద్గీత. ఇట్టివాడు ఉన్మన్యవస్థను బొందును.

**స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః**
**బహిర్వ్యోమస్థితం నిత్యం నాసాగ్రేచ వ్యవస్థితమ్**
**నిష్కళం తం విజానీయాత్ శ్వాసోయత్రలయం గతః॥** ౧౧

**పుటద్వయ వినిర్ముక్తో వాయుర్యత్ర విలీయతే।**

**తత్ర సంస్థమ్మనః కృత్వా తం ధ్యాయేత్పార్థ ఈశ్వరమ్॥ ౧౨**

**టీ॥ బ్రహ్మవిత్** = పరబ్రహ్మము నెఱుంగదలచినవాడు, **స్థిరబుద్ధిః** = స్థిరబుద్ధికలవాడై, **అసమ్మూఢః** = అజ్ఞానములేనివాడై, **బ్రహ్మణి** = బ్రహ్మమందు, **స్థితః** = ఉన్నవాడై, **నిత్యమ్** = నిరతము, **శ్వాసః** = శ్వాసము, **యత్ర** = ఎచ్చట, **లయఙ్గతః** = లయమును పొందునో, (తత్ర) **నాసాగ్రే** = భ్రూమధ్యమందు, **వ్యవస్థితమ్** = ఉన్నదియు; **బహిర్వ్యోమస్థితమ్** = బాహ్యాకాశమునందుండునదియు, **నిష్కళమ్** = అవయవ రహితమైనదియగు, **తమ్** = బ్రహ్మమును, **విజానీయాత్** = ఎఱుంగవలెను. **పార్థా** = అర్జునుడా! **పుటద్వయవినిర్ముక్తః** = నాసాపుట ద్వయమునుండి విడుబడిన, **వాయుః** = వాయువు, **ఎత్ర** = ఎక్కడ, **విలీయతే** = లయించునో, **తత్ర** = అచట, **మనః** = మనస్సు, **సంస్థం కృత్వా** = స్థిరమొనర్చి, **తం ఈశ్వరమ్** = ఆ ఈశ్వరుని, **ధ్యాయేత్** = ధ్యానము చేయవలెను.

**దీపికా:** ఇతఃపూర్వము ధ్యేయవస్తువు సర్వవ్యాపకమైనదని చెప్పి, అట్టి సర్వవ్యాపకమైన బ్రహ్మమునందు మనస్సు నిలకడగా నుంచినవాడు బ్రహ్మజ్ఞానియని, ఇట్టి యోగియొక్క మనస్సు బ్రహ్మమునందు స్థిరముగా నుంగుటకు ధారణావిశేషమును ఇక్కడ చెప్పుచున్నాడు. బ్రహ్మము నెఱుంగ దలచినవాడు స్థిరబుద్ధిగలవాడై అజ్ఞానములేనివాడై ఎల్లప్పుడు బ్రహ్మమునందు ఉన్నవాడై అనగా సదాబ్రహ్మచారియై బాహ్యాకాశము నందుండి, ఎచ్చట శ్వాసలయమును పొందునో ఆ నాసాగ్రమునందున్న నిరవయవి యగు బ్రహ్మమును ఎఱుంగవలెను. (ఇది పూర్ణిమాదృష్టిగా శ్రుతిచే పేర్కొనబడినది).





**శ్రు॥ బహిర్లక్ష్యస్తు నాసాగ్రే చతుష్షడష్టదశ ద్వాదశాఙ్గుళిభిః క్రమాత్ నీలద్యుతిశ్యామత్వ సదృగ్రక్త భఙ్గీస్ఫురచ్ఛుక్ల పీతవర్ణద్వయోపేతం వ్యోమ తత్త్వం పశ్యతి, స తు యోగీ, చలదృష్ట్యా వ్యోమభాగవీక్షితుః పురుషస్య దృష్ట్యగ్రే జ్యోతిర్మయూఖా వర్తన్తే, తదృష్టిః స్థిరా భవతి, శీర్షోపరి ద్వాదశాంగుల మాన జ్యోతిః పశ్యతి, తదాఽమృతత్వమేతి॥**

నాసికాగ్రమునందు నాలుగు,ఆరు,ఎనిమిది,పది,ద్వాదశ అఙ్గుళములచే క్రమముగా నీల శ్యామ రక్త శుక్ల పీతవర్ణములుగా కనబడు వ్యోమతత్త్వమును చూచును. ఇచ్చట శ్వాసలయమును పొందును. నాసాగ్రభాగమునందు జ్యోతిసమూహ దర్శనము కలిగినయెడల అమృతత్త్వము కలుగును. అనగా అవయవశూన్యమైన పరబ్రహ్మమును ఎఱుంగును. ఇదియే పూర్ణిమాదృష్టి. ఖేచరీముద్రా లక్షణము.

**శ్రు॥ సర్వోన్మీలితం పూర్ణిమా భవతి, తాసు పూర్ణిమాభ్యాసః కర్తవ్యః, తల్లక్ష్యం నాసాగ్రం, తదా తాలుమూలే గాఢతమో దృశ్యతే, తదాభ్యాసాద ఖణ్డ మణ్డలాకార జ్యోతిర్దృశ్యతే, తదేవ సచ్చిదానన్దం బ్రహ్మ భవతి.**

కనులు తెఱచి సమస్తమును వీక్షించుట పూర్ణిమాదృష్టి. ఇదియే అభ్యసింప తగినది. దీని లక్ష్యము నాసాగ్రము. దీని అభ్యాసముచే అఖణ్డమణ్డలాకార జ్యోతి కనబడును. దీనిని అభ్యసించుటచే వాయుస్థైర్యమును, మనో లయమును కలుగును. దీనిని ఖేచరీముద్రయని చెప్పుదురు.

**శ్రు. అనిర్వచనీయ జ్యోతిస్సర్వవ్యాపకం నిరతిశయానన్ద లక్షణం పరమాకాశం ఏవం తత్తలక్ష్యదర్శనా త్తత్త్రూపో భవతి.**

ఈ అనిర్వచనీయ జ్యోతి సర్వవ్యాపక నిరతిశయానన్దలక్షణ పరమా కాశము. దీనిని ధ్యానింపవలెను. ఇట్లు ధ్యానించిన మనస్సు నిశ్చల మగును.

**నిర్మలం తం విజానీయాత్ షడూర్మి రహితం శివమ్।**
**ప్రభాశున్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయమ్**
**సర్వశూన్యం నిరాభాసం సమాధిస్థస్య లక్షణమ్॥** ౧౩

**టీ. తమ్** = వానిని (ఆఈశ్వరుని), **నిర్మలమ్** = నిర్మలునిగను, **షడూర్మి రహితమ్** = షడూర్ములు లేనివానిగను, **శివమ్** = మఙ్గలకరునిగను, **విజానీయాత్** = ఎఱుంగవలెను, **సమాధిస్థస్య** = సమాధియందున్న వానికి, **ప్రభాశూన్యం** = కాంతిలేనిదియు, **మనశ్శూన్యమ్** = మనస్సు లేనిదియు, **బుద్ధిశూన్యమ్** = ఆసక్తిలేనిదియు, **నిరామయమ్** = రోగము లేనిదియును, **సర్వశూన్యమ్** = ఏమియులేనిదియు, **నిరాభాసమ్** = భ్రమలేనిదియునగు ఉనికియే, **లక్షణమ్** = లక్షణము.

**దీపికా:** సర్వవ్యాపక నిరతిశయానంద లక్షణుడు, జ్యోతిస్వరూపుడగు ఆ ఈశ్వరుని జననమరణ క్షుత్పిపాసాహర్షశోకములనెడి షడూర్ములు లేని, నిర్మలునిగ, మఙ్గలకరునిగా తెలియవలెను. సమాధియందున్న వానికి కాంతిలేదు అనగా శబ్దకాల లయముచే దివారాత్రుల నతిక్రమించినవాడు. '**శ్రు. తస్యకర్మలేపః, రవేరుదయాస్త మయయోః కింకర్మ కర్తవ్యమ్**' కర్మ సూర్యాశ్రయమైనట్టిది. సూర్యోదయా స్తమయపర్యన్తము కర్మచేయ వలసినది. శబ్దకాల లయముచేత ఉ న్మన్య వస్థయందున్న యోగికి కాలభేదములు లేకపోవుటచే సర్వకర్మలు నాశ మగును. ఏకర్మమును లేదనిభావము. ఇన్ద్రియార్థములనుండి మనస్సును నిగ్రహించుటచే మనస్సులేనిదై బుద్ధిశూన్యమగుచున్నది. ఇట్టివాడు భ్రమరహితుడై పఞ్చవింశతి తత్త్వములతో కూడిన జీవుడు సర్వమును (అనగా ఇరువదినాలుగు తత్త్వములను త్యజించి) లేనివాడై (అనగా స్వవ్యతిరిక్తమైన వస్తుజాలమంతయు మిధ్యయైనందున ఆనన్దైక





రసమైన బ్రహ్మమేదికలదో, అట్టి తానొక్కండు మాత్రమే మిగిలియుండు టచే ఏమియు లేనావాడు) ఇరువదియాఱవ తత్త్వమైన పరమాత్మయే నేననెడి నిశ్చయాత్మకుడగుచున్నాడు. ఇదియే సమాధియందున్న వాని లక్షణము.

**త్రిశూన్యం యోవిజానీయాత్ సతుముచ్యేత బన్ధనాత్॥** ౧౪

**టీ॥ యః** = ఎవడు, **త్రిశూన్యమ్** = ప్రభాశూన్య, మనశ్శూన్య, బుద్ధి శూన్యములను, **విజానీయాత్** = ఎఱుంగునో, **సః** = వాడు, **బన్ధనాత్** = సంసారమునుండి, **ముచ్యేత** = విడువబడును.

**దీపికా:** పూర్వోక్త సమాధిస్థితుడైన వాని లక్షణములను చెప్పుచునాడు. ఎవడు త్రిశూన్యముల ఎఱుంగునో నిస్తరఙ్గ సముద్రమువలె సంపూర్ణ భావాభావ విహీనుడై సంసారమునుండి విడువబడి కైవల్యసిద్ధికల వాడగును. ఈ త్రిశూన్యమే శ్రుతులందు త్రిపుటిగా చెప్పబడెను.

**స్వయముచ్చలితే దేహే దేహీ న్యస్తసమాధినా।**
**నిశ్చలం తం విజానీయాత్ సమాధిస్థస్య లక్షణమ్॥** ౧౫

**టీ॥ దేహేస్వయమ్** = అనాది ప్రారబ్ధకర్మవశముచే శరీరము, **ఉచ్చలితే** = గమనాదికము చేయుచున్నప్పటికి, **దేహీ** = జీవుడు, **న్యస్త సమాధినా** = పొందబడిన నిశ్చల సమాధియోగముచే, **నిశ్చలమ్** = చలన రహిత మైన, **తమ్** = ఆ పరబ్రహ్మమును, **విజానీయాత్** = తెలుసుకొను చున్నాడు. **సమాధిస్థస్యలక్షణమ్** = సమాధియందున్న వానికిది లక్షణము.

**దీపికా:** పైవిధముగా సంసారమునుండి విడువబడి ముక్తుడైన వానికి దేహాదులయందు అభినివేశములేదని తెల్పుచున్నాడు. దేహమనగా ఆధిభౌతిక దేహము (**స్వాజ్ఞవికల్పిత భౌతికదేహమధికృత్య భవతీతి**

**ఆధిభౌతిక దేహః)** ప్రాణవాయువుచే చలింపచేయవలెను. బ్రహ్మసూత్ర మందలి గుణత్రయ సముద్భూతమైన బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రన్థిత్రయము కదలబడుచుండగా ఆధిభౌతికమైన యీశరీరము ఆధిదైవిక శరీరము నందు లయమందును. ప్రత్యగభిన్న పరమాత్మస్వరూపమే తన దేహమని స్ఫురించును. పాఞ్చభౌతికదేహము వినిర్మలము నిర్మలమైన అతి వాహికత్వము **(స్వాజ్ఞవికల్పిత ప్రపఞ్చాధారతయా సమన్తాత్ వహతీతి అతివాహికతా బ్రహ్మతా)**ను బ్రహ్మభావమును పొందును. ఇట్లు తెలుసుకొన్న జీవుడు స్వయముగాపొందబడిన సమాధిచే; సమాధి యనగా **(సర్వశరీరేషు చైతన్యైకతానతా ధ్యానమ్। ధ్యాన విస్మృతి స్సమాధిః)** సకల శరీరములయందును (జీవులయందును) చైతన్య మొక్కటియేయను భావమును పొందును. ఈ భావనయే ధ్యానము, ఇట్టి ధ్యానవిస్మృతియే సమాధి. అనగా తత్త్వదర్శనముచే నిశ్చలమైన నిర్మలమైన చిత్తమును కలిగియుండుట. ఇదియే సమాధి. ఇట్టి సమాధిచే నిశ్చలమైన ఆ పరమాత్మను, సర్వదా సాక్షిస్వరూపుడైన కేవల ఈశ్వరుని తెలుసుకొనుచున్నాడు. ఇట్టి స్థిరబుద్ధి సర్వదా కలిగియుండుటయే సమాధియందున్నవాని లక్షణము. దానంజేసి పరమాత్మయు, దేహాభి మానియగు జీవుడును ఒక్కరేయను జ్ఞానము కలుగుట సమాధి.

**అమాత్రం శబ్దరహితం స్వరవ్యఞ్జన వర్జితమ్।**
**బిన్దునాద కలాతీతం యస్తం వేద స వేదవిత్॥ ౧౭**

**టీ॥ అమాత్రమ్** = (హ్రస్వదీర్ఘప్లుతములు లేనిదియు) కాలభేదమ్ములు లేనిదియు, **శబ్దరహితమ్** = శబ్దము లేనిదియు, **స్వరవ్యఞ్జన వర్జితమ్** = అచ్చులు హల్లులు లేనిదియు, **బిన్దునాదకలాతీతమ్** = బిన్దునాద కలలకు అతీతమైనదియు, **తమ్** = ఈ పరబ్రహ్మమును, **యః** = ఎవడు, **వేద** = తెలిసికొనునో, **సవేదవిత్** = అతడు వేదవేత్త.

**దీపికా:** ఇట్టి సమాధియందున్నవాని లక్షణము చెప్పుచున్నాడు. వాగ్వృత్తి పరావస్థయందు బీజరూపముగానుండి, పశ్యన్తియందు రెండుదళములు గలదై, మధ్యమయందు ముకులితమై, వైఖరియందు వికాశమును పొందు చున్నది. మాత్రా 'కాల' భేదములేని, నామ రూపాసంభవమగు, అపరి చ్ఛేదమువలన తేజస్సుగానిదియు, కూటస్థుడగు పరాస్వరూపుని యెవ్వ డెఱింగియుండునో వాడే బ్రహ్మమును తెలిసిన వాడు. అనగా బ్రహ్మము గానే అగుచున్నాడు. ఇట్టివాడు సకలవేదాన్తతాత్పర్యజ్ఞుడు, అనాఖ్యమును అనభివ్యక్తమును అగు 'సత్' మాత్రముగనే మిగులు చున్నాడు. నివృత్తి మార్గమందున్న వారల ఉపాసన సంహారక్రమ ముననే యుండవలెనని ఇందుమూలముగా తెలియదగినది.

**ప్రాప్తేజ్ఞానేన విజ్ఞానే జ్ఞేయం చ హృదిసంస్థితే।**
**లబ్ధశాన్తి పదే దేహే నయోగే నైవధారణా॥ ౧౮**

**టీ॥ జ్ఞానేన** = జ్ఞానముచే, **విజ్ఞానే** = పరతత్త్వజ్ఞానము, **ప్రాప్తే** = పొందబడగా, **జ్ఞేయమ్** = పరబ్రహ్మము, **హృదిసంస్థితే** = హృదయమందు ప్రకాశింపు చుండగా, **దేహే** = జీవుడు, **లబ్ధశాన్తిపదే** = శాన్తిస్థానమును పొందుచుండగా, **నయోగః** = యోగములేదు, **నైవధారణా** = ధారణాము లేదు.

**దీపికా:** సమాధియందున్న బ్రహ్మజ్ఞానికి సకలభావనలు నివర్తియైన పిమ్మట ప్రాప్తమైనదేదియు లేదను విషయమును చెప్పుచున్నాడు. వేదాన్త శ్రవణ మనన నిదిధ్యాసాదికమందు మగ్నమైయుండి శాస్త్రార్థాభ్యాసానుభవ పూర్వకమగు జ్ఞానముచే ఉపనిషత్ప్రతిపాద్యమైన బ్రహ్మము పొందబడగా ప్రత్యగ్భూతుడగు పరమాత్మ హృదయమందు ప్రకాశించుచుండగా జీవుడు శాన్తిస్థానమును (ఉన్మన్యవస్థ) పొందుచున్నాడు. ఇట్టివానికి యోగములేదు.

అనగా తనకు భిన్నముగా నేదియు (జగత్తుగాని, మాయగాని) వాస్తవముగ కలుగుటలేదు. మరియు పృధ్వీభాగమునందు బ్రహ్మను ధారణచేయవలెను, జలభాగమునందు విష్ణువును ధారణచేయవలెను, అగ్న్యంశమున రుద్రుని ధారణచేయవలెను, వాయుభాగమునందు ఈశ్వరుని, ఆకాశమున సదాశివుని ధారణచేయవలెనని ఇట్లు ధారణచేయునప్పుడు **'హయవరల'** అను బీజములను క్రమముగా జపించవలయునని శ్రతి పలుకుచున్నది. దీనిచే పఞ్చాశద్వర్ణములు, నామరూపాత్మకమగు సకలజగత్తు దృగ్గోచర మగుచున్నది. బ్రహ్మాది కార్యరూపముల నన్నింటిని కారణభూతమైన తనయందుచేర్చిన వాడు అవ్యక్తము, అనిరూప్యము, పూర్ణము, ప్రణవప్రతిపాద్యమగు కేవలుడుగనుండగా ధారణలేదు గదా! జీవన్ముక్తునకు బ్రహ్మానుభవము స్వతసిద్ధమైయుండగా తన్నిమిత్తములైన సాధనములు ప్రయోజన శూన్యములని భావము.

**యోవేదాదౌ స్వరఃప్రోక్తో వేదాన్తేచ ప్రతిష్ఠితః।**
**తస్యప్రకృతిలినస్య యఃపర స్సమహేశ్వరః॥** ౧౮

**టీ॥ వేదాదౌ** = శ్రుతులకు ఆదియందు, **యః** = ఏ, **స్వరః** = స్వరము (ప్రణవము), **ప్రోక్తః** = చెప్పబడెనో, **వేదాన్తే** = వేదములయొక్క అన్త్యభాగమునందు, **ప్రతిష్ఠితః** = ప్రతిష్ఠింపబడినదో, **ప్రకృతిలీనస్య** = ప్రకృతియందు లీనమైయున్న, **తస్య** = ఆ ఓఙ్కారమునకు, **యః** = ఎవడు, **పరః** = పరమైయుండునో, సః = వాడు, **మహేశ్వరః** = పరమేశ్వరుడు.

**దీపికా:** పైవిధముగా అపరోక్షముగా బ్రహ్మమునెఱిగిన వాడు జీవన్ముక్తుడై ఈశ్వరసంజ్ఞను పొందుచున్నాడని వాని రూపమును తెల్పుచున్నాడు. వేదములయొక్క పూర్వార్థ వ్యవహారమున ఏ స్వరము అనగా సర్వత్రా ఏకరూపముగానుండు ఏ ప్రణవము చెప్పబడెనో; వేదముయొక్క





నిశ్చయార్థకముగా అనగా ఉపనిషత్ప్రతిపాద్య పరతత్త్వమందు ప్రతిష్ఠింపబడినదో; **'భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ, అహఙ్కార ఇతీయం మే భిన్నాప్రకృతిరష్టధా'** అను స్మృత్యనుసారము ప్రకృతి అష్టవిధములు. ఇట్టి ప్రకృతియందు లీనమైయున్న అనగా ప్రకృత్యష్టకరూపము కలిగియున్న ఆ ప్రణవమునకు ఎవడు పరుడో అనగా అర్ధమాత్రా స్వరూపుడో వాడు మహేశ్వరుడు. ఈ అర్ధమాత్రయే ప్రణవాగ్రము. ఇది జ్యోతిర్మయము. ఈ ప్రణవాగ్రమే బ్రహ్మమని **'తదగ్రం బ్రహ్మాచోచ్యతే'** శ్రుతి పలుకుచున్నది. జీవన్ముక్తుడైన యోగి ఇట్టి జ్యోతిర్మయుడగుచున్నాడు.

**నావార్థీహి భవేత్తావద్యావత్పారం నగచ్ఛతి।**
**ఉత్తీర్ణేచ సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్॥** ౧౯

**టీ॥ యావత్** = ఎంతవఱకు, **పారమ్** = ఒడ్డును, **నగచ్ఛతి** = చేరడో, **తావత్** = అంతవఱకు, **నావార్థీహి** = నావను సేవించువానిగ, **భవేత్** = అగును, **సరిత్పారే** = నదియొడ్డు, **ఉత్తీర్ణేచ** = దాటినవాడుకాగా, **నావయా** = నావవలన, **కిం ప్రయోజనమ్** = ఏమిప్రయోజనము.

**దీపికా:** ఎంతవఱకు అవస్థాత్రయమును దాటి సమాధినిష్ఠుడు కాడో, అంతవఱకు వేదాన్త శ్రవణమనన నిదిధ్యాసాదికము, శాస్త్రార్థాభ్యాసానుభవరూపమైన నావ ప్రయోజనముగా గలవాడు. జీవుడు నిద్రాద్యవస్థాత్రయము దాటి జీవభావమును విడిచినవాడై; పరమాత్మయు, దేహాభిమానియగు జీవుడును ఒక్కరేయను జ్ఞానరూపమైన సమాధియందు నిష్ఠగలవాడైన ఈ శాస్త్రసాధనముల వలన (యోగమువలన) ప్రయోజనము లేదు. అని పరబ్రహ్మ సాక్షాత్కారమును పొందుటకు ఇతఃపూర్వము ఏసాధనములు అవసరమో, వాటితో జ్ఞానము పొందినవానికి పనిలేదని చెప్పుచున్నాడు. ఇంకను...

**గ్రన్థమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞాన తత్పరః।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రన్థ మశేషతః॥ ౨౦**

**టీ॥ మేధావీ** = బుద్ధిమంతుడు, **గ్రన్థమ్** = వేదాన్తశాస్త్రగ్రన్థమును, **అభ్యస్య** = అభ్యసించి, **జ్ఞానవిజ్ఞానతత్పరః** = జ్ఞానవిజ్ఞానముల నెఱిగిన వాడై, **ధాన్యార్థీ** = ధాన్యమునుకోరువాడు, **పలాలమివ** = గడ్డినివలె, **గ్రన్థమ్** = గ్రన్థమును, **అశేషతః** = నిశ్శేషముగా, **త్యజేత్** = విడువలెను.

**దీపికా:** బుద్ధిమంతుడు వేదాన్తశాస్త్రాదులను అభ్యసించి శాస్త్రార్థాభ్యాసానుభవ పూర్వకమగు జ్ఞానమచే శాస్త్రప్రతిపాద్యమైన బ్రహ్మము నెఱింగిన వాడై, ధాన్యమును కోరువాడు గడ్డిని విడిచినట్లు; అక్షర సమామ్నాయ ఇన్ద్రజాలరూపమైన గ్రన్థమును పూర్తిగా విడువవలెను. అనగా మౌనమును ఆశ్రయింపవలెనని తెలియదగినది.

**ఉల్కాహస్తోయథా కశ్చిద్ద్రవ్య మాలోక్య తాం త్యజేత్।**
**జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్ ॥ ౨౧**

**టీ॥ కశ్చిత్** = ఒకానొకడు, **ఉల్కాహస్తః** = జ్వాలలేని నిప్పుచేతినుంచుకొన్నవాడై, **ద్రవ్యమ్** = ధనమును, **ఆలోక్య** = చూచి, **యథా** = ఎట్లు, **తామ్** = ఆ నిప్పును, **త్యజేత్** = విడుచునో, **(తథా) జ్ఞానేన** = జ్ఞానముచే, **జ్ఞేయమ్** = బ్రహ్మమును, ఆలోక్య = అపరోక్షీకరించుకొని, **పశ్చాత్** = తరువాత, **జ్ఞానమ్** = అపరోక్షజ్ఞాన సాధనమును, **పరిత్యజేత్** = విడువవలెను.

**దీపికా:** అన్ధకారమందున్న వస్తువును పరిగ్రహింపదలచినవాడు ఏవిధముగా అన్ధకారమును దూరముచేయు సమర్థమైన కొరివిని చేకొని అపేక్షిత ద్రవ్యమును గ్రహించి పిమ్మట ఆ కొరివిని పారవేయునో, అదే విధముగా జ్ఞేయమును జ్ఞానమువలనపొంది, పిమ్మట ఆ జ్ఞానమును





పరిత్యజింపవలయును. కాని బ్రహ్మవిద్యోపనిషత్తునందు దీనికి వ్యాఖ్యానమున **"కైవల్యప్రాప్తావపి తదుపకారక జ్ఞానం న త్యాజ్యమిత్యాహ ఉల్కేతి."** అని అవతారిక నొనర్చినారు.

ఉల్కాహస్తుడనగా లోకవ్యవహారపరుడు భోగి. వేదములయొక్క పూర్వ భాగము సంపదకు, స్వర్గాది భోగములకు అగ్న్యారాధనను విధించినది. జ్వాలలేని నిప్పు చేతియందుచుకొన్నవాడు అనగా యజ్ఞయాగాది రూపమైన అగ్న్యారాధనయందున్నవాడు. అపేక్షిత స్వర్గభోగములు లభించిన, కర్మకు అవకాశములేని ఆస్థానముల (స్వర్గాది లోకాన్తరములందు) అగ్నినివదలి వేయుచున్నవాడై భోగమునందే దృష్టికలిగియున్నటుల; అపరోక్షజ్ఞాన సాధనములవలన బ్రహ్మమును అపరోక్షీకరించుకొన్న జీవన్ముక్తుడు **'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి'** అను శ్రుత్యనుసారముగా జ్ఞేయరూపుడగుటచే శాస్త్రమునువిడిచి మౌనమును ఆశ్రయించు చున్నాడు.

**యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్।**
**ఏవం తం పరమం జ్ఞాత్వా వేదైర్నాస్తి ప్రయోజనమ్॥ ౨౨**

**టీ॥ యథా** = ఏవిధముగా, **అమృతేన** = అమృతమువలన, **తృప్తస్య** = తృప్తిపొందినవానికి, **పయసా** = నీటిచే, **కిం ప్రయోజనమ్** = ఏమి ప్రయోజనము; **ఏవమ్** = ఈవిధముగా, **పరమమ్** = శ్రేష్ఠమైన, **తమ్** = బ్రహ్మమును, **జ్ఞాత్వా** = అపరోక్షీకరించుకొన్న, **వేదైః** = వేద, వేదాన్త శాస్త్రములతో, **నాస్తి ప్రయోజనమ్** = ప్రయోజనములేదు.

**దీపికా:** సహస్రారాన్తర్గత ఘనీభూత సుధామణ్డలమందలి అమృతమును ఎవడు పానమొనర్చునో వానికి క్షుత్పిపాసాలు కలుగుటలేదు. ఇట్టి వానికి అన్నపానములతో ప్రయోజనము లేదుగదా! కనుక భోజన

పానాదికముచే కలుగు సర్వవిధములైన పుణ్యపాపములు ఇట్టి యోగిని తాకకనే తొలగిపోవును. ఈ రీతిగా ఆ తురీయకూటస్థుని బ్రహ్మమును తెలిసికొనిన వానికి; విధినిషేధములు, దానధర్మములు, యజ్ఞయాగాది క్రతురూపముల ననేక విధములుగా ప్రకాశించెడి వేదములతో ప్రయోజనమేమి? అనగా స్వర్గాది వివిధ దేవతా లోకప్రాప్తికరములైన వేదంబుల పూర్వార్ధ వ్యవహారమునకు లక్ష్యము మోక్షమే. ఇది క్రమముక్తి. తత్త్వమార్గమందున్న యోగి అంగీకరింపబడిన వైరాగ్యమువలన కర్మము, తత్ఫలము వ్యర్థమనితలంచి, విహితకర్మలను అనుష్ఠించుచుండినను నిష్కాముడై భగవానుని సత్తామాత్ర అన్తర్లక్ష్యరూపమును అపరోక్షీకరించు కొని బ్రహ్మానన్దస్మృతినిబొంది శుద్ధాద్వైతబ్రహ్మమే తానని తెలునుకొను చున్నాడు. అట్టి వానికి శ్రుతిస్మృతి కర్మలేవియు ఉపయోగింపవు.

**జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।**
**నచాస్తి కిఞ్చిత్కర్తవ్య మస్తిచేన్న స తత్త్వవిత్॥** ౨౩

**టీ॥ జ్ఞానామృతేన** = జ్ఞానమను అమృతముచే, **తృప్తస్య** = తృప్తుడై, **కృతకృత్యస్య** = కృతకృత్యుడైన, **యోగినః** = యోగికి, **కర్తవ్యమ్** = చేయతగినది, **నచాస్తి** = లేదు; **కిఞ్చిత్ అస్తిచేత్** = కొంచమైనను కర్తవ్యముకలవాడైన, **సః** = వాడు, **న తత్త్వవిత్** = తత్త్వజ్ఞుడుకాడు.

**దీపికా:** పూరోక్తప్రకారముగా జ్ఞానరూపమైన సమాధియందు నిష్ఠగల వాడు, మౌనియైన వానికి విధి నిషేధాలతో పనిలేదని చెప్పుచున్నాడు. జాగ్రత్ప్రవృత్తిగల యోగి మద్భిన్నమైనదేదియు లేదనెడి వివేకమను అమృతముచే తృప్తుడై నేను బ్రహ్మముగానున్నానని తలంచి, సర్వాత్మ భావనచే కృతకృత్యుడు అగుచున్నాడు. కృతకృత్యుడు అంటే **"అనుష్ఠేయం స్వాభీష్టఫలప్రాప్తిలక్షణం యేన సకృతకృత్యః"** చేయతగిన స్వాభీష్టలక్షణ





ప్రాప్తిరూపమగు ఫలము ఎవనికగునో వాడు కృతకృత్యుడు. వైదికమైన ఉపదేశము ద్వివిధముగా కనబడుచున్నది. లౌకికమార్గ సంబంధియైనది, ఆత్మజ్ఞాన సాధనరూపమైనది. ఈ ద్వివిధమైన ఉపదేశమార్గములమధ్య హస్తిమశకాన్తర వ్యత్యాసము ఉంది. యజ్ఞయాగాది క్రతుకర్మరూపమైన; నిత్యనైమిత్తిక అగ్నిహోత్ర సంబంధమైన వ్రీహిమన్త్రాదికములు కర్మ సంబంధము కలవిగానేయున్నాయి. ఈ లౌకికబోధ కర్మప్రవృత్తికి హేతుభూతమగుచున్నది. అపేక్షితార్థలాభమునకై ఈ దేవతకొఱకు ఈ ఆహుతిని ఇయ్యవలసినది అను తలంపు కర్మలయందు అనురక్తినే కలిగించును. ఇది ప్రవృత్తి హేతువు. ప్రవృత్తియున్నదనగా కృతకృత్యత లేదనియే భావము. కర్తవ్యమున్నయెడల వాడు తత్త్వవేత్తయని చెప్పబడడు. ఇచ్చట యోగి జ్ఞానామృతాస్వాదనముచే నిత్యతృప్తుడు. ఇట్టి యోగి తనకు వేరుగా ప్రపఞ్చమనునది లేదని తెలుసుకొన్న వాడగుటచే, వీనికి చేయదగిన కర్మముగాని, చేయదగని కర్మముగాని లేదు. ఉచ్చనీచాదులు వీనిని అంటజాలవు. యోగి త్రిపుటీనాశన పురస్సరముగా జీవబ్రహ్మైక్య స్థితియగు సమాధినిగాని, వేదవిదితమైన కర్మలనుగాని చేసినను, చేయకున్నను అది అంగీకార్యమే. ఇతడు ఈషణ త్రయమును విడిచి బ్రహ్మానన్దస్వరూపుడై పరబ్రహ్మ స్వరూపావస్థను పొందినవాడు కావున ఈ యోగి జీవన్ముక్తుడనియు, విదేహముక్తు డనియు తెలియబడుచున్నాడు. **"శ్రు. నతస్య ప్రాణా ఉత్క్రామంతి. అత్రైవ సమలీయన్తే."** అను శ్రుతి ఈ విషయమునే బోధించుచున్నది. **"సంత్యక్త వాసనాన్మౌనాదృతే నా స్త్యుత్తమం పదమ్"** అని ముక్తికోపనిషత్తు ఈ భావమునే వ్యక్తీకరిస్తోంది. ఇట్టి వాడు తత్త్వవిదుడని చెప్పబడు చున్నాడు. కాని, కర్తవ్యశేషభావన యున్నవాడు తత్త్వవేత్త కాదనియే అభిప్రాయము. అనగా ఆరూఢుడు కాడని అర్థము.

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటా నినాదవత్।**
**అవాచ్యం ప్రణవస్యాగ్రం యస్తం వేదసవేదవిత్॥** ౨౪

**టీ॥ తైలధారామివ** = తైలధారవలె, **అచ్ఛిన్నమ్** = ఎడతెగని, **దీర్ఘఘంటా నినాదవత్** = అతిదీర్ఘమైన ఘంటాధ్వనివలె, **అవాచ్యమ్** = చెప్పనలవి కాని, **ప్రణవస్య** = ప్రణవముయొక్క, **అగ్రమ్** = లక్ష్యమును, **యః** = ఎవడు, **వేద** = తెలుసుకొనునో, **సః** = వాడు, **వేదవిత్** = వేదార్థము తెలిసినవాడు.

**దీపికా:** కేవలము వేదము చదివిన మాత్రమున జ్ఞానికాడనియు, వేదముల నిశ్చయార్థమైన బ్రహ్మానుభవము గలవాడే వేదవేత్తయని చెప్పుచున్నాడు. తురీయమైన ప్రణవముయొక్క దీర్ఘఘంటాధ్వని తైలధార వలె అవిచ్ఛిన్నమైయుండును. ఇట్టి ఓఙ్కారముయొక్క లక్ష్యమును ఎవ్వడెఱుంగునో వాడు తత్త్వవేత్త. ఇచట లక్ష్యమనగా ప్రత్యగభిన్న బ్రహ్మముతో ఊర్ధ్వగమనము కలిగియుండుటయే. ప్రణవము వాఙ్మనస్సు లకు గోచరముగానిది. అనగా బుద్ధిసహాయముచే ఇట్టిదని చెప్పుటకు శక్యముగానట్టిది. ఇట్టి వేదత్రయాత్మకమైన ప్రణవముయొక్క జ్ఞానము గలవారు ఎవరో అట్టివారు వేదవిదులు.

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్।**
**ధ్యాన నిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యేన్నిగూఢవత్॥** ౨౫

**టీ॥ ఆత్మానమ్** = తత్త్వజ్ఞానాసక్తమైన జీవుని (బుద్ధిని), **అరణిమ్** = క్రిందనుండు అరణిగా, **ప్రణవమ్** = ప్రణవాగ్రరూప బ్రహ్మమును, **ఉత్తరారణిమ్** = మీదుగనుండు అరణిగ, **కృత్వా** = చేసి, **ధ్యాననిర్మథనాభ్యాసాత్** = ధ్యానరూప నిర్మథనాభ్యాసమువలన, **నిగూఢవత్** = రహస్యముగా వర్తించు, **దేవమ్** = పరమాత్మను, **పశ్యేత్** = చూడవలెను.





**దీపికా:** వేదత్రయాత్మకమైన ప్రణవజ్ఞానము గలవారే వేదవిదులని చెప్పి, అట్టి ప్రణవజ్ఞాన సాధనములను చెప్పుచున్నాడు. తత్త్వజ్ఞానా సక్తమైన జీవుని (బుద్ధిని) క్రింది అరణిగా, పరమాత్మ ప్రతిపాదక శబ్దరూప ప్రణవాగ్ర నాదమును మీదనుండు అరణిగాజేసి అనగా బుద్ధిని నాదము నందు నిక్షిప్తముజేసి. నేత్రమును నాసాగ్రమునందుంచి సఙ్కల్పవికల్ప ములనుండి మనస్సు, రూపాది దర్శనములనుండి నేత్రము ఉపరమించిన వైనప్పుడు బాహ్యాన్తరములందు యోగవిఘ్నములు లేకపోవుటచే పూర్వోక్తమైన అవిచ్ఛిన్నత్వము ప్రాప్తించుచున్నది. సఙ్కల్పవికల్పాత్మకము గాక మనస్సు ప్రణవాగ్రమునందు నిశ్చలమై యుండుటయే యోగముయొక్క ప్రధానఫలము. దేహమునందు బిన్దురూపమగు మనస్సును సకలముగను, నిష్కలముగను సర్వదా గాంచుచు ప్రణవార్థానుసన్ధాన పూర్వకముగ పరమాక్షరజ్ఞాన రూపమగు అనగా అక్షరుడగు ఆత్మను ఐక్యానుసన్ధాన రూపముగ నిరంతరధ్యానము చేయుచుండవలెను. ఇది శుద్ధజ్ఞానామృతము.

**తాదృశం పరమంరూపం స్మరేత్పార్థహ్యనన్యధీః**
**విధూమాగ్ని నిభన్దేవం పశ్యేదత్యన్త నిర్మలమ్॥** ౨౬

**టీ॥ పార్థ** = అర్జునుడా! **విధూమాగ్నినిభమ్** = పొగలేని అగ్నిజ్వాలవలె, **అత్యన్తనిర్మలమ్** = మిక్కిలి స్వచ్ఛమైనవాడునగు, **దేవమ్** = స్వయముగ ప్రకాశించు పరమాత్మను, **యావత్** = ఎంతవఱకు, **పశ్యేత్** = చూడనగునో, **తాదృశమ్** = అటువంటి, **పరమం రూపం** = శ్రేష్ఠమైన బ్రహ్మస్వరూపమును, **అనన్యధీః** = ఇతర చింతనలు లేనివాడై, **స్మరేత్** = తలంపవలయును.

**దీపికా:** అపరోక్షానుభవమువఱకు చేయతగిన బ్రహ్మధారణా స్వరూపమును చెప్పుచున్నాడు. ఓపార్థా! అని సంబోధించుటలోనే అర్జునుని బృహత్ప్ర

యోజనాపేక్ష ద్యోతకమగుచున్నది. బ్రహ్మసూత్రభాష్య మందు శ్రీఆచార్య శఙ్కరులు దేహమునకు అంతిమసంస్కారముగా చెప్పిన పరివ్రాజకత్వ ముయొక్క ఫలరూపమైన నిర్గుణత్వమును యాచించువాడు. అదియే ప్రయోజనముగా గలవాడు నిర్గుణుడు, కావున స్నానసన్ధ్యావందనాది రూపమైన సమస్త విధినిషేధములకు అతీతుడు, అట్టివాడు పార్థుడు. కేవల కర్మపరిత్యాగము సన్న్యాసము కాదు. జీవాత్మలయొక్క ఐక్యమే సన్న్యాసము. **'శ్రు. సన్ధౌజీవాత్మనో రైక్యం సన్న్యాసః పరికీర్తితః'** పరివ్రాజక లక్షణోపేతుడా! పొగలేని అగ్నిజ్వాల వంటి కాన్తికలవాడు, అత్యన్తనిర్మలుడు, స్వయంప్రకాశ స్వరూపుడునగు పరమాత్మను ఎంత వఱకు చూడనగునో అంతవఱకు మనస్సుని నిర్విషయముగా నుంచి శ్రేష్ఠమైనటువంటి పరతత్త్వమును స్మరింపవలెను. ఇట్టివాడే సన్న్యాసము నకు అర్హుడని శ్రుతులు ప్రమాణీకరిస్తున్నాయి.

**దూరస్థోఽపి నదూరస్థః పిణ్డస్థః పిణ్డవర్జితః।**
**విమల స్సర్వదా దేహీ సర్వవ్యాపీ నిరఞ్జనః॥** ౨౭

**టీ॥ దేహీ** = జీవుడు, **దూరస్థోఽపి** = దూరముగానున్నటుల కనబడినను, **నదూరస్థః** = దూరమందున్నవాడు కాడు, **పిణ్డస్థః** = శరీరము నందున్నటుల కనబడినను, **పిణ్డవర్జితః** = శరీరమందుండు వాడుకాడు, **దేహీ** = జీవుడు, **సర్వతః** = అంతట, **విమలః** = నిర్మలుడై, **సర్వవ్యాపి** = అంతట వ్యాపించినవాడై, **నిరఞ్జనః** = స్వయముగా ప్రకాశించువాడు.

**దీపికా:** ఇచట దేహి పొగలేని అగ్నిజ్వాలా సదృశప్రకాశం కలవాడు. అట్టి జీవుడు దూరముగానున్నటుల కనబడినను...దూరమందున్నవాడు కాడు. అనగా జీవుడు బ్రహ్మకంటే వేరుగా కనబడుచున్నను నిజమునకు బ్రహ్మకంటే భిన్నడుకాడు. శరీరమునందు ఉన్నటుల కనబడినను





శరీరమున ఉండువాడుకాడు. షడ్భావవికార రూపమైన దేహసంబంధ ములేని జీవుడు శరీరసంబంధముగలవాడిగా భావింపబడుటకు; జీవుడు, బ్రహ్మ అను ద్వైతభావప్రకాశమునకు కారణము శబ్దాదిప్రపఞ్చ రూప మాయచే ఆవరింపబడియుండుటయే, ఇట్టి మాయారూప తమస్సు భేదింపబడినచో ఏకమైనస్థితిని ఒక్కడుగానే చూచుచున్నాడు. **'జీవోబ్రహ్మైవ నాపరః'** అను శ్రుత్యర్థము ప్రతిపాదింపబడినది.

**కాయస్థోఽపి నకాయస్థః కాయస్థోఽపి నజాయతే।**
**కాయస్థోఽపి నభుఞ్జానః కాయస్థోఽపి నబధ్యతే॥** ౨౮

**టీ॥ కాయస్థోఽపి** = శరీరమందుండువాడైనప్పటికి, **నకాయస్థః** = శరీరమందుండువాడుకాడు, **కాయస్థోఽపి** = శరీరమందుండు వాడైనప్పటికి, **నజాయతే** = పుట్టుటలేదు. **కాయస్థోఽపి** = శరీరమందండు వాడైనప్పటికి, **నభుఞ్జానః** = భోగములనుభవించువాడు కాడు. **కాయస్థోఽపి** = శరీరస్థుడయ్యును, **నబధ్యతే** = బంధనములేనివాడు.

**దీపికా:** విధూమాగ్నినిభుడైన దేహికి దేహాధ్యాసమున కర్తృత్వభోక్తృత్వము లేదని ఉపదేశించుచున్నాడు. శరీరమునందున్నాడు అనుటచే శరీరమే జీవుడను భ్రాన్తికి అవకాశ ముండుటచే **నకాయస్థః** శరీరమునందుండువాడు కాడని ఆభ్రాన్తిని నివర్తింపజేసిరి. శరీరస్థుడు అనుటచే దేహపాతానన్తరము జీవుడు మరణిస్తున్నాడను శఙ్కకు అవకాశము కలుగుచుండుటచే **నజాయతే** అనిరి. వృద్ధిక్షయములు లేనివాడని తెలియదగినది. **న భుఞ్జానః, నబధ్యతే** అనుటచే దశేన్ద్రియసమాహార రూపమగు మనస్సునకు పైనున్నవాడని తెలియుచున్నది. ఏకాదశేన్ద్రియస్థానములందు ఎందున్న వాడైనను వాటి వలన కలుగు ఫలమును అనుభవించువాడై, తత్‌జన్యమైన వాసనలచే బద్ధుడగుచున్నాడు. మాయారహితుడై వాసనాక్షయమైన జీవునిస్థానము

మనస్సుయొక్క స్థానమునకు పైనని సూచింపబడుచున్నది. ఇతడు బ్రహ్మమని తెలియదగినది. **'కాయస్థోఽపి'** అని పునరుక్తిగా చెప్పుట స్థూల సూక్ష్మ కారణ శరీరస్థానములందుండు వాడైనప్పటికి భోజ్యము, భోక్తా, భోగము అనువాటికంటె వేఱైనవాడై **'ప్రజ్ఞానం బ్రహ్మ'** అను ఋగ్వేద మహావాక్యార్థరూపముగా ప్రకాశించు సాక్షిస్వరూపుడు, స్వతః సర్వవ్యాపియని ప్రమాణీకరించుటకు. కనుకనే **'సర్వేన్ద్రియ గుణాభాస స్సర్వేన్ద్రియ వివర్జితః'** అని శ్రుతి వర్ణించినది.

**కాయస్థోఽపి నలిప్తస్స్యా త్కాయస్థోఽపి నబాధ్యతే॥** ౨౯

**టీ॥ కాయస్థోఽపి** = దేహసంబంధము కలవాడైనప్పటికి, **నలిప్త స్స్యాత్** = సుఖదుఃఖములను పొందుటలేదు. **కాయస్థోఽపి** = దేహస్థుడైనప్పటికి, **నబాధ్యతే** = బాధింపబడుటలేదు.

**దీపికా:** జీవుడు సుఖదుఃఖాదులకు హేతుభూతమైన దేహముతో సంబంధము కలవాడైనప్పటికి సుఖదఃఖములను పొందుటలేదు. దేహమునకు మరణమే బాధకము. అట్టి మరణధర్మముగల దేహమునందు యున్నను మృతిచెందదు. దానంజేసి జీవుడు అస్తే, జాయతే, వర్థతేత్యాది షడ్భావవికారహితుడు, సుఖదుఃఖసంబంధ రహితుడు, అమృతుడు.

**తిలమధ్యే యథాతైలం క్షీరమధ్యే యథాఘృతమ్।**
**పుష్పమధ్యే యథాగన్ధః ఫలమధ్యే యథారసః**
**కాష్ఠాగ్నివ త్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్॥** ౩౦

**టీ॥ తిలమధ్యే** = నువ్వులమధ్యన, **యథాతైలమ్** = నూనెవలెను, **క్షీరమధ్యే** = పాలమధ్యన, **ఘృతంయథా** = ఘృతమువలెను, **పుష్పమధ్యే**





= పుష్పములమధ్యన, **యథాగన్ధః** = గన్ధమువలెను, **ఫలమధ్యే** = ఫలములమధ్యన, **యథారసః** = రసమువలెను, **కాష్ఠాగ్నివత్** = కాష్ఠమునందు అగ్నివలెను, **ఆకాశే** = ఆకాశమునందు, **వాయువచ్చరేత్** = వాయువువలె సంచరించుచూ, **ప్రకాశేత** = ప్రకాశించుచున్నది.

**దీపికా:** నువ్వులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను, పుష్పలయందు సువాసనవలెను, ఫలములయందు రసమువలెను, కాష్ఠమందలి అగ్నివలెను సమస్త భూతములు ఆత్మయందు కూర్చబడి నవి. ఆకాశమందు వాయువువలె, మనుజుని శరీరమునందు ఆ బ్రహ్మము బాహ్యాభ్యన్తరములందు వ్యాపించియున్నాడు. ఈవిషయమునే...

**శ్రు. పుష్పమధ్యే యథాగన్ధః పయోమధ్యే యథాఘృతమ్।**
**తిలమధ్యే యథాతైలం పాషాణేష్వివ కాఞ్చనమ్॥**
**ఏవం సర్వాణి భూతాని మణేసూత్ర ఇవాత్మని।**
**స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మావిద్బ్రహ్మణి స్థితః॥**
**తిలానాం తు యథా తైలం పుష్పేగన్ధ ఇవాశ్రితః।**
**పురుషస్య శరీరేతు స బాహ్యాభ్యన్తరే స్థితః॥**

అని ధ్యానబిన్దూపనిషత్తు పలుకుచున్నది. పైవాటియందు పుష్పము శరీరము, సువాసన బ్రహ్మము; కాష్ఠము శరీరము, అగ్ని బ్రహ్మము; ఫలము శరీరము, రసము బ్రహ్మము; నువ్వులు శరీరము, నూనె బ్రహ్మము. సకలచరాచర జీవజాలచైతన్యమునకు కారణమైనట్టి జీవరస ముందే అదే బ్రహ్మము. ఉపాదులు మోహకారకమైనట్టివి. ఇట్టి మోహకారకమైన ఉపాదులమధ్యనుండియు బ్రహ్మము, ఉపాదులయొక్క పఞ్చకోశములనుండి విడివడినదై నిరతము స్వయంప్రకాశముగలదై యుండును.

**తథా సర్వగతో దేహీ దేహమధ్యే వ్యవస్థితః।**

**మనస్థో దేహినాం దేవో మనోమధ్యేవ్యవస్థితః ॥** ౩౧

**టీ॥ తథా** = ఆవిధముగా, **సర్వగతః** = సర్వగతుడైన, **దేహీ** = జీవుడు, **దేహమధ్యే** = నానాభిన్న తిర్యగ్దేదేహమధ్యమున, **వ్యవస్థితః** = ఉన్నాడు. **దేహినామ్** = దేహభేదముచేత నానావిధములుగానున్న జీవులయొక్క, **మనస్థః** = అన్తఃకరణమునందున్నవాడై, **దేవః** = ఈశ్వరుడు, **మనోమధ్యే** = (అపరిశుద్ధ)అన్తఃకరణములయందు, **వ్యవస్థితః** = సాక్షివలె ఉన్నాడు.

**దీపికా:** పూర్వోక్తమైన నూనె మొదలగు వానివలె జీవుడు అనేక రూపములచే సర్వజీవుల దేహములందున్నాడు. సర్వగతుడైన జీవుడు దేహమధ్యమందున్నాడు అనుటచే సర్వజీవులయందున్న పరమేశ్వరునిగా అన్తరాత్మ స్వరూపునిగా తెలియదగును. కనుక సమస్తమునకు సాక్షి, సర్వాత్మ రూపుడు. ఇట్టి పరమాత్మ హృదయమందు ప్రకాశించువాడు అగుచున్నాడు. **'హృత్పద్మ కర్ణికామధ్యే స్థిరదీప నిభాకృతమ్'**అని శ్రుతి కూడా హృదయకమలమందలి కర్ణికయందు నిశ్చలమైన దీపమువలె ప్రకాశించుచున్నాడని చెబుతోంది. **'దేహినాం మనోమధ్యే వ్యవస్థితః'** అను వ్యాస వచనము **'సర్వభూత గుహాశయః'** అను శ్రుతివాక్యముచే సమర్థింపబడుచున్నది.

**మనస్థం మనమధ్యస్థం మధ్యస్థం మనవర్జితమ్।**

**మనసా మన ఆలోక్య స్వయంసిద్ధ్యన్తి యోగినః॥** ౩౨

**టీ॥ యోగినః** = యోగులు, **మనస్థమ్** = మనస్సునందున్నదియు (హృదయమందు), **మనమధ్యస్థమ్** = హృదయమధ్యమున, **మధ్యస్థమ్** = సాక్షీరూపమైనదియు, **మనవర్జితమ్** = మనస్సులేనిదియునగు, **మనః** = ఆత్మను, **మనసా** = బుద్ధిచే, **ఆలోక్య** = చూచి, **స్వయమ్** = స్వయముగా, **సిద్ధ్యన్తి** = సిద్ధిపొందుచున్నారు.





**దీపికా:** యోగులు మాత్రమే ఇట్టి రసస్వరూపమైన పురుషుని పొందగలరని చెప్పుచున్నాడు. హృదయమందు హృదయమధ్యమున సాక్షీరూపమై మనస్సు లేనిదియునగు ఆత్మను అనగా జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులన్నియు మనోమయములని **'శ్రు. జాగ్రత్స్వప్నసుషుప్త్యాది మనోమయమితీరితమ్'** చెప్పుచుండుటచే అవస్థాత్రయాతీతమగు తురీయము గ్రహింపతగినది. మరియు **'శ్రు. మన ఏవ జగత్సర్వం, మన ఏవ సదారిపుః, మన ఏవహి సంసారో, మన ఏవ జగత్రయం, మన ఏవ మహాదుఃఖం, మన ఏవ జరాదికమ్'** ఈ మనస్సే జగత్తంతయు, మహాశత్రువు, సంసారము, ముల్లోకములు, మహాదుఃఖము, వార్ధక్యాదులు కనుక సఙ్కల్పవికల్పరూపముగా మనస్సు సంసారమును కలుగజేయుచున్నది. ఈ సంసారము అరిషడ్వర్గమునకు కారణమగుచున్నది. ఈ మనస్సు ద్వంద్వాత్మకమైన చతుర్ధశభువనాత్మకమైన జగత్తునకు, తత్తదధిదేవతలకు కారణమై వృద్ధిక్షయరూపముగా మహాదుఃఖమును కలిగించుచున్నది. కనుక సఙ్కల్పవికల్పరహితమై అవస్థాత్రయాతీతమగు తురీయమైన ఆత్మను యోగులు ధారణాయోగ్యమైన బుద్ధిచే చూచి స్వయముగా సిద్ధి (యదార్థస్థితిని) పొందుచున్నారు.

**ఆకాశం మానసంకృత్వా మనః కృత్వానిరాస్పదమ్।**

**నిశ్చలం తం విజానీయాత్ సమాధిస్థస్య లక్షణమ్॥** ౩౩

**టీ॥ మానసమ్** = మనస్సును, **ఆకాశంకృత్వా** = ఆకశముగాజేసి, **మనః** = మనస్సును, **నిరాస్పదమ్** = ఆధారములేనిదానినిగా, **కృత్వా** = చేసి, **నిశ్చలమ్** = నిశ్చలుడైన, **తమ్** = ఆపరమాత్మను, **విజానీయాత్** = ఎఱుగవలెను, **సమాధిస్థస్య** = సమాధియందున్నవానికి, **లక్షణమ్** = లక్షణము.

**దీపికా:** ఇక్కడ ఆరూఢుని సమాధి లక్షణమును చెప్పుచున్నాడు. మనస్సును ఆకాశముగాజేసి, అనగా సఙ్కల్పవికల్పాత్మకమైన మనస్సుని వృత్తిశూన్యముగాజేసి, **మనఃకృత్వా నిరాస్పదమ్** హృదయమును ఆధారము లేనిదానిగాచేసి అనగా హృత్పద్మమునందు జీవుడు పుణ్యపాప ములను నియన్త్రించిన వాడైన బ్రహ్మతత్త్వమును నెఱుంగగలవాడగును. అట్టివాడు అనగా హృత్పద్మమును భేదించినవాడు, కనుక ఆకాశసదృశు డు. ఇది **అణో రణీయాన్ మహతోమహీయాన్** అని శ్రుతులు వర్ణించిన పరమాత్మ తత్త్వమును అనుభూత మొనర్చుకొను సాధన. సర్వత్రా వ్యాపించిన ఆకాశము పరమాత్మయొక్క విరాట్‌విశ్వరూప స్థూల శరీరము. సూక్ష్మమైన వాటికంటెను సూక్ష్మమైనది మనస్సు. ఇట్టి అణురూప మనస్సుతో జీవుడు విరాట్ స్వరూపుడు ఎట్లు కాగలడో ఇక్కడ చెప్పబడింది. ఇట్టి విశ్వరూపునకు వేరు ఆశ్రయం అక్కరలేదు. నిరాస్పదత్వము వీనికి సహజముగానే సిద్ధిస్తుంది. అట్టివానకి కర్తవ్యమూ లేదు, కర్మఫలమూలేదు. ఇచ్చట మనస్సు వృత్తిశూన్యమై యోగి నిశ్చలుడ గుచున్నాడు. ఇట్లు నిశ్చలుడైన యోగి పరమాత్మను ఎఱుంగును. ఇది సమాధియందున్న వానికి లక్షణము.

**యోగామృతరసం పీత్వా వాయుభక్షస్సదాసుఖీ।**
**యమమభ్యస్యతే నిత్యం సమాధిర్మృత్యునాశకృత్॥** ౩౪

**టీ॥ యోగామృతరసమ్** = యోగసాధనరూప అమృతరసమును, **పీత్వా** = పానముచేసి, **వాయుభక్షః** = వాయుమాత్రాహారము కలవాడై, **సదా సుఖీ** = నిత్యసన్తుష్టుడై, **నిత్యమ్** = నిరంతరము, **యమమభ్యస్యతే** = మనోనిగ్రహమున భ్యసించవలెను. **సమాధిః** = అట్టి సమాధి, **మృత్యు నాశకృత్** = మృత్యువులేకుండ చేయునది.





**దీపికా:** ఇది పూర్వశ్లోకమందలి స్థితినిపొందుటకు సాధనమార్గము. ఇది ఆరురుక్షుని సమాధిలక్షణము. క్షుత్తు జీవలక్షణమైయుండగా సదాసుఖీయను స్థితి ఎట్లుసాధ్యమగును? అంటే వాయుభక్షణచే యని సమాధానము చెప్పుచున్నాడు. **సదాసుఖీ** ఎల్లప్పుడు సుఖవంతుడై, అనగా సుఖాసీనుడవై అని, సుఖాసనమనగా ఏస్థితియందు ఎల్లప్పుడు బ్రహ్మభావన జరుగునో అది సుఖాసనము. **'శ్రు. సుఖేనైవ భవేద్యస్మిన్న జస్రం బ్రహ్మచిన్తనమ్। ఆసనం తద్విజానీయా దన్యత్సుఖ వినాశనమ్॥'** సాధకుడు నిత్యసన్తుష్టుడు అయినప్పుడు మాత్రమే బ్రహ్మభావన సుఖముగా జరుగుతుంది. తదితరము సుఖవినాశకము. ఇట్టి ఆసనసిద్ధిచే బ్రహ్మధ్యానతత్పరతచే సుఖవంతుడైయని. ఈ సుఖమునకు సాధనముగా వాయుభక్షణను చెప్పుచున్నాడు. వాయుభక్షణచే మనస్సు లేనిదగుచున్నది కావున, వాయుభక్షః వాయువును భక్షించుచు కేవల కుమ్భకమునందుండి. ప్రాణాయామము రేచక, పూరక, కుమ్భకాత్మకము. రేచకము అనగా కేవల వాయునిశ్వసనమేకాదు, జగన్నిషేధరూప భావనా యుక్త నిశ్వసనము రేచకము. **'నిషేధనం ప్రపఞ్చస్య రేచకాఖ్య స్సమీరితః'** జగన్నిషేధమైన పిదప అనగా రేచకానన్తరము, నేను బ్రహ్మమును అను భావనాయుక్తముగా వాయువును లోనికి గ్రహించుట పూరకము **'బ్రహ్మైవాస్మీతి యావృత్తిః పూరకో వాయురుచ్యతే'** పూరింపబడిన వాయువుయొక్క సంయమము కుమ్భకము. నేను బ్రహ్మమునను భావముచే పూరింపబడినట్టిది, అట్టి భావన దృఢముగా నిశ్చలముగా నిలుచుట కుమ్భకమగుచున్నది. **'తత స్తద్వృత్తి నైశ్చల్యం కుమ్భకం ప్రాణసంయమః'** ఇట్టి కేవల కుమ్భకావస్థ కలుగుటకు ఇన్ద్రియ నియమనము అభ్యసింపవలెను. ఇది యమము అని చెప్పబడుచున్నది.

కేవలము ఇన్ద్రియములను బలవంతముగా నిగ్రహించుటగాదు, సమస్తము బ్రహ్మమే అను(భావన) జ్ఞానముచే ఇన్ద్రియములను నిగ్రహించుట యమము. **'సర్వంబ్రహ్మేతి వైజ్ఞానాదిన్ద్రియగ్రామ సంయమః యమోయమ్.'** దీనిని మాటిమాటికి అభ్యసింపవలెను. లేనియెడల ఇన్ద్రియములు ద్వైత ప్రపఞ్చమందలి విషయములను ఆకర్షించి ఇతఃపూర్వోక్తమైన కుమ్భకావస్థ సిద్ధికి ఘాత కలిగించును. ఆరురుక్షుని విషయమున అన్తఃకరణ విశుద్ధికి యోగముకూడా సాధనమని భగవద్గీత **'యోగమాత్మ విశుద్ధయే'** లోను చెప్పియుండుటచే ఇది నిరంతరము అభ్యసింపబడాలి. కేవల కుమ్భకసిద్ధిచే అమరోలి, వజ్రోలి యోగమున అమృతము సిద్ధించు చున్నది. ఇట్టి అభ్యాసవశమున సిద్ధించిన సమాధి మృత్యువులేకుండ చేయును. సమాధియనగా...'**శ్రు. నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకార తయా పునః। వృత్తివిస్మరణం సమ్యక్ సమాధి రభిధీయతే॥**' వికార రహితమైన నిశ్చల మనోవృత్తితో నేను బ్రహ్మమునను భావముకలిగి చిత్తవృత్తులు ఏవియు లేకుండుట సమాధి. ఇక్కడ ద్వైతభావన లేదు గనుక మృత్యుభయము లేదు.

**ఊర్ధ్వశూన్య మధశూన్యం మధ్యశూన్యం యదాత్మకమ్।**
**సర్వశూన్యం స ఆత్మేతి సమాధిస్థస్య లక్షణమ్॥** ౩౫

**టీ॥ ఊర్ధ్వశూన్యమ్** = స్వర్గాది ఊర్ధ్వలోకములు లేనిదిగను, **అధశ్శూన్యమ్** = అతలాది అధోదేశములు లేనిదిగను, **మధ్యశ్శూన్యమ్** = భూలోకము లేనిదిగను, **సర్వశూన్యమ్** = ఏమియులేనిదిగను, **యదాత్మకమ్** = ఏది అయియున్నదో, సః = అదే, **సమాధిస్థస్య** = సమాధియందున్నవాని, **లక్షణమ్** = లక్షణము.





**దీపికా:** నిర్వికల్ప సమాధియందున్నవాడు స్వర్గమర్త్యపాతాళ లోకములు లేనిదిగ, దేశకాల వస్తువులు లేనిదిగా, ఏదియుండునో అదే (ఆత్మయే) తానని భావించును. స్వర్గమర్త్య పాతాళములు అనగా ఓఙ్కారమందలి అ,ఉ,మ అను మూడక్షరములే, ఈ మూడులేనట్టి అర్ధమాత్రచే నిశ్చలత్వమును పొందుచున్నాడు. **'అకారే వహ్నిరిత్యాహు రుకారే హృది సంస్థితః మకారేచభ్రువోర్మధ్యే'**అకారము మూలాధారాగ్ని...వైశ్వానరుడు. ఉకారము హృదయస్థానము...విష్ణువు. మకారము భ్రూమధ్యము...రుద్రుడు. ప్రణవముయొక్క ఊర్ధ్వభాగమున అర్ధమాత్ర ప్రకాశించు చున్నది. అర్ధమాత్రారూప ప్రణవనాదమును కూడ లయము నొనర్చుటచే మాత్రా చతుష్టయమునకు ఊర్ధ్వమైనదేది కలదో అదే పరాత్పరము. అతడే పరమాత్మ. అచటనుండే స్వవికల్పితమైన విశ్వవిరాట్ ఓత్రాద్యాత్మ స్వరూపముతో అంతటావ్యాపించును. ఇది నిర్వికల్పసమాధి యందున్న వాని లక్షణము. దీనినే శ్రుతి అతద్వ్యావృత్తిరూప సమాధియని చెప్పుచున్నది.

**శ్రు. ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం చిదాత్మకం। అతద్వ్యావృత్తి రూపోసౌ సమాధిర్మునిభాజితః॥'** జాగ్రత్స్వప్న (సఙ్కల్ప వికల్పాత్మక మానసికవ్యాపారము) సుషుప్త్యవస్థా గోచర వ్యవహారశూన్య మైనదియు, కేవల జ్ఞానస్వరూపమును అగు ఈ సమాధి అతద్వ్యావృత్తి రూపము.

**శూన్యభావిత భావాత్మా పుణ్యపాపైః ప్రముచ్యతే॥** ౩౬

**టీ॥ శూన్యభావిత భావాత్మా** = అంతయు ఏమీలేదని తలంచువాడు, **పుణ్యపాపైః** = పుణ్యపాపములనుండి, **ప్రముచ్యతే** = విడుబడుచున్నాడు.

**దీపికా:** పూర్వోక్తశ్లోకమునందు నిర్వికల్పసమాధి స్థితిని, సాధనముచెప్పి, ఈ సమాధియందున్నవాని లక్షణములను చెప్పుచున్నాడు. అంతయు

ఏమీలేదని తలంచువాడు, పృథివ్యాదిశివాన్తమైన భూతగ్రామము తానే అగుటచే తనకు ఇతరమైనది కొంచమైనను లేదని తలంచువాడు. ఇట్టి వానికి విధినిషేధములు లేకుండుటచే పుణ్యపాపములనుండి విడువబడుచున్నాడు.

**॥అర్జున ఉవాచ॥**

**అదృశ్యే భావనా నాస్తి దృశ్యమేతద్వినశ్యతి।**
**అవర్ణమస్వరం బ్రహ్మ కథం ధ్యాయన్తి యోగినః॥** ౩౭

**టీ॥ అదృశ్యే** = కనబడనిదానియందు, **భావనా నాస్తి** = ధ్యానములేదు, **దృశ్యమేతత్** = ఈ కనబడునదంతయు, **వినశ్యతి** = నశించుచున్నది. **అవర్ణమ్** = రూపరహితమై, **అస్వరమ్** = శబ్దాగోచరమగు, **బ్రహ్మ** = బ్రహ్మమును, **యోగినః** = యోగులు, **కథమ్** = ఎట్లు, **ధ్యాయన్తి** = ధ్యానించుచున్నారు.

**దీపికా:** జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాగోచర వ్యవహార శూన్యమైన, కేవల జ్ఞానస్వరూపమైన పూర్వోక్త నిర్వికల్పసమాధియొక్క సాధ్యాసాధ్యములను ప్రశ్నించుచున్నాడు. సర్వశూన్యమైన దానిని భావనచేయుట ఎట్లు? అని. కనబడని దానిని ధ్యానముచేయు వీలులేదు. ఈ కనబడక పోవుట కేవల చర్మచక్షువులకు సంబంధించినది మాత్రమేకాదు. ఏకాదశేన్ద్రియములది. సర్వేన్ద్రియములచేతను గ్రహింపశక్యము గానిదగుటచే ధ్యానముచేయు అవకాశము ఎట్లు కలుగును. ఎందువలన అనగా బ్రహ్మ అతీన్ద్రియుడు. ఇన్ద్రియములు బ్రహ్మను గ్రహించుటకాదు, బ్రహ్మమే ఇన్ద్రియములను గ్రహించుచున్నాడు. అనగా అన్తర్ముఖమొనర్చుచున్నాడు. బ్రహ్మమే తానైనవాని వాక్కుని ప్రమాణముగా తీసుకొందుమన్నా, బ్రహ్మమునుగూర్చి చెప్పిన ఉపనిషత్తులను (ప్రస్థాన




త్రయాదులను) తీసుకొన్నా అట్టివి సాధకజన ప్రయోజనము కొఱకు స్వస్థితినుండి జాతి వాగాదీన్ద్రియ సహాయముచే ప్రకటింపబడినవి. ఇవి సహకారులు, స్వస్థితి కాదు. వీటిని ఆలంబనగా గైకొని అభ్యాస మొనర్చిన యోగి స్వస్వరూప స్థితియందుండి ఇన్ద్రియములు అన్తర్ముఖ మగుటచే అనగా జగత్తు ఉపసంహరింప బడుటచే సత్యము ప్రకటించు స్థానముగాని, అవకాశముగాని లేనివాడై కేవలుడై పరమగుహ్యమైన వాడుగనే యున్నాడు. ఇక దృశ్యమానమగు సకలము నశించుచున్నది. ఇట్లుండ యోగులు నామరూప రహితుడైన బ్రహ్మమును ఏవిధముగా ధ్యానించుచున్నారు?

**॥భగవానువాచ॥**

**ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణం మధ్యపూర్ణం యదాత్మకమ్।**
**సర్వపూర్ణం తదాత్మేతి సమాధిస్థస్య లక్షణమ్॥** ౩౮

**టీ॥ ఊర్ధ్వపూర్ణమ్** = ఊర్ధ్వలోకముల వ్యాపించినది, **అధఃపూర్ణమ్** = అతలాది అధోలోకముల వ్యాపించినది, **మధ్యపూర్ణమ్** = స్థావరజఙ్గ మాత్మక ప్రపఞ్చమంతయు వ్యాపించినది, **సర్వపూర్ణమ్** = అంతట నిండియున్నదియునగు, **యదాత్మకమ్** = ఏ పరమాత్మకలదో, **తదాత్మేతి** = అదియే ఆత్మయనితలచుట, **సమాధిస్థస్యలక్షణమ్** = సమాధియందున్న వాని లక్షణము.

**దీపికా:** ఊర్ధ్వశూన్యం, అధఃశూన్యం అని చతుర్దశలోకములకు పరమందున్న వానిగా అంటే ఇవేవి లేనివాడు, కానివానిగా పూర్వము చెప్పబడుటచే సర్వశూన్యమైన దానిని ధ్యానించుట సంభవమేనాయను ప్రశ్న ఉదయించింది. దానికి సమాధానముగా సర్వశూన్యమంటే ఏమీ లేకపోవుటకాదు, సర్వవ్యాపకుడైయుండి, సమస్తము కలిగియుండి దాని

దృష్టిలేనివాడు, పూర్ణుడు, విరాగి స్వవికల్పిత విశ్వవిరాట్ ఓత్రాద్యాత్మ స్వరూపము అని ఉపదేశిస్తున్నాడు. లోకత్రయమునందు వ్యాపించినవాడు అనుటచే పృథ్వీలోకముల మొదలిడి ద్యులోకాదుల వఱకు తనయందు లీనమైయున్నవాడు. కనుక ఆయా లోకాన్తర్గత సమస్తజీవులను వీక్షించు వాడు, కావున సర్వసాక్షి. పృథివ్యాది ద్యులోకపర్యన్తము వ్యాపించినవాడు అనుటచే తత్తదధిదేవతలైన పఞ్చబ్రహ్మలకు పైనున్నావాడు, నిష్కలుడు ఈ పరబ్రహ్మము. పఞ్చబ్రహ్మల ఆధిపత్యమునకు లోబడినదంతయు సకలము. పఞ్చబ్రహ్మలకు పరమందున్నది పరబ్రహ్మము. **'శ్రు. ఏకోహి దేవః ప్రదిశోనుసర్వాః'** ఏకరూపుడై ప్రకాశ స్వరూపుడైనవాడు సమస్త దిక్కులను, అవాంతరదిక్కులను వ్యాపించియున్నాడు అని శ్రుతి వచనము. ఇట్టి పరమాత్మయే నేనను స్థిరబుద్ధి సమాధిలక్షణము. ఊర్ధ్వమనగా అవిద్యాపదమగు జగత్తునకు పైభాగము, అదంతయు నిండియున్నది. ఇది ఊర్ధ్వపూర్ణము. అధఃపూర్ణము, అధస్సనగా అవిద్యా పదముయొక్క స్థూలాంశము, అచ్చట నిండియున్నది అధఃపూర్ణము. మధ్యపూర్ణమనగా అవిద్యయొక్క ఊర్ధ్వాధః ప్రదేశములకు బీజభాగము.

**॥అర్జున ఉవాచ॥**

**సాలమ్బస్యాప్యనిత్యత్వం నిరాలమ్బస్య శూన్యతా।**

**ఉభయోరపి దోషత్వాత్కథం ధ్యాయన్తి యోగినః॥** ౩౮

**టీ॥ సాలమ్బస్య** = మూర్తివంతంబైన యోగమునకు, **అనిత్యత్వమపి** = అనిత్యత్వము, **నిరాలమ్బస్య** = నిరాధారమైన యోగమునకు, **శూన్యతా** = శూన్యత్వమును కలవు; **ఉభయోరపి** = ఈ సాలమ్బ నిరాలమ్బ యోగముల రెండింటికి, **దోషత్వాత్** = దోషముండుటవలన, **కథమ్** = ఎట్లు, **యోగినః** = యోగులు, **ధ్యాయన్తి** = ధ్యానము చేయుచున్నారు.





**దీపికా:** ఇది సాలమ్బయోగమా? నిరాలమ్బయోగమా? యని ప్రశ్నించుచున్నాడు. ఇది సాలమ్బయోగమా అంటే... సగుణధ్యానంబుతోనున్న సాలమ్బయోగమునకు అనిత్యత్వంబు కలుగుచున్నదికదా?, లేదూ మూర్తివంతధ్యానశూన్యంబైన నిరాలమ్బయోగమే అందువా! శూన్యత్వం ఉండనే వున్నది. కావున ఈ రెండింటికి దోషము కలుగుటచే జ్ఞానులు ఎట్లు ధ్యానింతురు? సగుణధ్యానముతోనున్న సాలమ్బయోగమున దృశ్యముండుటచే అనిత్యము. ఇది సకలము. (మూర్తివంత ధ్యానశూన్యంబైన నిరాలమ్బయోగము అదృశ్యము, నిష్కలము. ఈ రెండింటియందు దోషము కలుగుటచే ధ్యానము ఎట్లనగా...సకలము ఉపాయభూతము; నిష్కలము ఉపేయభూతము. సగుణధ్యానమైన సకలముతో, ఉపేయ భూతమైన నిష్కలము సిద్ధించును. వేదప్రతిపాద్యమైన యజ్ఞయాగాది క్రతువులు సకలము. ఇట్టి సకలమును అనుష్ఠించుటచే చిత్తశుద్ధి కలుగును. పవిత్రాన్తః కరణుడైనవానికే వేదాన్తజన్య వివేకమున నిష్కలమైన పరబ్రహ్మసాక్షాత్కారము. కావున నిష్కలము ఇన్ద్రియాతీత మైనదిగాని శూన్యముగాదు) **'శ్రు. దేహస్థస్స కలో జ్ఞేయో నిష్కలో దేహవర్జితః'** సకలుడు, నిష్కలుడు అను విషయములు స్వరూప సంబంధముచేతను, తత్సంబంధరాహిత్యముచేతను ఏర్పడుచున్నవి. సకలము వృద్ధిక్షయములు కలదగుటచే నిత్యత్వము లేనిది. అమూర్తి ధ్యానము నిష్కలమైనను ఇదియు ధ్యానమాత్రమే కావున దహరోపాసనాదికమువలె సగుణబ్రహ్మ ప్రాప్తికి మాత్రమే సాధనమా? పరబ్రహ్మప్రాప్తికి సాధనభూతమగునాయను శంక కలుగుచున్నది. కావున రెండును దోషభూయిష్టముగనే యున్నవికదా? యోగులెట్లు ధ్యానింతురని అడుగుచున్నాడు.

॥భగవానువాచ॥

**హృదయం నిర్మలఙ్కృత్వా చిన్తయిత్వాప్యనామయం।**
**అహమేకమిదం సర్వమితి పశ్యేత్పరం సుఖీ॥ ౪౦**

**టీ॥ హృదయమ్** = మనస్సును, **నిర్మలంకృత్వా** = జ్ఞానవిరోధియైన రాగాది దోషరహితముగాజేసి, **అనామయమ్** = ఈశ్వరుని, **చిన్తయిత్వా** = ధ్యానించి, **అహమ్** = నేను, ఏక = ఒక్కడినే, **ఇదంసర్వమ్** = ఈ సమస్తమును, **ఇతి** = అని, **పరంసుఖీ** = పరమానన్దాత్మకుడై, **పశ్యేత్** = చూడవలయును.

**దీపికా:** ఇతఃపూర్వము **సర్వపూర్ణం** అని చెప్పబడిన స్వరూపము ఏదికలదో, అది ఇక్కడ **అహమేకమిదం సర్వం** అని చెప్పబడినది. దీనిచే నిర్వికల్పసమాధిసిద్ధికి ఉపయుక్తమగు ధ్యానయోగము ఉపదేశింపబడుచున్నది. అహమేకం అనునది వ్యష్టివాచకము. దీనిని సమష్టియందు లీనమొనర్చవలెను. దీనివలన పూర్వశ్లోకమందలి సాలంబ, నిరాలంబ యోగములకుగల దోషము పరిహరింపబడుతుంది. ఇక్కడ స్వార్థము లేదు, వ్యష్టికి ప్రత్యేకించి అస్థిత్వములేదు. నిష్కామభావన. ఈ నిష్కామ భావప్రాప్తి ఎట్లు? అంటే 'హృదయం నిర్మలంకృత్వా' జ్ఞానవిరోధియైన రాగాది దోషరహితముగావించి పరిశుద్ధమొనర్చి, ఇది ఎట్లు పరిశుద్ధ మగునన్న నిష్కామముగా జేసిన వైదిక కర్మాచరణమువలన చిత్తశుద్ధి కలుగును. **"శ్రు. తపసా ప్రాప్యతే సత్త్వం, సత్త్వాత్సంప్రాప్యతే మనః, మనసా ప్రాప్యతే త్వాత్మా హ్యాత్మాప్త్యానని వర్తత"** తపస్సుచే సత్వగుణము కలుగును. ఈ సత్వగుణముచే పరిశుద్ధమైన మనస్సు ఏర్పడును. **"శ్రు. వేదోక్తేన ప్రకారేణ కృచ్ఛ్రచాన్ద్రాయణాదిభిః శరీర శోషణం యత్త తప ఇత్యుచ్యతే బుధైః। కోవామోక్షః? కథం కేన సంసారం ప్రతిపన్నవాన్? ఇత్యాలోకన మర్థజ్ఞా స్తపశ్శంసన్తి పణ్డితాః॥"** తపస్సనగా కృచ్ఛ్రచన్ద్రాయణాది నియమముల ప్రకారము స్వశరీరమును శోషింపచేయుట. లేదా...నేనవ్వడను? సంసారమనగా ఎట్టిది? దేనిచే సంసారమున బంధింప బడితిని? ఇందుండి విముక్తి ఎట్లు? అని శాస్త్రసహాయమున విమర్శచేసి తదనుసారము విముక్తిని పొందుటయే తపస్సని పణ్డితాభిప్రాయము. ఈ రెండుగుణముల చేతను సత్త్వగుణము వృద్ధియగుచున్నది. దీనిచే మనస్సు శుద్ధమగుచున్నది. దీనిచే నిష్కామ భావప్రాప్తి. ఇట్టి అన్తఃకరణశుద్ధులకు ఆత్మ లభించుచున్నది. ఈ సమస్తము నేనే అను సర్వాత్మభావనచే ఆత్మలాభముచే శ్రేష్ఠమైన సుఖమును పొందుచున్నాడు. అనగా పునరావృత్తి రహితమైన బ్రహ్మ పదము సంప్రాప్తమగుచున్నది. కావున ఇది శూన్యముకాదని గ్రాహ్యము.





॥అర్జున ఉవాచ॥

**అక్షరాణి సమాత్రాణి సర్వేబిన్దు సమాశ్రితా।**
**నాదేనభిద్యతే బిన్దుస్సనాదః కేన భిద్యతే॥ ౪౧**

**టీ॥ సమాత్రాణి అక్షరాణి** = మాత్రాసహితమైన అక్షరములు, **సర్వే** = అన్నియు, **బిన్దుసమాశ్రితాః** = బిన్దువునాశ్రయించినవి, **బిన్దుః** = బిన్దువు, **నాదేన** = నాదముచే, **భిద్యతే** = భేదింపబడుచున్నది, **సః** = ఆనాదము, **కేనభిద్యతే** = దేనిచే భేదింపబడుచున్నది.

**దీపికా:** ప్రపఞ్చము శబ్దనిరూపితంబని, శబ్దము వర్ణాత్మకమని, వర్ణములు ప్రణవరూపంబులని, ప్రణవము బిన్దురూపమని, బిన్దువు నాదరూపమని, నాదము బ్రహ్మధ్యాన స్థానరూపమైన కలాస్వరూపమని, బ్రహ్మమందు అన్వయించుటవలన బిన్దునాదకలాతీత పరబ్రహ్మమునే ధ్యానింపవలెనని **'బిన్దునాదకలాతీతం యస్తం వేద స వేదవిత్'** ఉపదేశం

చితివి. దానిని సవివరముగా చెప్పవలసినదని అడుగుచున్నాడు.

మాత్రాసహితమైన సర్వవర్ణములు బిన్దువును ఆశ్రయించుచున్నవి. బిన్దువు నాదముచే భేదింపబడుచున్నది. అనగా హ్రస్వదీర్ఘప్లుతాక్షరములు అన్నియు ఓఙ్కారము వలననే పుట్టినవి. **'శ్రు. చతుష్పాదిద మక్షరం పరంబ్రహ్మ'** అను శ్రుతి వచనముచే ప్రణవమునకు నాలుగు పాదములని స్పష్టమగుచున్నది.

**'శ్రు. పూర్వస్యమాత్రా పృథివ్యకారః సఋగ్భిః ఋగ్వేదో బ్రహ్మా, వసవో గాయత్రీ, గార్హపత్యః'** ప్రణవముయొక్క ప్రథమమాత్ర అకారము, గాయత్రీ ఛందస్సు, పృథివీ భూతము, అధిదేవత బ్రహ్మ.

**'శ్రు. ద్వితీయన్తరిక్షం స ఉకారః సయజుర్భిర్యజుర్వేదో విష్ణూరుద్రా త్రిష్టుప్ దక్షిణాగ్నిః'** ప్రణవముయొక్క ద్వితీయమాత్ర ఉకారము, త్రిష్టుప్ ఛందస్సు, ఆకాశము భూతము, అధిదేవత విష్ణువు.

**'శ్రు. తృతీయా ద్యౌస్స మకారః స సామాభిస్సామవేదః రుద్రః ఆదిత్యాః జగత్యాహనీయః'** ఓఙ్కారమునకు మూడవమాత్ర మకారము. జగతీ ఛందస్సు, ద్యులోకము భూతము, అధిదేవత రుద్రుడు.

**'యావసానేస్య చతుర్థ్యర్ధమాత్రా సా సోమలోక ఓఙ్కారః'** ఓఙ్కారముయొక్క నాల్గవదియగు అర్ధమాత్ర సోమలోకము. ఇది స్థూలమైనప్పుడు హ్రస్వము, దీర్ఘము, ప్లుతమని చెప్పబడును. **'శ్రు. స్థూలమేతద్ధ స్వదీర్ఘ ప్లుతమితి ఓమ్ ఓమ్ ఓమ్'** ఇది స్వభావముచే దీర్ఘమైనందున మొదటిది దీర్ఘము. రెండవ ఓఙ్కారము ప్లుతము, మూడవ ఓఙ్కారము నాలుగు మాత్రలు కలది.

అకార ఉకార సన్ధియోగముచే త్రయోదశ స్వరసదృశ వర్ణప్రకాశము గలది. ఇది శుద్ధబుద్ధి స్వరూపముగలది. దానిపై మకారము, దానిపై తెల్లనివర్ణముకల నాదము ప్రకాశించుచున్నది. ఈ అర్ధమాత్ర ఓఙ్కారో





చ్చారణకు చివరిదశ. పరమశాంతి స్థానము. ప్రణవముయొక్క ఒక్కొక్క మాత్రయు భిన్నమాత్రలయందు లయించును. అకారము ఉకారము నందు, ఉకారము బిన్దురూపమైన మకారమునందు లయించును. **'మాత్రా మాత్రాః ప్రతి మాత్రాగతాః'** బిన్దురూపమైన మకారము అర్ధమాత్ర రూపమైన నాదమునందు లయించును. మరి ఆ నాదము దేనియందు లయించు చున్నదని ప్రశ్నించుచున్నాడు.

**'శ్రు. ప్రాణం మనసి సహకరణైః నాదాన్తే పరమాత్మని సమ్ప్రతిష్ఠాప్య ధ్యాయీ తేశానం ప్రధ్యాయి తవ్యమ్'** ప్రాణములను ఇన్ద్రియములను మనస్సునందుజేర్చి నాదాన్తమైన పరమాత్మయందు (అర్ధమాత్రాధి దేవత యైన కారణబ్రహ్మస్వరూపమునందు) చక్కగా నిలిపి ఈశానుని ధ్యానము చేయవలెనని శ్రుతి వచనము.

దానంజేసి నాదము దేనియందు సమన్వయింపబడుచున్నదన్న ప్రశ్నమునకు భగవానుడు బ్రహ్మమునందని సమాధానము చెప్పుచున్నాడు.

**॥భగవానువాచ॥**

**అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్యయోధ్వనిః।**
**ధ్వనేరన్తర్గతం జ్యోతిః జ్యోతిరన్తర్గతం మనః।**
**తన్మనో విలయంయాతి తద్విష్ణోః పరమంపదమ్॥** ౪౨

**టీ॥ అనాహతస్య శబ్దస్య** = పరావస్థను పొందిన ప్రణముయొక్క, **యః ధ్వనిః** = ఏ ధ్వని(నాదము)కలదో, **తస్య శబ్దస్య** = అది ప్రణవముయొక్క **ధ్వనిః** = నాదము, **ధ్వనేరన్తర్గతమ్** = నాదాన్తర్గతముగా, **జ్యోతిః** = జ్యోతి కలదు, **జ్యోతిరన్తర్గతమ్** = జ్యోతిమధ్యయందు, **మనః** = మనస్సు, **తన్మనః** = ఆయొక్క మనస్సు, **విలయంయాతి** = ఎచ్చట నాశమును పొందుచున్నదో, **తత్** = అది, **విష్ణోః** = విష్ణువుయొక్క **పరమం పదమ్** = శ్రేష్ఠమైనస్థానము.

**దీపికా:** పఞ్చాశద్వర్ణరూపమైన బిన్దువు నాదముచే భేదింపబడుచున్నది. కలాపూర్ణమైన నాదము పరబ్రహ్మమునందే లీనమగునని చెప్పుచున్నాడు. హృదయవిభాతమైన శబ్దముయొక్క ఏధ్వనికలదో ఆ ధ్వనిమధ్యమున జ్యోతికలదు. ఆజ్యోతిరన్తర్గతముగా మనస్సు కలదు. ఆ మనస్సు ఎచ్చట లయించునో అది విష్ణుస్థానము. సకల ప్రాణులయొక్క హృదయస్థానమున ధ్యానయోగ్యమైనది (ధ్వని) దీపమువలె ప్రకాశించుచున్నది. **"సర్వస్యాన్త స్థానేభ్యో ధ్యేయేభ్యః ప్రదీపవత్ ప్రకాశయతీతి ప్రకాశః"** సకలభూతములు సర్వప్రపఞ్చమును లయించు మనోలయస్థానము. విష్ణుస్థానమనుటచే ఇది సర్వదేవతా విశ్రాన్తిస్థానము. **"శ్రు. సర్వేదేవాస్సంవిశన్తీతి విష్ణుః సర్వాణి బృంహ్మయతీతి బ్రహ్మ"** సకల ప్రపఞ్చమును మరల ఇటనుండే సృష్టింపబడుటచే బ్రహ్మమనబడుచున్నాడు. ఈ నాదమధ్య మందు జ్యోతి అనుటచే ఇది స్వప్రకాశ చైతన్యమైన జ్ఞేయము. జ్ఞేయరూపమైన జ్యోతియందు మనస్సు అణగియున్నది. నాదములనగా ఘంట, శంఖ, ధమరుక, దుందుభి, మేఘము మొదలైనవి. **'నాదేప్రవర్తితం చ్ఛితం నాదేనసహలీయతే'** నాదమునందు ప్రవర్తించిన చిత్తము నాదముతోడ లయమగుచున్నది. **'ధ్వనేరన్తర్గతం జ్ఞేయం జ్ఞేయస్యాన్తర్గతం మనః। మనస్తత్ర లయంయాతి తద్విష్ణోః పరమంపదమ్'** మేఘనాదము లభించుస్థానమే విష్ణువుయొక్క పరమపదము. విష్ణువనగా ఇట్టి స్థానము నందున్న యోగి. **'శ్రు. సర్వకరణాని మనసి సమ్ప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః'** స్థూలశరీరమునందలి సర్వేన్ద్రియములను మనస్సున సంప్రతిష్ఠించిన విష్ణుశబ్దవాచ్యుడైన యోగిచే పొందబడుచుండుటవలన ఇది పరమపదము.





**ఓఙ్కారధ్వని నాదేన వాయోః సంహరణాన్తికమ్।**
**నిరాలమ్బం సముద్దిశ్య యత్ర నాదో లయఙ్గతః॥** ४३

**టీ॥ ఓఙ్కారధ్వని నాదేన** = ఓఙ్కారధ్వన్యాత్మకంబైన నాదముతో, **వాయోః** = వాయువుయొక్క, **సంహరణాన్తికమ్** = రేచకపూరకాది విధానముగా నియమింపబడిన వాయువు నాశనమగువఱకు, **నిరాలమ్బమ్** = నిర్విశేష బ్రహ్మమును, **సముద్దిశ్య** = లక్ష్యముగా చేసుకొని, (ధ్యాయేత్), **యత్ర** = ఎక్కడ, **నాదః** = నాదము, **లయంగతః** = లీనమగుచున్నదో...(అది పరమపదము)

**దీపికా:** ఇంకను ఈవిధముగా చెప్పుచున్నాడు. ఓఙ్కారధ్వన్యాత్మకంబైన నాదముతో రేచక, పూరక, కుమ్భక విధానముగా నియమింపబడిన వాయువు నాశనమగువఱకు, **"ప్రాణాయామై స్త్రిభిః పూతస్తత ఓఙ్కారమర్హతి"** రేచక పూరక కుమ్భక భేదము వలన మూడువిధంబులుగాను, మూడుఅక్షరములుగాను ఉండుటచే ప్రణవమే ప్రాణాయామము అనబడుచున్నది. ఇడానాడిచే అకారమును చింతించుచు బాహ్యావాయువును ౧౬ మాత్రల కాలప్రమాణము పూరించి, పూరించిన వాయువును ౬४ మాత్రల కాలప్రమాణము ఉకారధ్యానయుక్తముగా కుమ్భించి, పిఙ్గలానాడిచే మకారమూర్తిని ధ్యానించుచు ३२ మాత్రల కాలప్రమాణము రేచించవలెను. ఇట్టి విధానముచే నియమింపబడిన వాయువు నశించు వఱకు నిర్విశేష బ్రహ్మమును ధ్యానించవలెను. దేనియందు వాయువు ప్రవర్తించుచున్నదో అందు మనస్సు ప్రవర్తించుచున్నది. దేనియందు మనస్సు లీనమగుచున్నదో అందు వాయువు లయించుచున్నది. **"సోఽయమే వాస్తు మోక్షాఖ్యో మాస్తువాపి మతాన్తరే"** చిత్తలయమే మోక్షమనెడు పదమునకు వాచ్యమగును. **లయో లయ ఇతిప్రాహుః కీదృశం లయలక్షణం। అపునర్వాసనోత్థాన ల్లయో విషయవిస్మృతిః"** పునఃపునః వాసన

ప్రవర్తింపనందున శబ్దాది విషయములనుగాని, ధ్యేయాకార విషయములనుగాని మరచుట లయమనబడును. ఇట్టి లయము నాదమును ఆశ్రయించియున్నది. **'సలయో నాదమాశ్రితః'** ఎచ్చట నాదము నాశనమెుందునో అది నాదాన్తము. **'లయ స్థానం వాయోస్తదుపరి చ మహానాదరూపం శివార్థమ్'** యోగులు ఏ విష్ణు స్థానమున ప్రాణములు నిల్పుచున్నారో అది వాయువిరామస్థానము. దానిపై నాదము లయించు మహానాద స్వరూపము. ఇట్టి బిన్దు నాద నాదాన్త సమన్వయముచే సూక్ష్మరూపము కూడ పరిత్యజించబడి కేవలాత్మయే ఉన్మనీసంచారము నకు మిగులును.

**॥అర్జున ఉవాచ॥**

**భిన్నేపఞ్చాత్మకే దేహే గతే పఞ్చసుపఞ్చధా।**
**ప్రాణైర్విముక్తే దేహేతు ధర్మాధర్మౌ క్వ గచ్ఛతః॥ ४४**

**టీ॥ పఞ్చాత్మకే** = పఞ్చాత్మకమగు, **దేహే** = దేహము, **భిన్నే** = భిన్నము కాగా, **పఞ్చసుపఞ్చధా** = అయిదును అయిదు విధములుగా, **గతే** = పొందియుండగా, **ప్రాణైః** = ప్రాణములచే (దశవిధ వాయువులచే), **దేహేతు** = స్థూలశరీరము, విముక్తే = విడువబడుచుండగా, **ధర్మాధర్మౌ** = ధర్మాధర్మములు, **క్వ గచ్ఛతః** = ఎచ్చటకు పోవుచున్నవి.

**దీపికా:** ఇతఃపూర్వోక్త విషయమంతయు ఆరూఢునకే గదా; ఇక చిత్త శుద్ధిలేని ఆరురుక్షునిస్థితి ఎట్టిదని అడుగుచున్నాడు. పఞ్చభూతాత్మక మగు దేహము భిన్నముకాగా అయిదును అయిదువిధములగుచున్నవి. ప్రాణోపప్రాణములచే శరీరము విడువబడుచుండగా జీవుడొనర్చిన ధర్మార్మములు ఎచ్చటకు పోవుచున్నవి. ఇతఃపూర్వము చెప్పినదంతయు వాసనాక్షయమైన ఆరూఢుని విషయము, ఆరురుక్షునకు చిత్తము





వాసనాయతమై యుండును, అట్టివానికి **అయమాత్మా బ్రహ్మేత్యాది** మహావాక్యార్థస్థితి లేదు. ఈ స్థితిలేని వానికి జననమరణములు తప్పవు. పఞ్చభూతములు భిన్నములై, ప్రాణోపప్రాణములచే విడువబడగా జీవుడొనర్చిన సకలవిధ కర్మపరిపాక జన్యమైన వాసనలు ఎచ్చటకు పోవుచున్నవని ప్రశ్నించెను.

**॥భగవానువాచ॥**

**ధర్మాధర్మౌ మనశ్చైవ పఞ్చభూతాని యాని చ।**
**ఇన్ద్రియాణి చ పఞ్చైవ యాశ్చాన్యాః పఞ్చదేవతాః॥ ४५**
**తాశ్చైవ మనసా సర్వే నిత్యమేవాభిమానతః।**
**జీవేన సహ గచ్ఛన్తి యావత్తత్త్వం నవిన్దతి॥ ४६**

**టీ॥ ధర్మాధర్మౌ** = పుణ్యపాపములు, **మనశ్చైవ** = మనస్సును, **యాని** = ఏ, **పఞ్చభూతాని** = పఞ్చభూతములున్ను, **పఞ్చైవ** = అయిదైన, **ఇన్ద్రియాణిచ** = ఇన్ద్రియములును, **యాశ్చ** = ఏ, **అన్యాః పఞ్చదేవతాః** = ఇతరములైన దేవతలును, **మనసా** = మనస్సుతో, **తాశ్చ సర్వే** = ఆ సమస్తమును, **నిత్యమేవ** = నిరంతరము, **అభిమానతః** = అభిమానులై యుండుటవలన, **యావత్తత్త్వమ్** = ఎంతవఱకు తత్త్వమును, నవిన్దతి = తెలిసికొనడో, **తావత్** = అంతవఱకు, **జీవేన సహ** = జీవుని అనుసరించి, **గచ్ఛన్తి** = పోవుచున్నవి.

**దీపికా:** జీవుడొనర్చిన సకలవిధ కర్మపరిపాక జన్యమైన శుభాశుభ వాసనలు లిఙ్గశరీరమును ఆశ్రయించి యుండునని చెప్పుచున్నాడు. ధర్మాధర్మములు, మనస్సు, పృథివ్యాది పఞ్చభూతములు, పఞ్చజ్ఞానేన్ద్రియ ములు, పఞ్చ కర్మేన్ద్రియములు, ఆయా ఇన్ద్రియాధిష్ఠాన దేవతలు సమస్తము; నిరంతరము అహఙ్కార మమకార విషయాభిమాన పూర్ణమై బ్రహ్మానుభవమును చెందకుండు జీవునితో, అనగా ఎంతవఱకు పుణ్యపాప సంబంధ రహితమగు

మార్గము నెఱుంగడో, అంతవఱకు జీవునితోగూడ పోవుచున్నవి. స్వతఃజీవుడు నిర్మలుడు, సర్వగతుడు. జీవునకు మనస్సుయొక్క తాదాత్మ్యముచేతనే మానసికవృత్తులు సంక్రమించును. ఈ సంక్రమించుట కూడా అధ్యారోపితమే, సత్యముకాదు. దీనిచే ప్రమాతృత్వ, కర్మకర్తృత్వ, ఫలభోక్తృత్వములు ఆరోపితములగుచున్నవి. ఆత్మ మనస్సుల తాదాత్మ్యముచే మనస్సు పురుషత్వాది అభిమానమును, జీవుడు ద్రష్టృత్వ కర్తృత్వాది అభిమానమును పొందుచున్నవి. మనస్తాదాత్మ్యముచే అధ్యారోపిత కర్తృత్వాద్యభిమాన పూర్ణుడైన జీవుని ఆశ్రయించి ధర్మాధర్మముల మొదలుకొని దేవతలవఱకు బ్రతుకుచున్నారు. **'సర్వగతోపి తదాత్మా బుద్ధిస్థో దృశ్యతామేతి'** బుద్ధ్యుపాధియందున్న వాడై దృశ్యత్వమును పొందుచున్నాడు. మనస్సు మరియు బుద్ధియను పదములు అన్తఃకరణ చతుష్టయమునే సూచించును. అన్తఃకరణచతుష్టయముచే అధ్యారోపిత కర్తృత్వాద్యభి మానపూర్ణుడైన జీవుడు సూక్ష్మశరీరిగా చెప్పబడ్డాడు. పుణ్యాపాపములు, మనస్సు, పఞ్చభూతములు, ఇన్ద్రియదశకము, ఆ ఇన్ద్రియాధిష్ఠాన దేవతలు సర్వమును ఈ జీవునిచే బ్రతుకుచున్నారు. కనుకనే **'జీవేన సహగచ్ఛన్తి'** అని చెప్పుట.

**'శ్రు. అస్యమధ్యేస్తి హృదయం సనాళం పద్మకోశవత్। సత్వాన్తర్వర్తినో దేవాః కర్తృహఙ్కార చేతనాః॥'** పద్మకోశమువలె నాళసమన్వితమైన హృదయకోశము జీవునిస్థానము. ఆ స్థానమును ఆశ్రయించి సత్వాన్తర్వర్తినులు, అన్తఃకరణ విశిష్టులైనట్టి దేవతలు ఉంటున్నారని శ్రుతివచనము. కనుక లిఙ్గశరీరమును ఆశ్రయించుకు ఉందురని స్పష్టమగుచున్నది.

**॥అర్జున ఉవాచ॥**

> **స్థావరం జఙ్గమం చైవ యత్కిఞ్చిత్సచరాచరమ్।**
> **జీవా జీవేన సిధ్యన్తి సజీవః కేన సిద్ధ్యతి॥** ౪౭





**టీ॥** స్థావరమ్ = స్థావరమును, జఙ్గమంచైవ = జంగమమును, యత్కిఞ్చిత్ = ఏకొద్దిపాటివైన(మిగిలియున్నవియునైన), సచరాచరమ్ = చరాచరములు సమస్తమును, జీవాః = స్థూలదేహాభిమానముగల విశ్వప్రాజ్ఞతైజసులను జీవులు, జీవేన = లిఙ్గశరీరాభిమానముగల తైజసునిచే, సిద్ధ్యన్తి = సిద్ధించుచున్నారు. సజీవః = ఈ తైజసాభిమానియైన జీవుడు, కేన సిద్ధ్యన్తి = ఏవిధముగా సిద్ధినొందుచున్నాడు.

**దీపికా:** స్థావరజఙ్గమాత్మకమైన సకల ప్రపఞ్చము అనగా పుణ్యాపాప ములు, మనస్సు, భూతపఞ్చకము, ఇన్ద్రియదశకము, ఇన్ద్రియాధి దేవతలు సర్వము లిఙ్గశరీరమునందు లయించుచున్నారు. అనగా అన్తః కరణ చతుష్టయముచే అధ్యారోపిత కర్తృత్వాద్యభిమాన పూర్ణుడైన జీవుని యందు లయించుచున్నారు. మరి ఈ నామరూప వికారభేదోపాదధిక మైన లిఙ్గశరీరమునకు భంగమే విధముగా కలుగుచున్నదని అడుగుచున్నాడు.

**॥భగవానువాచ॥**

> **ముఖనాసికయోర్మధ్యే ప్రాణస్సఞ్చరతే సదా।**
> **ఆకాశః పిబతే ప్రాణం స జీవః కేన జీవతి॥** ౪౮

**టీ॥ ముఖనాసికయోః** = ముఖనాసికలయొక్క, **మధ్యే** = మధ్యభాగ మందు, **ప్రాణః** = ప్రాణము, **సదాసఞ్చరతే** = ఎల్లప్పుడు సంచరించు చున్నది. **ఆకాశః** = ఆకాశము, **ప్రాణమ్** = ప్రాణమును, **పిబతే** = త్రాగుచున్నది. **సజీవః** = ఆ జీవుడు, **కేన జీవతి** = దేనిచే జీవించు చున్నాడు.

**దీపికా:** లిఙ్గశరీరమునకు భంగమేవిధముగా కలుగుచున్నదో చెప్పు చున్నాడు. ముఖనాసికల మధ్యభాగమందు ఉచ్ఛ్వాసనిశ్వాసములచే

ప్రాణము నిరంతరము సంచరించుచున్నది. వాయువు చలించుటచే చిత్తము చలించుచున్నది. మనస్సు చలించుటచే జీవుడు వాసనాయుక్తు డగుచున్నాడు. ఇది అంతయు ప్రాణము ఇడాపిఙ్గళ నాడులయందు సంచరించునప్పుడు. ఎప్పుడు ఆకాశము ప్రాణమును త్రాగుచున్నదో, ఇచ్చట ఆకాశము సుషుమ్నాపర్యాయ పదముగ ప్రయోగింపబడినది. **"ఇడాపిఙ్గళయోర్మధ్యే శూన్యంచై వానిలంగ్రసేత్। తిష్ఠతే ఖేచరీముద్రా తత్ర సత్యం పునఃపునః॥"** ఇడాపిఙ్గళ నడుమ శూన్యము (ఆకాశము) వాయువును మ్రింగుచున్నది. **"సుషుమ్నా శూన్యపదవీ బ్రహ్మరన్ధ్రం మహాపథః। శ్మశానం శామ్భవీ మధ్య మార్గశ్చే త్యేకవాచకాః॥"** శూన్యము అనగా సుషుమ్నాయని గ్రాహ్యము. అంత జీవుడు ఖేచరుడై మనోన్మని అవస్థయందున్న వాడుగా అగుచున్నాడు. అనాహతమువఱకు ద్వైత ప్రపఞ్చము పూర్ణముగా ప్రకాశించుచున్నది. ఎందువలననగా దేహము నకు కామము, క్రోధము, నిశ్వాసము, భయము, నిద్ర అను పఞ్చవిధ దోషములు గలవు, ఇవి సఙ్కల్పరాహిత్యము, క్షమ, లఘుభోజనము, అప్రమత్తత, తత్త్వసేవనము అనువానిచే శాంతించును. తత్త్వవిచారాది సాధనలచే గతించిన దోషముగల వాడగుటచే జీవుడు అనాహతపద్మము విడిచి విశుద్ధమునుచేరును. పతఞ్జలిమహర్షి కూడా **'సర్వగతం నిరుపమ మద్వైతం తచ్చేతసా గమ్యమ్"** అని నిర్మలమగు మనస్సును సాధనముగా గైకొని నామరూపాది వికారవర్జితుడై జీవుడు నిర్మలుడు, నిర్గుణుడు అగునని చెప్పియున్నారు. **"సుషుమ్నా వాహిని ప్రాణే సిద్ధ్యత్యేవ మనోన్మనీ"** ఇచ్చట ఆకాశ శబ్దమునకు మరియొక ప్రయోజనము కలదు. ప్రాణములు విశుద్ధచక్ర స్థానీయమైనప్పుడు జీవభావము నశించిన వాడుగా అగుచున్నాడు. **"శ్రు. ద్వాదశారే మహాచక్రే పుణ్యపాప వివర్జితే।**





**తావజ్జీవో భ్రమత్యేవం యావతత్త్వం నవిన్దతి॥"** యోగి అనాహతస్థానము వఱకు జీవభావము కలవాడుగా అయియున్నాడు. వాసనాక్షయ రూప ముగా జీవభావము నశించిన యోగి విశుద్ధమైన ఆకాశమును పొందుచు న్నాడు. ఇది తురీయపదము. ఇక్కడ జీవుడు తనకు భిన్నముగా నేదియు లేదను జ్ఞానముగలవాడు అగుటచే పూర్వము దృశ్యమానమైన ద్వైత ప్రపఞ్చము జీవునియందు లయించుచున్నది.

**॥అర్జున ఉవాచ॥**

**బ్రహ్మాణ్డ వ్యాపితం వ్యోమ వ్యోమ్నా చావేష్టితం జగత్।**
**అన్తర్బహిశ్చ తద్వ్యోమ కథం దేవో నిరఞ్జనః॥** ౪౮

**టీ॥ వ్యోమ** = ఆకాశము, **బ్రహ్మాణ్డవ్యాపితమ్** = బ్రహ్మాణ్డముచే నావరింప బడియున్నది, **వ్యోమ్నాచ** = ఆకాశముచే, **జగత్** = ప్రపఞ్చము, **ఆవేష్టితమ్** = వ్యాప్తమైయున్నది. **తద్వ్యోమ** = ఆ ఆకాశము, **అన్తర్బహిశ్చ** = బాహ్యాభ్యన్తరముల, (వర్తతే, తస్మాత్కారణాత్), **దేవః** = ఈశ్వరుడు, **నిరఞ్జనః** = అన్యప్రకాశ నిరపేక్షుడు, **కథం స్యాత్** = ఎట్లగును.

**దీపికా:** బ్రహ్మాణ్డాద్యుపాధి విశిష్టంబైన బ్రహ్మమునకు నిరంజనత్వము ఏలాగున సిద్ధించును? ఆకాశము బ్రహ్మాణ్డముచే ఆవరింపబడియున్నది. ఆకాశము పిణ్డాణ్డాన్తర్గత ప్రపఞ్చమంతయు వ్యాప్తమైయున్నది. ఆ ఆకాశము బాహ్యాభ్యన్తరముల వర్తించుచున్నది. అనగా అన్తర్లక్ష్యమందు, బహిర్లక్ష్యము నందు వ్యోమపఞ్చకమైన ఆకాశము వర్తించుచున్నది. ఇట్లుండ ప్రకాశ స్వరూపుడు నిరంజనుడు ఎట్లగును. బహిర్లక్ష్యమనగా...

**"శ్రు. బహిర్లక్ష్యస్తు నాసాగ్రే చతుష్షడష్ట దశద్వాదశాఙ్గుళిభిః క్రమాత్ నీలద్యుతి శ్యామత్వ సదృగ్రక్తభఙ్గీస్ఫురచ్ఛుక్ల పీతవర్ణద్వయోపేతం వ్యోమతత్త్వం పశ్యతి"** నాసాగ్రమందు నాలుగు ఆరు ఎనిమిది పది

పంద్రెండు అఙ్గుళములచే క్రమముగా నీలవర్ణప్రకాశము, శ్యామలవర్ణ సమానమైన రక్తముతో కూడినది, తెలుపును పీతవర్ణము కలసినట్లుగా కనంబడు వ్యోమతత్త్వమును చూచుచున్నాడు. **"శ్రు. పురుషస్య దృష్ట్యాగ్రే జ్యోతిర్మయూఖా వర్తన్తే"** యోగి దృష్టియొక్క అగ్రభాగమునందు జ్యోతికిరణములు కనబడును. అనగా శిరోగ్రభాగమున జ్యోతిసమూహ దర్శనము కలిగి అమృతత్వము కలుగును. **అన్తర్లక్ష్యము** ఇది జలజ్యోతి స్వరూపమైనది. ఇది ఏకాదశేన్ద్రియములలో దేనిచేతను తెలుసుకొనుటకు సాధ్యముగాదు. సహస్రారమున జలజ్యోతి అన్తర్లక్ష్యమైయున్నది. అంతర బాహ్యలక్ష్యముల పఞ్చవిధఆకాశములే వర్తించుచుండుటచే ప్రకాశ స్వరూడైన పరమాత్మ నిరఞ్జనుడెట్లగును.

**॥భగవానువాచ॥**

**ఆకాశో హ్యవకాశశ్చ ఆకాశవ్యాపితం చ యత్।**
**ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే॥** ౫౦

**టీ॥ ఆకాశః** = మహాకాశము, **అవకాశశ్చహి** = పరిచ్ఛిన్నాకాశమును, **యత్** = ఏ కారణముచే, **ఆకాశవ్యాపితమ్** = ఆకాశతన్మాత్రాభుతముచే ఆవరింపబడియున్నది, **శబ్దః** = తన్మాత్రాభుతమైన శబ్దము, **ఆకాశస్య** = ఆకాశముయొక్క, **గుణః** = గుణము, **బ్రహ్మ** = పరమాత్మ, **నిశ్శబ్దః** = నిశ్శబ్దమని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది.

**దీపికా:** అన్తర్బాహ్యలక్ష్యముల పఞ్చవిధ ఆకాశములే వర్తించుచుండుటచే పరమాత్మ అన్యప్రకాశనిరపేక్షుడు ఎట్లగునని ప్రశ్నించిన అర్జునునకు, ఆకాశము మొదలు సర్వప్రపఞ్చము కల్పితమైనదగుటచే అంతయు అసత్యమని సమాధానము చెప్పుచున్నాడు. ఆకాశముచే అనగా తన్మాత్రా భుతమైన శబ్దముచే మహాకాశ, పరిచ్ఛిన్నాకాశము వ్యాప్తములైయున్నవి. ఆకాశమునకు శబ్దము గుణము. ఆ ఆకాశమువలె శబ్దమును మిథ్యా




భూతము. కనుకనే **'శ్రు. నైవ వాచా నమనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా"** అని అంటుంది. వాగాది ఇన్ద్రియములు మిథ్యాభూతములనే గ్రహింపశక్తి గలవి. బ్రహ్మము **'శ్రు. అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచిన్త్య మవ్యపదేశ్యమేకాత్మ"** అదృశ్యము, వ్యవహరించుటకు వీలులేనిది, ఇన్ద్రియములకు అందనిది, దానినిగూర్చి చింతించుటకు సాధ్యముగానిది. ఇట్టిదని చెప్పుటకు వీలులేనిది కావుననే నిశ్శబ్దమని చెప్పబడుచున్నది. **"శ్రు. యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ"** కనుకనే వాక్కు మనస్సుతోసహా బ్రహ్మమును తెలుసుకొనలేక వెనుదిరిగినదని శ్రుతి పలుకుచున్నది. బ్రహ్మము నిష్ప్రపఞ్చము, అక్షరము, సత్యము, నిస్సఙ్గముకావున బ్రహ్మమునకు మిథ్యాభూతమైన ప్రపఞ్చముతో సంబంధములేదు. అందుచే నిరఞ్జనము.

**॥అర్జున ఉవాచ॥**

**దన్తోష్ఠతాలు జిహ్వానా మాస్పదం యత్ర దృశ్యతే।**
**అక్షరత్వం కుతస్తేషాం క్షరత్వం వర్తతే సదా॥** ౫౧

**టీ॥ యత్ర** = ఆ వర్ణాత్మకాక్షరములయందు, **దన్తోష్ఠతాలు జిహ్వానమ్** = దన్తోష్ఠతాలు జిహ్వలయొక్క, **ఆస్పదమ్** = ఆధారము, **దృశ్యతే** = ప్రత్యక్షముగా అనుభవమందున్నది. **తేషామ్** = వాటికి, **అక్షరత్వమ్** = నాశము లేకపోవుట, **కుతః** = ఎక్కడ, **సదా** = ఎల్లప్పుడును, **క్షరత్వమ్** = నాశనము, **వర్తతే** = కలుగుచున్నది.

**దీపికా:** బ్రహ్మము నిష్ప్రపఞ్చము, అక్షరము, సత్యము కావున బ్రహ్మమునకు మిథ్యాభూతమైన ప్రపఞ్చముతో సంబంధములేదు, కావున నిరఞ్జనము, నిస్సఙ్గము అని భగవానుడు చెప్పిన సమాధానము నందలి

అక్షరత్వమునకు భావము గ్రహింపలేక లోకవ్యవహారమందలి ప్రసిద్ధమైన అకారాది వర్ణములని తలచి, ఆ వర్ణములకు అక్షరత్వము అసంభవమని యెఱింగి, అక్షరములకు దన్తోష్ఠాదుల ఆస్పదత్వముచే అనిత్యత్వము ప్రత్యక్షముకదా! మరి ఆ ఆక్షరములకు శాశ్వతత్వము ఎట్లు సిద్ధించును. అని ప్రశ్నించెను.

**॥భగవానువాచ॥**

**అఘోషమవ్యఞ్జన మక్షరఞ్చాప్య తాలుకణ్ఠోష్ఠ మనాసికఞ్చ।**
**అరేఫజాతం పరమూష్మ వర్జితం తదక్షరం నక్షరతే కథఞ్చిత్॥** ౫౨

**టీ॥ అఘోషమ్** = ఘోషసంజ్ఞకల వర్ణము కానిదియు, **అవ్యఞ్జనమ్** = వ్యఞ్జనములు కానిదియు, **అస్వరమ్** = షోడశస్వరములు కానిదియు, **అతాలుకణ్ఠోష్ఠమ్** = అజ్వ్యఞ్జనాద్యుత్పత్తి స్థానరహితము, **అనాసికం చ** = అనునాసికలు కానిదియు, **అరేఫజాతమ్** = రేఫవర్ణములలో పుట్టనిది, **ఊష్మవర్జితమ్** = ఊష్మలుకానిదియు, **పరంఅక్షరమ్** = అన్నిటికంటే పరమైన నాశనము లేనిదగు, **తత్** = ఆ బ్రహ్మము, **కథఞ్చిత్** = ఏరీతిగను, **నక్షరతే** = నశింపదు.

**దీపికా:** అక్షరశబ్దమునెఱుంగని అర్జునునకు అక్షరశబ్దార్థమును ఉపదేశించు చున్నాడు. ఘోషవర్ణములు కలదికాక అనగా శ్వాస, అఘోష, వివార, నాద, ఘోష, సంవార, అల్పప్రాణ, మహాప్రాణ, ఉదాత్త, అనుదాత్త, స్వరితాది బాహ్యప్రయత్నములు లేనిది. వ్యఞ్జనములు కానిదియు, వ్యఞ్జన మనగా **'అన్వగ్భవతి వ్యఞ్జనమితి'** పరాధీనమైన వర్ణములు, అచ్చుల సహాయముచే ఉచ్ఛరింపబడునవి. ఇట్టి వ్యఞ్జనములు కానిది. **అస్వరమ్** అ,ఇ,ఉ మొదలైన స్వరములు కానిది. ఈ అచ్చులు **"ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘ ప్లుతః"** హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని భేదములు కలదగుటచే స్వరములుకానిది. **అతాలు కణ్ఠోష్ఠమ్** తాలువులు **'ఇచయశాస్తాలవ్యాః'** ఇ,ఈ,చ,ఛ,జ, ఝ,ఞ,య,శ లు దవడలునుండి పుట్టునవి, కణ్ఠ్యములు **"అకుహ విసర్జనీయాః కణ్ఠ్యాః"** అ,ఆ,క,ఖ,గ,ఘ,ఙ,ః ఇవి కంఠముయుండి పుట్టునవి, ఓష్ఠములు **'ఉపూపధ్మానీయా ఓష్ఠ్యా'** ఉ, ఊ,ప,ఫ,బ,భ,మ ఇవి పెదవులనుండి పుట్టునవి (శరీరాఙ్గముల సహాయ ముచే పలుకబడునట్టివి) ఇవి కానిదియు, **అరేఫజాతమ్** రేఫవర్ణములో పుట్టనిది, **ఊష్మవర్జితమ్** శషసహలు ఊష్మలు. ఇవి ద్వివృతయత్నము కలవగుటచే ఇవి కానిదియు. **పరమ్** అన్నిటికంటే పరమైన **అక్షరమ్** అవినాశియగు ఆ బ్రహ్మము ఏరీతిగా నాశమొందును? ప్రసిద్ధంబగు వర్ణలక్షణములు లేనిదగుటచే బ్రహ్మము ఏవిధముగను నాశనమ చేందదని భావము.

బ్రహ్మాణ్డ పిణ్డాణ్డ మాతృకలు శివశక్త్యాత్మకము. పిణ్డాణ్డమున బ్రహ్మ రన్ధ్రాధోభాగము నందున్న సహస్రారకమలాన్తర్గత చన్ద్రమణ్డలము సర్వకారణబిన్దువు. ఇది పరాస్థానము. మూలాధారాది సహస్రార కమల కర్ణికపర్యన్తము వ్యాపించియున్న సుషుమ్నా పరానాడి. పరాస్థానమున (స్ఫురణశక్తి కలుగుచున్నది) శబ్దోచ్చారణ యిచ్ఛ జనించిన సత్వరమే పరానాడి ప్రేరేపింపబడి మూలాధారమున వాయువు ఉత్పన్నమగును. ఇది పశ్యన్తీస్థానము. ఆ వాయువు స్వాధిష్ఠాన మణిపూరములు దాటి అనాహతముచేరును. ఇది మధ్యమ. మూలాధారాది అనాహత పద్మ పర్యన్తముగానున్న వ్యఞ్జనములు విశద్ధ కమలమునుపొంది వైఖరీ రూపమున స్పష్టాక్షరములు కలిగి, శబ్దము ఉచ్ఛరింపబడి నామరూపా త్మకమైన జగత్తు ప్రకాశించుచున్నది. ఈ పరానాడి పఞ్చాశద్వర్ణ

మాతృకారూపముగానున్నందున ఈ మాతృకలే ఆజ్ఞాది మూలాధారాన్త షట్కమలాకారములను పొందుచున్నవి. మూలాధారాది ఆజ్ఞాన్తముగా నున్న షట్చక్రములు సహస్రారమున లీనమగుచుండుటచే, షట్చక్రా కారమునుపొందిన పఞ్చాశద్వర్ణములు సర్వకారణబిన్దువైన పరా స్థానమును పొందుచున్నవి. శివస్వరూపమగు ఆ పరాబిన్దువు 'అక్షరమ్' అనబడుచున్నది. ఇది ఏవిధముగను నాశనము చెందదు. ఈ పరా బిన్దువునుండి సృష్టిక్రమమున నాదము అభివ్యక్తమగుచున్నది. అందుండి ప్రణవము, అందుండి పఞ్చాశ ద్వర్ణరూపమున నామాత్మక శాఖయు, రూపాత్మకశాఖయు కలుగు చున్నవి. సంహారక్రమమున **"శ్రు. షణ్ముఖీకరణేన ప్రణవధ్వనిం నిశమ్య మనస్తత్రం లీనం భవతి"** పఞ్చాశద్వర్ణ సహితముగా ప్రణవముకూడ లయమగుచుండుటచే కేవలము ఆ పరాబిన్దువు అక్షరసంజ్ఞ కలదగుచున్నది.

**॥అర్జున ఉవాచ॥**

**జ్ఞాత్వా సర్వగతం బ్రహ్మ సర్వభూతాధివాసితమ్।**
**ఇన్ద్రియాణాం నిరోధేన కథం సిద్ధ్యన్తి యోగినః॥** ౫౩

**టీ॥ యోగినః** = యోగులు, **బ్రహ్మ** = బ్రహ్మమును, **సర్వభూతాధి వాసితమ్** = సర్వభూతములందును అన్తర్యామిగానున్న వానినిగా, **జ్ఞాత్వా** = తెలుసుకొని, **ఇన్ద్రియాణామ్** = ఇన్ద్రియములయొక్క, **నిరోధేన** = నియమనముచే, **కథమ్** = ఎట్లు, **సిద్ధ్యన్తి** = ముక్తులగుచున్నారు.

**దీపికా:** ఇక్కడ అర్జునుడు శాస్త్రసహాయముచే పొందబడిన జ్ఞానము యొక్క అనుభవ దృఢత్వమును అడుగుచున్నాడు. యోగులు బ్రహ్మమును సర్వభూతములయందున్న వానిగా తెలుసుకొని అనగా **"శ్రు. ఏకోదేవ స్సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా, కర్మాధ్యక్షః**





**సర్వభూతాధివాస సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"** సకలభూతములందున్నవాడు అనుటచే ఆత్మ స్వరూపమును, కర్మాధిపతియు, అన్తర్యామియు, సాక్షియు అని తెలుసుకొని, సర్వవ్యాపిగా తెలుసుకొని అనగా కారణరూపమున వ్యాపించియుండు వాడు కావున అంతటా పోవువానినిగా తెలుసుకొని, వానిని ఇన్ద్రియనిరోధముచే ఎట్లు పొందువారగుచున్నారు. అని శంకచేసెను.

**॥భగవానువాచ॥**

**ఇన్ద్రియాణాం నిరోధేన దేహే పశ్యన్తి మానవాః।**
**దేహేనష్టే కుతో బుద్ధి ర్బుద్ధినాశే కుతోజ్ఞతా॥** ౫౪

**టీ॥ మానవాః** = మనుష్యులు, **ఇన్ద్రియాణామ్** = ఇన్ద్రియములయొక్క, **నిరోధేన** = నియమనముచే, **దేహే** = దేహమునందు, (**దేవమ్** = దేవుని), **పశ్యన్తి** = చూచుచున్నారు. **దేహేనష్టే** = దేహము నశించిన, **బుద్ధిః** = ఎక్కడ?, **బుద్ధినాశే** = బుద్ధినశించిన, **కుతోజ్ఞతా** = జ్ఞానము ఎక్కడ?

**దీపికా:** ఇన్ద్రియ నియమనముచే ఎట్లు సిద్ధిపొందుచున్నారని అడుగబడిన ప్రశ్నమునకు, సమాధానముగా జ్ఞానోపాయమును చెప్పుచున్నాడు. సాధకులు మనస్సహితముగా ఇన్ద్రియములను నిరోధించుటచే, దేహము నందే ఈశ్వరుని చూచుచున్నారు. ఏకాదశేన్ద్రియ సమాహార రూపమైన దేహము నష్టమైనదికాగా బుద్ధి ఎక్కడిది. దేహమనగా మూలాధారమున భూమణ్డలమునందు పాదఘ్రాణేన్ద్రియ గన్ధతత్త్వములు మూడు; జలమణ్డలమున పాణి రసనేన్ద్రియ రసతత్త్వములు మూడు; వహ్నిమణ్డలమున పాయుచక్షురిన్ద్రియ రూపతత్త్వముల మూడు; వాయు మణ్డలమున ఉపస్థ త్వగిన్ద్రియ స్పర్శతత్త్వములు మూడు; నభో మణ్డలమున వాక్ శ్రోత్రేన్ద్రియ శబ్దతత్త్వములు మూడు; వీటి

సముదాయము పఞ్చతత్త్వాలు పృథివ్యాదులు కలుపుకొని వింశతి తత్త్వాలు విశుద్ధచక్ర పర్యన్తముగలవు. అటుపై మనస్సు ఆజ్ఞాచక్ర స్థానీయము. వీటి సమష్టియే దేహము. ఏకవింశతి తత్త్వములు నశించిన బుద్ధియు నశించుచున్నది. బుద్ధి లయించుపర్యన్తమే జ్ఞానావశ్యకత. బుద్ధి లయించుట అనగా నిశ్చయాత్మకమగుట. ఇట జ్ఞానావశ్యకత లేకపోవుటచే **"బోద్ధవ్య లక్షణా సైవప్రకృతిః శక్తి జృమ్భితా బిన్దుతత్త్వం"** జ్ఞానరూపమైన శక్తి ప్రకాశస్వరూపమైన బిన్దువునందు లీనమగుచున్నది. మరియు ఉపాధినష్టమైన జ్ఞానసాధనకు ఘాతకలుగుచున్నది. కనుక ఇన్ద్రియదారుఢ్యము, దేహదారుఢ్యము అపరోక్షజ్ఞానమునకు యజ్ఞదాన శ్రవణాదికమువలె కారణమని సిద్ధించుచున్నది.

**తావదేవ నిరేధ స్స్వాద్యావత్తత్త్వం నవిన్దతి।**
**విదితే తు పరేతత్త్వే ఏకమేవాను పశ్యతి॥** ౫౫

**టీ॥ యావత్త్వమ్** = ఎంతవఱకు అపరోక్షజ్ఞానము, **నవిన్దతి** = ఎఱుగడో, **తావదేవ** = అంతవఱకు, **నిరోధః** = ఇన్ద్రియ నియమనము కలవాడు, **స్యాత్** = అగును. **పరేతత్త్వే** = అఖణ్డానన్ద బ్రహ్మమును, **విదితే** = తెలిసిన, **ఏకమేవ** = ఏకరూపముగానే, **అనుపశ్యతి** = చూచుచున్నాడు.

**దీపికా:** ఇచ్చట పరమాత్మ అనుష్ఠానముయొక్క అవధిని చెప్పుచున్నాడు. ఎంతవఱకు అపరోక్షజ్ఞానము కలుగదో, అంతవరకు ఇన్ద్రియనియమనము కలవాడగును. ప్రాణాయామాది సాధనానుష్ఠానములచే మనస్సును నిరోధించినవాడగును. అనగా సమాధి యందుండును. ఇట్టి సమాధి యందు దేహేన్ద్రియ నియమనానుష్ఠానాది సాధనరహితముగా అఖణ్డానన్ద రూపముగా బ్రహ్మమును చూచినవాడు, పిపీలికాది బ్రహ్మపర్యన్తము ఏకరూపముగానే చూచుచుండును.





**నవచ్ఛిద్రాన్వితా దేహాః స్రవన్తి గలికా ఇవ।**
**నైవబ్రహ్మ నశుద్ధ్య స్యా త్పుమాన్ బ్రహ్మవిన్దతి॥** ౫౬

**టీ॥ నవచ్ఛిద్రాన్వితా** = నవరన్ధ్రములతోకూడినవి, **దేహాః** = దేహములు, **గలికా ఇవ** = చిల్లుకుండవలె, **స్రవన్తి** = కారుచున్నవి. **నైవబ్రహ్మనశుద్ధ్యస్యాత్పుమాన్** = బ్రహ్మస్వభావముకాని పరిశుద్ధముగాలేని జీవుడు, **బ్రహ్మ** = పరమాత్మను, **నవిన్దతి** = పొందలేడు.

**దీపికా:** అపరోక్షజ్ఞానసిద్ధి పర్యన్తము తత్త్వసాధనములను అవలంబింపవలెనని, అది సిద్ధింపనిచో తత్త్వజ్ఞానసిద్ధి లేదని చెప్పుచున్నాడు. కేవల శాస్త్రాధ్యయనజన్యమైన పరోక్షజ్ఞానమువలన ప్రమాదము చెప్పుచున్నాడు. నవరన్ధ్రములతో కూడిన దేహము చిల్లుకుండ నీటిని జాఱవిడుచునట్లుగా జ్ఞానమును జాఱవిడుచుచుండును. విషయప్రవణ చిత్తమునకు బ్రహ్మము శుద్ధమైనదిగా కనబడదు. ఇట్టి స్థితిలో ఈశ్వరత్వకర్తృబింబత్వాది ఘటనలు అగ్రాహ్యములు. విషయాభిమానపూర్ణులైన జీవులు బ్రహ్మమును తెలియజాలరు అనగా ఆనన్దానుభవమును పొందుటలేదు.

**అత్యన్త మలినో దేహో దేహీచాత్య నిర్మలః।**
**ఉభయోరన్తరం జ్ఞాత్వా కస్యశౌచం విధీయతే॥** ౫౭

**టీ॥ దేహః** = దేమము, **అత్యన్త మలినః** = మిక్కిలి మలినమైనది, **దేహి** = దేహాన్తర్వర్తియగు పురుషుడు, **అత్యన్తనిర్మలః** = అత్యన్త నిర్మలుడు, **ఉభయోః** = దేహాత్మలయొక్క, **అన్తరమ్** = కల్పితత్వ సత్యత్వములను, **జ్ఞాత్వా** = తెలిసి, **కస్య** = దేనికి, **శౌచమ్** = శౌచము, **విధీయతే** = విధింపబడుచున్నది.

**దీపికా:** దేహము మిక్కిలి మలినముతో కూడినది. పాఞ్చభౌతిక జడ

పదార్థము. **"శ్రు. శరీరమిదం మైథునాదేవ ఉద్భూతం సంవిద్వ్యపేతం నిరయ ఏవ మూత్రద్వారేణ నిష్క్రాన్తం."** ఈ శరీరము మైథునమువలన కలిగినది. జ్ఞానహీనమైనది. నరకసదృశమైనది. యోనినుండి వెలువడినది. చర్మము, మాంసము, మజ్జ, క్రొవ్వు, ఎముకలు మొదలైన వాని సముదాయ ములను మలమూత్రములను కలదగుటచే దేహము మలినముగా తలంప బడినది. **"శ్రు. జాతం మృతమిదం దేహం మాతాపితృ మలాత్మకం। సుఖదుఃఖాలయా మేధ్యం స్పృష్ట్వా స్నానం విధీయతే॥" "ధాతుబద్ధం మహారోగం పాపమన్దిర మధ్రువమ్"** పుట్టునదియు, చచ్చునదై, మాతా పితృ మలస్వరూపమైనది, సుఖదుఃఖములకు నిలయమైనది, అపవిత్ర మైనది, పాపములకు నిలయమైన ఇట్టి దానిని తాకినచే స్నానము చేయవలసినదియని శ్రుతి వచనము. దేహాన్తర్వర్తియగు పురుషుడు అత్యన్త నిర్మలుడు. ఇట్టి మలమయమైన దేహము దేనిచేత పవిత్రతను పొందగలదు. మనోహర గుణసముద్రుడై నిర్మలుడైన పురుషునకు శౌచాదికర్మలతో పనిలేదు, అనగా దేహాత్మలయొక్క కల్పిత సత్యత్వము లను గ్రహించిన... **జడస్య జడేన న శుద్ధిః** పాఞ్చభౌతికమైన జడమైన శరీరమునకు, జడమే అయిన జలాదులచే శుద్ధత ఎట్లు? ఈ శౌచము ఆత్మకేయందువా! నిత్యనిర్మలమైన దానికి శౌచాదులతో ప్రయోజనము లేదు. మరి ఈ శౌచము(యమ నియమాదులు) దేనికి అంటే...విషయ ప్రవణమైన మనస్సును, దేహాభిమానమును ఏవిధముగానైనా దూరము చేయతలచి చెప్పినది.

**"శ్రు. స్త్రీణామవాచ్య దేశస్య క్లిన్న నాడీవ్రణస్యచ అభేదోపి", "చర్మఖణ్డం ద్విధాభిన్న మపానోద్గార దూషితం। యే రమన్తి నమస్తేభ్యః సాహసం కిమతః పరమ్॥"**

అని నారదపరివ్రాజకోపనిషత్తు ఇదే మార్గమును అనుసరించింది.




ఈ ఉపనిషద్వాక్య నిత్యమనన శీలుడు కులకాన్తనుకూడ దరిచేరనీయడు. ఇంతటి తీవ్రముగా చెప్పుటయందలి ఆంతరము మనకు శరీరాభిమాన మును ఏవిధముగానైనా దూరముగావించి ఆత్మోన్ముఖులను గావించుటయే.

**ఇతి శ్రీమన్మహాభారతే అశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీభగవదర్జున సంవాదే ప్రథమోధ్యాయః**



శ్రీరామలాల సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీభగవదుత్తరగీతా

## ద్వితీయోధ్యాయః

**ఆరూఢస్య ముముక్షుశ్చ స్వరూపం పరికీర్త్యతే।**
**తత్రారూఢస్య బిన్దైక్యం కథంస్యాదితి పృచ్ఛతి॥ ౧**

**టీ॥ ఆరూఢస్య** = అరూఢునియొక్కయు, **ముముక్షుశ్చ** = మోక్షేచ్ఛ గలవానియొక్కయు, **స్వరూపమ్** = స్వరూపము, **పరికీర్త్యతే** = చెప్పబడు చున్నదిగదా, **తత్ర** = వారిలో, **ఆరూఢస్య** = ఆరూఢునకు, **బిన్దైక్యమ్** = బిన్దువుతో ఏకత్వము, **కథంస్యాదితి** = ఎట్లగునని, **పృచ్ఛతి** = అడుగుచున్నాడు.

**దీపికా:** ఆరూఢునియొక్కయు, మోక్షేచ్ఛగల వానియొక్కయు లక్షణము చెప్పబడుచున్నదిగదా; వారిలో ఆరూఢునకు బిన్దువుతో ఐక్యమెట్లు సిద్ధించుచున్నదని అడుగుచున్నాడు. (శ్రీవాణీవిలాస ముద్రణాలయము, శ్రీరంగంవారు ౧౯౨౬లో ముద్రించిన శ్రీ గౌడపాదయతీన్ద్రుల ఉత్తరగీత వ్యాఖ్యయందు ఈ శ్లోకమును ముద్రించిరి, దీనికి శ్రీగౌడపాదుల వారి వ్యాఖ్య మాత్రము లేదు.)

**॥అర్జున ఉవాచ॥**

**జ్ఞాత్వా సర్వగతం బ్రహ్మ సర్వజ్ఞం పరమేశ్వరమ్।**
**అహం బ్రహ్మేతి నిర్దేష్టుం ప్రమాణం తత్ర కిం భవేత్॥ ౨**

**టీ॥ బ్రహ్మ** = పరమాత్మను, **సర్వగతమ్** = సర్వమును పొందినవానిగా **సర్వజ్ఞమ్** = సర్వము తెలిసినవానిగా, **పరమేశ్వరమ్** = హరిహరహిరణ్య గర్భేన్ద్రాదులకు పరమైనవానిగా, **జ్ఞాత్వా** = తెలుసుకొని, **అహమ్** = నేను, **బ్రహ్మేతి** = బ్రహ్మమునని, **నిర్దేష్టుమ్** = నిర్దేశించుటకు, **తత్ర** = ఆ





విషయమునందు, **ప్రమాణమ్** = ప్రమాణము, **కిం భవేత్** = ఏది అగును?

**దీపికా:** పరమాత్మను సర్వాంతర్యామియని, సర్వజ్ఞుడని, హరిహర హిరణ్యగర్భేన్ద్రాదులకు పరమైనవాడనియు, సర్వసాక్షియనియు, సర్వ నియామకుడనియు తత్త్వమసీత్యాది శాస్త్రవాక్యజ్ఞానముచే తెలిసికొని యున్నాను. ఈ సామాన్య జ్ఞానమాత్రముచే పరోక్షజ్ఞానముచే ఇప్పుడు నేను బ్రహ్మమును అయినట్లా? కానట్లా? అయితే నేను బ్రహ్మంబని నిర్దేశించుటకు ఆవిషయమున ఏదైన ప్రమాణము కలదా? అని ప్రశ్నించెను.

**॥భగవానువాచ॥**

**యథాజలఞ్జలే క్షిప్తం క్షీరేక్షీరఙ్ఘృతే ఘృతమ్।**
**అవిశేషో భవేత్తద్వ జ్జీవాత్మ పరమాత్మనోః॥ ౩**

**టీ॥ జలే** = నీటియందు, **క్షిప్తమ్** = ఉంచబడిన, **జలంయథా** = నీటివలెను, **క్షీరే** = పాలయందు, **యథా క్షీరమ్** = పాలవలెను, **ఘృతే** = ఘృతమునందు, **ఘృతమ్** = నేతివలె, **తద్వత్** = అట్లే, **జీవాత్మ పరమాత్మనోః** = బ్రహ్మప్రతిబింబ జీవునకు, బింబమునకు, **అవిశేషః** = సమానము, **భవేత్** = అగును.

**దీపికా:** ఆరూఢారురుక్షులకు లక్ష్యము నెతింగితిని. అందు ఆరూఢునకు బింబైక్యము ఎట్లని ప్రశ్నించిన అర్జునునకు, ఉపాధిశూన్యత్వమున అట్టి వానికి ఐక్యము కలుగునని ఉపదేశించుచున్నాడు. జలమందు జలము, పాలయందు పాలు, ఘృతమందు ఘృతము కలిసిన ఎట్లు భేదరహితముగా నున్నవో; అనగా నద్యాదులయందలి జలము పాత్రాదులచే ఉద్ధరింప బడి, ఆ పాత్రాదులయొక్క ఉపాధులను గ్రహించి, ఉపాధులు నివృత్తి

యైన పిదప పునః ఆ మహాజలమునందు ఏవిధముగా ఐక్యమును పొందు చున్నవో; అట్లే అవిద్యోపాధియుక్తుండగు జీవునకు పరమాత్మకు భేదము కనిపించినను, సంస్కార విషేషముచే **"శ్రు. అహమేవ మహానాత్మ హ్యహమేవ పరాత్పరః। అహమన్యవదాభామి హ్యహమేవ శరీరవత్॥"** నేను మహత్తర ఆత్మస్వరూపుడను, పరాత్పరుడను, నేను మరియొక దానివలె కనబడుచున్నాను, నేను శరీరమువలె కనబడుచున్నను నిజమునకు శరీరమును కాను. అఖణ్డాత్మను అను శాస్త్రవిచార జన్యమగు స్థిరబుద్ధిచే ఆ జీవునకు అవిద్యానివర్తకమైన, పరమాత్మతో ఐక్యము కలుగుచున్నది.

**జీవేపరేణ తాదాత్మ్యం సర్వగం జ్యోతిరీశ్వరమ్।**
**ప్రమాణలక్షణైః జ్ఞేయం సర్వమేకాగ్రవేదినా॥** ౪

**టీ॥ స్వయమ్** = అధికారియైన తాను, **ఏకాగ్రవేదినా** = బ్రహ్మనిష్ఠుడగు గురువుచే, **ప్రమాణలక్షణైః** = ప్రమాణ స్వరూపములచే, **జీవే** = జీవునియందు, **పరేణ** = పరమాత్మతో, **తాదాత్మ్యమ్** = ఐక్యమును, (బోధితేసతి = బోధింపబడగా), **సర్వగమ్** = సర్వవ్యాపియగు, **ఈశ్వరమ్** = బ్రహ్మమును, **జ్యోతిః** = జ్యోతిస్వరూపునిగా, **స్వయం జ్ఞేయమ్** = తాను తెలియదగినది.

**దీపికా:** కేవల శాస్త్రసంబంధమున సామాన్య జ్ఞానమును మాత్ర మెఱింగిన జన్మాంతరమున తప్పక ముక్తిగాంచును. ఇది పరబ్రహ్మను గూర్చిన పరోక్షజ్ఞానము. అపరోక్షజ్ఞాన సిద్ధికొఱకు గురువును ఆశ్రయించియే ముక్తుడుకావలెనని చెప్పుచున్నాడు. ఏకాగ్రచిత్తుడై బ్రహ్మనిష్ఠుడగు గురువువలన ప్రమాణలక్షణాదులచే **"అయమాత్మ బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, ఏకమే వాద్వితీయం బ్రహ్మ, తత్త్వమసి"** ఇత్యాది మహావాక్యోపదేశములచే జీవునియందు పరమాత్మతో తాదాత్మ్యము బోధింపబడగా, తాను సర్వవ్యాపియగు ఈశ్వరుని పరంజ్యోతిరూపునిగా తెలుసుకొను





చున్నాడు. ఆత్మపరమాత్మల ఐక్యత గురుముఖతః యెఱుంగవలెనని కేవల శాస్త్రవిచారాదులచే అవిద్యనివర్తియై అపరోక్షజ్ఞానము కలుగదని ఉపదేశించుచున్నాడు.

॥అర్జున ఉవాచ॥

**జ్ఞానాదేవ భవేద్జ్ఞేయం విదిత్వా తత్ క్షణేనతు।**
**జ్ఞానమాత్రేణ ముచ్యేత కిం పునర్యోగధారణాత్॥** ౫

**టీ॥ జ్ఞానాదేవ** = జ్ఞానమువలననే, **జ్ఞేయమ్** = తెలుసుకొనదగిన బ్రహ్మైక్యమును, **విదిత్వా** = తెలుసుకొని, **జ్ఞానమాత్రేణ** = కేవల జ్ఞానముచే, **తత్ క్షణేనతు** = ఆ క్షణముననే, **ముచ్యేత** = విడువబడెనేని, **యోగధారణాత్** = యోగధారణము వలన, **పునః కిం భవేత్** = తిరిగి ఏమి అగును.

**దీపికా:** గురూపదేశజన్యమైన జ్ఞానమాత్రముచే బ్రహ్మైక్యము లభించుచుండ యోగముయొక్క ఆవశ్యకతను ప్రశ్నించుచున్నాడు. జ్ఞానము చేతనే తెలుసుకొనదగిన వస్తువును అనగా బ్రహ్మమును తెలుసుకొని ఆక్షణముననే ఆ జ్ఞానముచే ముక్తుడగుచుండగా, యోగధారణముచే ప్రయోజనమేమి.

॥భగవానువాచ॥

**జ్ఞానేన దీపితే దేహే బుద్ధిర్బ్రహ్మసమన్వితా।**
**బ్రహ్మజ్ఞానాగ్నినావిద్వా న్నిర్దహేత్కర్మబన్ధయమ్॥** ౬

**టీ॥ విద్వాన్** = వివేకి, **జ్ఞానేన** = ఆత్మజ్ఞానముచే, **దేహే** = లిఙ్గశరీరము, **దీపితే** = ప్రకాశించుచుండగా, **బుద్ధిః** = నిశ్చయాత్మకమైన బుద్ధి, **బ్రహ్మసమన్వితా** = బ్రహ్మముతోకూడినదగుచుండగా, **బ్రహ్మజ్ఞానాగ్నినా** = బ్రహ్మజ్ఞానమను అగ్నిచే, **కర్మబన్ధనమ్** = కర్మపాశమును, **నిర్దహేత్** = దహించును.

**దీపికా:** యోగము ప్రయోజనశూన్యమని అర్జునుడు భావించుటచే

ఎంతవఱకు అపరోక్షానుభవము కలుగదో అంతవరకు అన్తఃకరణవృత్తి నాశనమగుట లేదు. కావున తత్సాధనముగా యోగమును ఆశ్రయింప వలెనని, అపరోక్షానుభవము తదుపరి శాస్త్రసహాయము అక్కరలేదని చెప్పుచున్నాడు. వేదాన్తవిజ్ఞానముచే విద్వాంసుని దేహము ప్రకాశించు చుండగా నిశ్చయాత్మకమైన బుద్ధి బ్రహ్మముతో కూడినదగుచున్నది. అనగా బ్రహ్మైక్యం అగుచున్నది. ఇట్టి విద్వాంసుడు బ్రహ్మజ్ఞానంబను అగ్నిచే కర్మబన్ధములను దహించి అనగా బ్రహ్మజ్ఞానమను అగ్నియందు కర్తృత్వ సఙ్కల్పమను బీజము దగ్ధమై దేహము కర్తృత్వభావరహితమైన అకర్మక స్థితియందుండును. అనగా కర్మలవలన కలుగు లోకములయొక్క తారతమ్యమును తెలుసుకొని త్యాగముచే శుద్ధాన్తఃకరణుడై జ్ఞానాగ్నిచే కర్మలను దహించి పునరావృత్తిరూప జననమరణములను పొందక కర్మ బన్ధములనుండి ముక్తుడగుచున్నాడు. కర్మయనగా కర్తృత్వపూర్వక సఙ్కల్పస్థితియేకాని కార్యముగాదు. ఈ కర్మయే జీవులను బంధించు చున్నది. కర్మబన్ధములనుండి ముక్తుడగుటయనగా కర్తృత్వసఙ్కల్ప రహితమైన స్థితి. ఇట్టి స్థితిలో జీవుడు కార్యకర్తవలె కనబడుచున్నను, కర్మ కర్త, ఫలభోక్త కాకయుండును. ఇట్టివాడు కర్మబన్ధములనుండి ముక్తుడగుచున్నాడు. **"శ్రు. విద్వాన్ సర్వేషాం భూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్య మాధిపత్యం పశ్యేతి"** విద్వాంసుడైనవాడు అనగా వేదాన్త విజ్ఞానముచే ఆత్మను నిశ్చయముగా ఎఱింగినవాడు సమస్తపదార్థము లకన్నను శ్రేష్ఠమైనట్టి స్వారాజ్యమును, ఆత్మసామ్రాజ్యాధిపత్యమును పొందుచున్నాడని శ్రుతియే ప్రమాణీకరించినది.

**తతః పవిత్రం పరమేశ్వరాఖ్య**
**మద్వైతరూపం విమలామ్బరాభమ్।**





**యథోదకే తోయమనుప్రవిష్టం**
**తథాత్మరూపో నిరుపాధి సంస్థః॥ ८**

**టీ॥ తతః** = తత్త్వజ్ఞానానన్తరము, **ఉదకే** = నీటియందు, **అనుప్రవిష్టమ్** = ప్రవేశింపబడిన, **తోయంయథా** = నీరు ఏరీతియో, **తథా** = ఆరీతిగా, **పవిత్రమ్** = శుద్ధమైన, **పరమేశ్వరాఖ్యమ్** = పరమేశ్వరుడను పేరు కలదియు, **అద్వైతరూపమ్** = స్వజాతీయ,విజాతీయ,స్వగత భేదరహిత మైన బ్రహ్మమును, **విమలామ్బరాభమ్** = నిర్మలాకాశమువలె అసంగము నునగు, **ఆత్మరూపో** = ఆత్మస్వరూపము, **నిరుపాధిసంస్థః** = ఉపాధి రహితమై యున్నది.

**దీపిక:** ఆత్మజ్ఞానానన్తరము మహాజలమందు ప్రవేశింపబడిన నీరువలె, దేవతిర్యక్ స్థావర జఙ్గమాది స్వరూపములు పరమాత్మయందు ఒక్కటియై, నిర్మలమైన ఆకశమువలె అసంగముగనున్న అద్వయబ్రహ్మమును తెలుసుకొని జీవుడు ఉపాధిశూన్యుడైన పరమాత్మనుపొంది నిరుపాధికు డగుచున్నాడు. అనగా ఔపాధిక కర్తృత్వాది భేదరహితుడై నిష్క్రియుడగు చున్నాడు. ఆత్మయందు కల్పింపబడిన యీజగజ్జాలము ఆత్మకంటే నతిరిక్తముకాదని గ్రహించినవాడై పరమాత్మయే అగుచున్నాడు. కఠోపనిషత్తుకూడా **"యథోదకం శుద్ధే శుద్ధమాస్తికం తాదృగేన భవతి! ఏవం మునేర్విజానేత ఆత్మాభవతి గౌతమ"** శుద్ధోదకము నిర్మలమైన జలమునందుపడి దానితో ఐక్యమగునట్లు జ్ఞానియొక్క ఆత్మకూడా బ్రహ్మమే అగుచున్నదని పలుకుచున్నది.

**ఆకాశవత్సూక్ష్మశరీర ఆత్మా**
**నదృశ్యతే వాయుతదన్తరాత్మా।**

**సబాహ్యమభ్యన్తర నిశ్చలాత్మా**
**జ్ఞానోల్కయా పశ్యతి చాన్తరాత్మా॥ ౮**

**టీ॥ ఆత్మా** = పరమాత్మ, **ఆకాశవత్** = ఆకాశమువలే, **శూక్ష్మశరీరః** = సూక్ష్మమైన శరీరముగలవాడు, **అన్తరాత్మా** = అన్తర్యామియగు బ్రహ్మము, **వాయువత్** = వాయువువలె, **నదృశ్యతే** = చూడబడుటలేదు. **(యః) బాహోభ్యన్తరమ్** = బాహ్యాహ్యాన్తరముల, **నిశ్చలాత్మా** = శుద్ధాన్తఃకరణుడో, **సః** = వాడు, **జ్ఞానోల్కయా** = వేదాన్తజన్యతత్త్వాపరోక్ష వృత్తిరూపజ్ఞాన దీపముచే, **అన్తరాత్మా** = ఆంతరమున చిత్తమునుంచుకొన్నవాడై, **పశ్యతి** = చూచుచున్నాడు.

**దీపికా:** ఇచ్చట భగవానుడు శాస్త్రప్రకారముగా చేసిన కర్మానుష్ఠానము తత్త్వజ్ఞాన సాధకమనిచెప్పుచూ, యోగహీనునకు జీవబ్రహ్మైక్యము దుర్లభమని ఉపదేశించుచున్నాడు. ఆత్మ ఆకాశమువలె సూక్ష్మమైనదగుటచే స్థూలస్వరూప దర్శనసామర్థ్యముగల నేత్రేన్ద్రియముచే గ్రహింపబడుటలేదు. **"నసన్దృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్"** దృశ్యవస్తువులలో ఆత్మయొక్కరూపములేదు. స్థూల ప్రపంచమునందు సూక్ష్మభూతమైన ఆకాశముకన్న సూక్ష్మమైన వాడు కావున నేత్రములతో అద్దానిని ఎవడు చూడలేడని శ్రుతికూడ ప్రమాణీకరించుచున్నది. ఇదీ వాయువువలె దృగ్గోచరము కాదు. ఆత్మ బాహ్యాభ్యన్తరములందు నిశ్చలమైనది. కావున తైజసుడుకాదు, విశ్వుడుకాదు. వ్యవహరించుటకు వీలులేనిది. ఇన్ద్రియాతీతమైనది. కేవలము జ్ఞానాగ్నిద్వారా వేదాన్తజన్యంబగు అపరోక్ష జ్ఞానముచే విజ్ఞుడు అన్తరాత్మను దర్శించుచున్నాడు.





**యత్రయత్ర మృతో జ్ఞానీ యేనకేనాపి మృత్యునా।**
**యథా సర్వగతం వ్యోమ తత్రతత్ర లయం గతః॥ ౯**

**టీ॥ సర్వగతమ్** = అంతటావ్యాపించియున్న, **వ్యోమయథా** = ఆకాశమువలె, **యత్రయత్ర** = ఎచ్చటెచ్చట, **జ్ఞానీ** = సర్వత్ర పరిపూర్ణ బ్రహ్మాభిన్నుడైన జ్ఞాని, **యేనకేనాపి మృత్యునా** = ఏవిధంబైన మృత్యువుచేనైన, **మృతః** = మృతుడైననూ, **తత్రతత్ర** = అక్కడక్కడ, **లయమ్** = బ్రహ్మైక్యమును, **గతః** = పొందును.

**దీపికా:** సర్వవస్త్వచ్ఛిన్న ఆకాశమువలె సర్వత్రపరిపూర్ణ బ్రహ్మాభిన్నుడైన జ్ఞాని ఎచ్చటెచ్చట ఏవిధముగా మృతిచెందినప్పటికి, అనగా అగ్ని ప్రపఞ్చమున ప్రవేశించి తాను దహించు వివిధ పదార్థస్వరూపములకు అనుగుణముగా రూపములను ధరించునట్లు, తాను ప్రవేశించు భిన్న వస్తువులకు అనుగుణముగా సమస్త ప్రాణులలోగల ఆత్మ విభిన్నములైన ఆకారములలో భాసించుచున్నది. ఈ ఆకారవికారాదులకు వేరుగా వికార రహితుడైన ఆత్మకలదను జ్ఞానముకల విజ్ఞుడు ఎచ్చటెచ్చట ఏవిధముగా మరణించినను ఆకారవికారాదులయందు దృష్టిలేనివాడగుటచే బ్రహ్మైక్యమును పొందును.

దానంజేసి తత్త్వజ్ఞానులకు దేశకాలాద్యపేక్ష మరణమునందు అక్కరలేదని, కాలమృత్యువైనను, భృగ్వగ్న్యాద్యపమృత్యువైనను తన్నిమిత్తక ప్రాయశ్చిత్త ముకూడ లేదని సిద్ధించుచున్నది. ఈ ప్రాయశ్చిత్తాదికము ఆరురుక్షుని విషయమే కాని ఆరూఢుని విషయమునకాదు.

**శరీరవ్యాపితం వ్యోమ భువనాని చతుర్దశ।**
**నిశ్చలో నిర్మలో దేహీ సర్వవ్యాపీ నిరఞ్జనః॥ ౧౦**

**టీ॥ యథా** = ఏవిధముగా, **వ్యోమమ్** = ఆకాశము, **శరీరవ్యాపితమ్** = శరీరమునందంతటను వ్యాపించినదియు, **భువనాని చతుర్దశ** =

చతుర్దశభువనాలను (వ్యాపించినది అగుచున్నదో), (**తథా** = అట్లే), **దేహీ** = జీవుడు, **నిశ్చలః** = క్రియారహితుడును, **నిర్మలః** = పరిశుద్ధుడును, **సర్వవ్యాపీ** = శరీరాది సర్వద్రవ్యములందు వ్యాపించియుండువాడు, **నిరఞ్జనః** = స్వయముగ ప్రకాశించువాడు (అగుచున్నాడు).

దీపికా: చతుర్దశ భువనములందు ఆకాశము ఎట్లు వ్యాపించియున్నదో, అట్లే జీవుడును నిశ్చలుడై, నిర్మలుడై, పరిశుద్ధుడై, స్వయముగా ప్రకాశించువాడైయున్నాడు. సర్వవ్యాపి, అనగా శరీరాదిగా చతుర్దశ భువనపర్యన్తమైన సర్వద్రవ్యములు అవిద్యాపరిణామమే కనుక, ఇట్టి జగదుపాదానావిద్యయందు ప్రతిఫలించినది విద్యాభాసక జీవుడే; కనుక అట్టి జీవుడు జగద్వ్యాపి.

**ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ।**
**సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్॥** ౧౧

**టీ॥ యః** = ఎవడు, **నాసాగ్రే** = నాసాగ్రమునందు, **మనసా సహ** = మనస్సుతో సహ, **ముహూర్తమపి** = ముహూర్తకాలమైననూ, **గచ్ఛేత్** = పొందునో, **తస్య** = వానియొక్క **జన్మశతార్జితమ్** = శతజన్మార్జితమైన, **పాప్మానమ్** = సమస్త పాపమును, **తరతి** = దాటుచున్నాడు.

**దీపికా:** అపరోక్షజ్ఞాన సాధకము, సర్వభావనివర్తకమగు యోగమును చెప్పుచున్నాడు. ఎవడు జ్ఞానసాధనకు యోగమున ముహూర్తకాలమైనను భ్రూమధ్యమున మనస్సుతోకూడ దృష్టిని నిలుపునో, వాడు శతజన్మార్జిత పాపము నశించినవాడుగా అగుచున్నాడు. ఈ యోగము అభ్యాస వశమున సిద్ధించునదేకాని, శాస్త్ర పాఠమాత్రముచే సిద్ధికలుగుట లేదు. మనస్సుతోకూడ దృష్టిని భ్రూమధ్యమునందు నిలుపుట యనగా ప్రాణజయ పురస్సరముగా దృష్టిని భ్రూమధ్యమందు నిలుపుట. **నానావిధై**





**ర్విచారైస్తు నసాధ్యం జాయతే మనః। తస్మాత్తస్య జయః ప్రాణః ప్రాణస్య జయ ఏవహి॥ నానామార్గైః సుఖదుఃఖప్రాయం కైవల్యం పరమంపదం। సిద్ధమార్గేణ లభ్యేత నాఽన్యథా శివభాషితం** నానావిధ విచార సాధనములచే మనస్సు సాధింపబడుటలేదు. కావున మనోజయమనగా విశేషముగా ప్రాణజయమే. ప్రాణము చలించిన మనస్సు చలించుచున్నది. మనస్సు చలించిన ప్రాణము చలించుచున్నది. **"సుషుమ్నావాహిని ప్రాణే శూన్యేవిశతి మానసే। తదా సర్వాణి కర్మాణి నిర్మూలయతి యోగవిత్"** ప్రాణవాయువు సుషుమ్నయందు ప్రవేశించినప్పుడు అన్తఃకరణము శూన్యమునందు ప్రవేశించుచున్నది. అప్పుడు చిత్తనిరోధముగల యోగి ప్రారబ్ధముతోసహ సకలకర్మలను నిర్మూలనము చేయుచున్నాడు. కావున శతజన్మార్జిత పాపము నశించినవాడగుచున్నాడు. ఇట్టి వారు ప్రారబ్ధకర్మ నివృత్తిగల యముని జయించినవారుగానున్నారు.

**దక్షిణే పిఙ్గలానాడీ వహ్నిమణ్డలగోచరా।**
**దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ॥** ౧౨

**టీ॥ దక్షిణే** = దేహముయొక్క దక్షిణభాగమునందు, **వహ్నిమణ్డలగోచరా** = వహ్నిమణ్డలమువలె గోచరించునదియు, **పుణ్యకర్మానుసారిణీ** = పుణ్యకర్మలను అనుసరించునదియు, **పిఙ్గలానాడీ** = పిఙ్గలయను నాడి, **దేవయానమ్** = దేవయానమని, **జ్ఞేయమ్** = తెలియదగినది.

**దీపికా:** ఉపాసనామార్గమైన పిఙ్గలానాడీ స్వరూపమును చెప్పుచున్నాడు. మధ్యస్థమగు సుషుమ్నానాడియొక్క దక్షిణభాగమునందు పిఙ్గలనాడి యున్నది. **"ఇడాపిఙ్గల సౌషుమ్నాః ప్రాణమార్గేచ సంస్థితాః।సతతం ప్రాణవాహిన్యః సోమసూర్యాగ్ని దేవతాః॥"** ఈ నాడియందు సూర్యుడు సంచరించును. పిఙ్గలానాడిని ఆశ్రయించి పాణవాయువు ౨౬

అంగుళముల పర్యన్తము ప్రసరించుచున్నది. దివారాత్రుల నిరోధములేక సంచరించునట్టి సూర్యచన్ద్రులను అనగా ఇడా పిఙ్గల నాడుల గతులను ఎఱుంగవలెను. పిఙ్గలానాడీ మార్గమునకు దేవయానమని ప్రసిద్ధి. "పిఙ్గలాయా విరిఞ్చిస్యాత్" అని శ్రుతి పిఙ్గలానాడికి బ్రహ్మ అధిదేవత యని పలుకుచున్నది. **"పిఙ్గలాయా ఇడాయాస్తు వాయోస్సఙ్క్రమణన్తు యత్త దుత్తరాయణం ప్రోక్తం మునే వేదాన్తవేదిభిః"** వాయువు పిఙ్గలానాడీ సంచారము ఉత్తరాయణ పుణ్యకాలముగా వ్యవహరింపబడుచున్నది. దీని ఫలము పునరావృత్తి రహిత హిరణ్యగర్భలోక ప్రాప్తి. **'అత్ర బ్రహ్మ సమశ్నుతే'** యను శ్రుతి వాక్యము, **"బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరంపదమ్॥"** ఇత్యాది వాక్యములు ఈ విషయమునే చెప్పుచున్నవి. ఇది ఉపాసనామార్గము. పుణ్యకర్మలచే పొందబడునట్టిది. దక్ష నాసాపుటము వలన పిఙ్గలానాడీ మార్గమున ప్రాణోత్సర్గము జరిగిన మొదట జ్వాలను, జ్వాల వలన దివసమును, దానిచే శుక్లపక్షమును, ఈ శుక్లపక్షమువలన ఉత్తరాయణ మును, అందుచే సంవత్సరమును, దానిచే వాయువును, వాయువువలన సూర్యుని, సూర్యునివలన సుధాంశువును, సుధాంశువువలన ఇన్ద్రుని, అటుపై హరిహర బ్రహ్మేన్ద్రాది దేవతాలోక ప్రాప్తియగును. అందు సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్యములను తారతమ్యమువలన ఆయా దేవలోకములందు సుఖముగానుండి వైరాగ్యము, సమ్యగ్ జ్ఞానాదుల నిజమోక్షమును పొందును. ఇది దేవయానమని, అర్చిరాది మార్గమని యెఱుంగవలెను.





**ఇడా చ వామనిశ్వాస సోమమణ్డలగోచరా।**
**పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్య తిష్ఠతి॥** ౧౩

**టీ॥ వామనిశ్వాసః** = వామభాగమందు శ్వాసకలది, **చన్ద్రమణ్డలగోచరా** = చన్ద్రమణ్డల గోచరమైనదియు, **ఇడా చ** = ఇడాయను నాడి, **పితృయాన మితి** = పితృయానమని, **జ్ఞేయమ్** = తెలియదగినది, **వామమాశ్రిత్య** = వామమార్గమును ఆశ్రయించి, **తిష్ఠతి** = ఉన్నది.

**దీపికా:** ధూమాదిమార్గ సాధనమైన ఇడానాడీ స్వరూపమును ఉపదేశించుచున్నాడు. వామనిశ్వాస వామనాసాపుటమువలన ఇడాయను నాడీమార్గమున నిశ్వాసరూపముగా చన్ద్రమణ్డలము (మూలాధారాదిగా నాసికాగ్రపర్యన్తము)ను పొందును. ఇది దక్షిణాయన మార్గము. వామనాసాపుటంబగు ఇడాయను నాడీమర్గమున ప్రాణ త్యాగంబైన మొదట ధూమమార్గముచొచ్చి, అటనుండి రాత్రియు, దాని వలన కృష్ణపక్షమును, దానిచే దక్షిణాయనము, అటనుండి పితృలోకము, దానిచే ఆకాశము, ఆకాశమువలన చన్ద్రుడు, చన్ద్రునినుండి స్వర్గలోక ప్రాప్తికలుగును. మరియు ఆ స్వర్గమున స్వర్గసుఖములు అనుభవించి, ఫలక్షయంబైన గగనమును, ఆ గగనమువలన వాయువును, దానిచే ధూమమును, దానివలన మేఘమును, ఆ మేఘమువలన వృష్టి, వృష్టివలన శాల్యాద్యన్నముగా మారును. అది దంపతులు భుజించిన జఠరాగ్నిచే పచనమై మడ్డియనియు, రసమనియు ద్వివిధముగానగును. మడ్డి మల మూత్రములై గుదగుహ్య ద్వారముల అపానవాయువ్యాపారముచే బహిర్గతమగును. రసము కాలకర్మవశమున శుక్ల సంబంధముచే గర్భాశయంబను కోశమును ప్రవేశించును. పుణ్యవిశేషమువలన జన్మములను పొందును. ఇది పితృయానము. పునరావృత్తికి అనుకూల

మైన ధూమమార్గమని తెలియవలెను. వాపీకూప తటాకాది పుణ్యకర్మల యందు తత్పరులగు వారలకు, జ్యోతిష్టోమాశ్వమేధాది కర్మనిష్ఠులకు ఈ మార్గము సిద్ధించుచున్నది.

**గుదస్య పృష్ఠభాగేఽస్మిన్ వీణాదణ్డస్య దేహభృత్।**
**దీర్ఘాస్థిమూర్ధ్ని పర్యన్తం బ్రహ్మదణ్డీతి కథ్యతే॥** ౧౪

**టీ॥ గుదస్య పృష్ఠభాగే** = గుదమునకు పృష్ఠ భాగమునందు, **మూర్ధ్ని పర్యన్తమ్** = శిరస్సువరకు, **వీణాదణ్డస్య** = వీణాదణ్డముయొక్క, **దేహభృత్** = ఆకారముధరించిన, **దీర్ఘాస్థి** = వెన్నెముక, **బ్రహ్మదణ్డీతి** = బ్రహ్మదణ్డ మని, **కథ్యతే** = చెప్పబడుచున్నది.

**దీపికా:** ఇటుపై సుషుమ్నానాడినిగూర్చి చెప్పదలచి దానికి అఙ్గభూత మగు బ్రహ్మదణ్డి స్వరూపమును చెప్పుచున్నాడు. మానవ స్థూలదేహమున గుదమునకు పృష్ఠభాగమున అనగా గుదస్థానమునకు కొంచము పైన, లిఙ్గస్థానమునకు కొంచము క్రిందగా శరీరమధ్యమున మూలాధార చక్రము మొదలుకొని, సహస్రారమువరకు తన్త్ర్యాధార భూతమైన వీణాదణ్డమువలె; సర్వనాడులకు ఆధారభూతమైన బ్రహ్మదణ్డియను ఎముక కలదు. దీనికి మేరుదణ్డమని సంజ్ఞ కలదు.

**తస్యాన్తే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః।**
**ఇడాపిఙ్గలయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ**
**సర్వం ప్రతిష్ఠితం తస్మిన్ సర్వగం సర్వతోముఖమ్॥** ౧౫

**టీ॥ తస్యాన్తే** = ఆబ్రహ్మదణ్డముయొక్క చివర, **సూక్ష్మమ్** = సూక్ష్మమైన, **సుషిరమ్** = రన్ధ్రము, **సూరిభిః** = పణ్డితులచే, **బ్రహ్మనాడీతి** = బ్రహ్మనాడీ యని చెప్పబడుచున్నది. **సుషుమ్నా** = సుషుమ్నానాడి, **ఇడాపిఙ్గల యోర్మధ్యే** = ఇడాపిఙ్గలనాడులకు మధ్యయందు; **తస్మిన్** = ఆ సుషుమ్నా




నాడియందు, **సర్వమ్** = సర్వాత్మకము, **సర్వగమ్** = సర్వవ్యాపకము, **సర్వతోముఖమ్** = సర్వతోముఖంబైన పరంజ్యోతి, **ప్రతిష్ఠితమ్** = ప్రతిష్ఠింపబడినది.

**దీపికా:** సుషుమ్నానాడియొక్క స్వరూప స్వభావాదులను ఉపదేశించు చున్నాడు. బ్రహ్మదణ్డముయొక్క చివర అనగా మూలాధార చక్రముయొక్క మధ్యకోణమున సూక్ష్మమైన రన్ధ్రముకలదు. అది మూలాధార మధ్యము నుండి బ్రహ్మరన్ధ్రపర్యన్తము వ్యాపించియున్నది. ఇది పణ్డితులచే బ్రహ్మనాడి యని పిలువబడుచున్నది. మేరుదణ్డము, సావిత్రి, సరస్వతి యను నామాంతరములు కలది. ఇడాపిఙ్గలనాడులకు మధ్యన సుషుమ్నానాడి యున్నది. **"మేరోర్వామే ఇడా దక్షే పిఙ్గలా చ స్థితే ఉభే"** మేరుదణ్డముయొక్క బాహ్యదేశమందు ఇడాపిఙ్గలా నాడులు చన్ద్రసూర్య స్వరూపముగా యున్నవి. **"మేరుమధ్యే స్థితాయాతు మూలాదాబ్రహ్మరన్ధ్రగా"** ఆ మేరుదణ్డ మధ్యనాడి సుషుమ్నానాడి. దానియందు సర్వాత్మకము, సర్వవ్యాపకము, సర్వతో ముఖంబైన పరంజ్యోతి ప్రతిష్ఠింపబడియున్నది. **"తదను చ నవీనార్క బహుల ప్రకాశం జ్యోతిర్వా గగనధరణీ మధ్య మిలితం"** ఇది పరమాత్మ సన్నిధిగమన పథరూపమహామార్గమని తన్త్రములు కీర్తన చేయుచున్నవి.

**తస్యమధ్యగతా స్సూర్యసోమాగ్ని పరమేశ్వరాః।**
**భూతలోకా దిశః క్షేత్ర సముద్రాః పర్వతాశ్శిలాః॥** ౧౬
**ద్వీపాశ్చ నిమ్నగా వేదాః శాస్త్రవిద్యాకలాక్షరాః।**
**సర్వమన్త్రపురాణాని గుణాశ్చైతే చ సర్వశః॥** ౧౭
**బీజం బీజాత్మకాస్తేషాం క్షేత్రజ్ఞాః ప్రాణవాయవః।**
**సుషుమ్నాన్తర్గతం విశ్వం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్॥** ౧౮

**టీ॥ తస్య** = ఆజ్యోతియొక్క, **మధ్యగతాః** = మధ్యనున్న, **సూర్యసోమాగ్ని** = సూర్యుడు, చన్ద్రుడు, అగ్ని, **పరమేశ్వరాః** = పరమేశ్వరుడు అనువారలును, **భూతలోకాః** = పృథివ్యాది శివాన్తమైన భూతగ్రామములును, **దిశః** = దిక్కులును, **క్షేత్రాః** = వారణాశ్యాది క్షేత్రములును, **సముద్రాః** = సప్తసముద్రములును, **పర్వతాః** = కులపర్వతములును, **శిలాః** = రత్నములు,చన్ద్రకాన్తాది శిలలును, **ద్వీపాః** = సప్తద్వీపములును, **నిమ్నగాః** = మహానదులును, **శాస్త్రవిద్యాః** = వేదవేదాఙ్గములును, **కలాః** = దర్శపూర్ణాది కలలును, **అక్షరాః** = అకారాది వర్ణములును, **స్వరమన్త్ర పురాణాని** = అనుదాత్తోదాత్తాది స్వరములు, గాయత్ర్యాది మన్త్రములు, పురాణములును, **గుణాః** = గుణత్రయమును, **ఏతే** = ఈ, **సర్వశః** = సమస్తమును, **బీజమ్** = బీజమును, **బీజాత్మకాః** = బీజాత్మకులైన, **క్షేత్రజ్ఞాః** = క్షేత్రజ్ఞులును, **తేషామ్** = ఆ క్షేత్రజ్ఞులయొక్క, **ప్రాణవాయవః** = ప్రాణవాయువులును, **సుషుమ్నాన్తర్గతమ్** = సుషుమ్నానాడి మధ్యయున్నవి. **తస్మిన్** = ఆ బ్రహ్మనాడియందు, **సర్వమ్** = సమస్తమును, **ప్రతిష్ఠితమ్** = ప్రతిష్ఠింపబడినది.

**దీపికా:** సుషుమ్నామార్గగామికి బ్రహ్మప్రాప్తియగునని నిరూపించదలచి, దానికి సకల జగదాధారకత్వము వేదాత్మక వేదాధారకత్వమును కలదని నిరూపించుచున్నాడు. మూలాధారాది బ్రహ్మరన్ధ్రపర్యన్తమైన పరంజ్యోతి యొక్క మధ్యన సూర్యసోమాగ్ని పరమేశ్వరులు, శివాది క్షిత్యన్తమైన భూతగ్రామములు, దిగ్భేదములు ఉన్నవి. శివశక్త్యాత్మకమైన కాలము ఉత్పన్నమగుచున్నది. ఇది దివారాత్రుల రూపమున; ఉత్తరాయణ, దక్షిణాయనముల రూపమున, సూర్యగ్రహణ, చన్ద్రగ్రహణ రూపమున ప్రకటింపబడుచున్నది. దీనిచే సంవత్సరాత్మకమైన బ్రహ్మస్వరూపమే





పరంజ్యోతిగా భాసమానమగుచున్నది. కాశీ ప్రయాగాది దివ్యక్షేత్రములు, లవణాది సముద్రములు, మేరువు మొదలగు మహాపర్వతములు యున్నవి. మూలాధారము మొదలుకొని బ్రహ్మరన్ధ్రాన్తము ఈ క్షేత్రములు కలవని శ్రుతియే ప్రమాణీకరించుచున్నది. **"షోడశాబ్దేపరేవ్యోమ్ని లలితా సలిలా మ్బుధౌ। చిత్రాది భవతీర్థం హి భజన్తే పరివర్తనమ్॥"** శుక్లకృష్ణ పక్షములందు క్రమముగా ఆరోహణ అవరోహణ విధమున పఞ్చదశ నిత్యలు సప్తద్వీప, సప్తసముద్ర, మేరు, సుధాసిన్ధువులను నిత్యము పరివర్తన చేయుచున్నారని మూలాధారాది పరాకాశపర్యన్తము పిణ్డాణ్డాన్తర్గతముగా బ్రహ్మాణ్డము సుప్రతిష్ఠితమైనదని తన్త్రవచనము. **"బ్రహ్మాణ్డేయే గుణాః సన్తి తేహి సన్తి కలేబరే"** మూలాధార స్వాధిష్ఠానముల నడుమ లవణసముద్రము, స్వాధిష్ఠాన మణిపూరముల మధ్య ఇక్షు సముద్రము, నాభిహృదిస్థానముల నడుమ సురాసముద్రము, హృత్కణ్ఠముల మధ్య సర్పి సముద్రము, విశుద్ధ భ్రూమధ్యముల నడుమ దధిసముద్రము, భ్రూమధ్య సహస్రారముల మధ్య క్షీరసాగరము, సహస్రార చన్ద్రమణ్డలముల నడుమ జలార్ణవము, అటుపై సుధాసిన్ధువు కలవని తన్త్రవచనము **"మూలాధారే ధరాచక్రం చతుష్కోణం ప్రియంవదే। పీతవర్ణం పరివృతఞ్చాష్టశూలైః కులాచలైః"** మూలాధారమున మహేన్ద్ర, మలయ, సహ్యాది పర్వతములుగలవు. పద్మరాగ, చిన్తామణ్యాది శిలలు సప్త ద్వీపములు, గఙ్గాది పుణ్యతీర్థములు కలవు. మూలాధారము జంబూ ద్వీపము, స్వాధిష్ఠానము ప్లక్షద్వీపము, మణిపూరము కుశద్వీపము, అనాహతము క్రౌఞ్చద్వీపము, విశుద్ధము శాకద్వీపము, ఆజ్ఞ శాల్మలీ ద్వీపము, సహస్రారము పుష్కరద్వీపము అను సప్తద్వీపములు బ్రహ్మజ్యోతియొక్క మధ్యన కలవు. **"ఇడాయాం యమునాదేవీ**

**పిఙ్గలాయాం సరస్వతీ। సుషుమ్నాయాం వసేద్గఙ్గా తాసాం యోగస్త్రిథా భవేత్॥"** అన్తర్గతముగా గంగాది పుణ్యతీర్థములు కలవని తెలియు చున్నది. ప్రణవాదిగా వేదములును, వేదాఙ్గములును, చతుష్షష్టి కళలు, పఞ్చాశద్వర్ణములు, అనుదాత్తోదాత్తాది స్వరములు, సర్వమన్త్రములు, పురాణములు, ఇందుండి ఉద్భవించినవి. అం ఆం ఇం ఈం..హం క్షం వరకుగల పఞ్చాశద్వర్ణములు మూలాధారాది సహస్రారాన్తము స్థితిగలవగుటచే పిణ్డ, కర్తరి, బీజ, మాలా భేదముచే ప్రకాశించు సప్తకోటి మన్త్రములు, సమస్త వాఙ్మయము ఈ బ్రహ్మనాడియందే ప్రకాశించు చున్నవి. సుషుమ్నా చిత్రిణీ వజ్రా అని రూపభేదముచే త్రిసూత్రరూప ముగానున్న ఒక్కదానియందే సత్వరజస్తమో గుణములున్నవి. పఞ్చప్రాణ ములు, ఉపప్రాణములు సుషుమ్నా మధ్యగతమైనవిగా యున్నవి. ఈ విధముగా సమస్తమగు బ్రహ్మాణ్డము సుషుమ్నాన్తర్గత ముగా ప్రతిష్ఠితమై యున్నది. అని భగవానుడు చెప్పుటచే ఈ మహామార్గము సకల జగదాధారమనియు, వేదాధారకత్వము కలదనియు, ఈ మార్గమున పయనించు వానికి బ్రహ్మ ప్రాప్తియగునని తెలియుచున్నది.

**నానా నాడీ ప్రసవకం సర్వభూతాన్తరాత్మని।**
**ఊర్ధ్వమూలమధశ్శాఖం వాయుమార్గేణ సర్వగమ్॥**౨౦

**టీ॥ సర్వభూతాన్తరాత్మని** = సర్వభూతములయొక్క దేహమునందు, **నానా నాడీప్రసవకమ్** = అనేక నాడులకు ఉత్పత్తిస్థానమై, **ఊర్ధ్వ మూలమ్** = మూలము ఊర్ధ్వమునకలదై, **అధశ్శాఖమ్** = దిగువ శాఖలు కలదై, **వాయుమార్గేణ** = వాయుమార్గముచే, **సర్వగమ్** = అంతటను పొందినదై, **తిష్ఠతి** = ఉన్నది.

**దీపికా:** ఈ సుషుమ్నానాడి సర్వజగదుత్పత్తికి కారణము. గుదమునకు





రెండు అంగుళములు ఊర్ధ్వముగను, లింగమునకు రెండు అంగులములు దిగువను ద్విపాత్తులకు దేహమధ్యము. **"గుదాత్తు ద్వ్యఙ్గులా దూర్ధ్వం మేఢ్రాత్తు ద్వ్యఙ్గులాదధః। దేహమధ్యం తనోర్మధ్యం మనుజానా మితీరితం॥ కన్దస్థానం మనుష్యాణాం దేహమధ్యా న్నవాఙ్గులమ్। చతురఙ్గుల విస్తార మాయామం చ తథావిధమ్॥ అణ్డాకృతి వదాకార భూషితం చ త్వగాదిభిః। చతుష్పదాం తిరశ్చాంచ ద్విజానాం తున్ద మధ్యగమ్॥"** గుదమునకు రెండంగులములకు మీదను, లిఙ్గమునకు రెండంగులముల దిగువనునైన దేహమధ్యముయొక్క నడుమను శరీర మధ్యమని చెప్పబడియున్నది. కన్దస్థానము మనుష్యులకు దేహమధ్యము నుండి తొమ్మిదంగులములకు మీద నాలుగంగులముల వెడల్పును అంతే పొడవును గలిగినదై, గ్రుడ్డు వంటి రూపము కలదై, చర్మము మొదలగు వాటిచే అలంకరించబడియున్నది. చతుష్పాత్తులకు, తిర్యక్కులకు, పక్షులకు, కందము ఉండునని యాజ్ఞవల్క్య మహర్షి చెప్పిరి. **"శ్రు. తున్దమధ్యం తదిష్టం వై తన్మధ్యం నాభిరిష్యతే"** ఇది నాభియనియు చెప్పబడుచున్నది. ఈ దేహమధ్యము నానా నాడీ సహితమైయుండును. **"ఊర్ధ్వం మేఢ్రా దదో నాభైః కన్దయోనిః ఖగాణ్డవత్। తత్రనాద్యః సముత్పన్నాః సహస్రాణాం ద్విసప్తతి"** ఈ కన్దయోని ౭౨ వేల నాడులు కలిగియున్నది. ఈ నాడీకన్దమునుండి ప్రాదుర్భవించిన పిఙ్గలానాడి దక్షనాసాపుటము వఱకు వ్యాపించి యున్నది. ఇడానాడి వామనాసాపుటము వఱకు వ్యాపించియున్నది. గాన్ధారి, హస్తిజిహ్వాయనునవి వామదక్షిణ నేత్రములవఱకు వ్యాపించి యున్నవి. పూష, యశస్వినీ యనునవి వామదక్షిణ కర్ణములవఱకు వ్యాపించియున్నవి. అలమ్బుసానాడి పాయుమూలము వరకు, శుభానాడి అధోగతమై లిఙ్గస్థానమువఱకు, కౌశికినాడి పాదాఙ్గుష్ఠ పర్యన్తము

వ్యాపించియున్నవి. **"కన్దమధ్యే స్థితానాడీ సుషుమ్నా సుప్రతిష్ఠితా। పద్మసూత్ర ప్రతీకాశా ఋజురూర్ధ్వ ప్రవృత్తినీ"** అని సుషుమ్నానాడి ఊర్ధ్వప్రవృత్తి గలదిగా వర్ణింపబడెను. ఈ సుషుమ్నామూలము బ్రహ్మరన్ధ్రమున కలదు. శీర్షము కన్దమూలము. ఈ శీర్షభాగమునుండి ౭౨ వేలనాడులు శఖోపశాఖలుగా బ్రహ్మరన్ధ్ర దిశగా వ్యాపించియున్నవి. **"సమీకరణో న్నయన గ్రహణ శ్రవణోచ్ఛ్వాసా వాయుకార్య ప్రాణాది విషయాః"** దశవిధ వాయువులు సమీకరణ, ఉన్నయన, గ్రహణ, శ్రవణ, ఉచ్ఛ్వాసములను పఞ్చవిధ వాయుమార్గములచే నాడీమూలమున అంతట వ్యాపించి నాడ్యన్తర్గతముగ ప్రవర్తించుచు, నిశాకర, బ్రహ్మ, దిక్, వాయు, సూర్య, యమ అను దేవతా రూపములతో జగత్తంతటను పొందియున్నది.

**ద్విసప్తతి సహస్రాణి నాడ్యస్స్యు ర్వాయుగోచరాః।**
**కర్మమార్గేణ సుషిరా స్తిర్యఞ్చః సుషిరాత్మకాః॥ ౨౧**
**అధశ్చోర్ధ్వ గతాస్తాసు నవద్వారాణి శోధయన్।**
**వాయునాసహ జీవోర్ధ్వ జ్ఞానీ మోక్షమవాప్నుయాత్॥ ౨౨**

**టీ॥ వాయుగోచరాః** = వాయుసంచారమునకు అనుకూలమైన, **ద్విసప్తతి సహస్రాణి** = డబ్బదిరెండు వేల, **నాడ్యః** = నాడులు, **కర్మమార్గేణ** = కర్మమార్గముచే, **సుషిరాః** = పునరావృత్తి ప్రాపకమైన రన్ధ్రములు కలవి, **తిర్యఞ్చః** = తిర్యగ్భూతములైన, **సుషిరాత్మకాః** = రన్ధ్రములే ప్రధానముగా గల, **అధశ్చోర్ధ్వగతాః** = అధోభాగమునందు ఊర్ధ్వభాగములందుసర్వత్రా వ్యాపించిన నాడులుయొక్క, **నవద్వారాణి** = తొమ్మిది రన్ధ్రములను, **శోధయన్** = ప్రాణాయామముచే ముఖాది సర్వద్వారములు శోధించి, **జీవః** = జీవుడు, **వాయునా సహ** = వాయువుతోగూడ, **ఊర్ధ్వజ్ఞానీ** =





అపరోక్ష జ్ఞానము కలవాడై, **మోక్షమ్** = మోక్షమును, **ఆప్నుయాత్** = పొందును.

**దీపికా:** ఈనాడి బ్రహ్మోపాసన స్థానమగుటచే ఇతర నాడులకంటె శ్రేష్ఠమైనదని ఉపదేశించుచున్నాడు. నాడీకన్ద స్థానమునుండి పాదాఙ్గుష్ఠ పర్యన్తము వాయుసంచారమునకు తగిన ౭౨వేల నాడులు స్థూలములు, సూక్ష్మములును అయి పునారావృత్తి హేతువులగుచున్నవి. ఆకాశమున సమానవాయువు, మరియు వాయుమండలమున వ్యానవాయువు, అగ్ని యందు ఉదానవాయువు, జలమున ప్రాణమును, భూమియందు అపానము కలవు. ౫ ప్రధాన వాయువులును, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనఞ్జయములను ౫ ఉపవాయువులును కలిసి మొత్తము ౧౦ విధములైన వాయువులు నాడులందు సంచరించుచున్నవి.

**"తున్దస్థం జలమన్నఞ్చ రసాది చ సమీకృతమ్**
**తున్దమధ్యగతః ప్రాణస్తాని కుర్యాత్పృథక్పృథక్**
**ఇత్యాది చేష్టనం ప్రాణః కరోతి చ పృథక్స్థితః**
**అపానవాయు ర్మూత్రాదేః కరోతి చ విసర్జనమ్**
**ప్రాణాపానాది చేష్టాది క్రియతే వ్యానవాయునా**
**ఉజ్జీర్యతే శరీరస్థ ముదానేన నభస్వతా**
**పోషణాది శరీరస్థ సమానః కురుతేసదా**
**ఉద్గారాదిక్రియో నాగః కూర్మో౽క్ష్యాది నిమీలనః**
**కృకరః క్షపయోః కర్తా దత్తో నిద్రాది కర్మకృత్**
**మృతగాత్రస్యశోభాది ధనఞ్జయ ఉదాహృతః"**

ప్రాణవాయువు దేహమధ్యభాగమందుండి మనము భుజించుచున్న అన్న

జల రసాదుల సమీకరణముచేసి, వేరువేరుగా ఉంచుచున్నది. అపానము మలమూత్రాది విసర్జనము చేయుచున్నది. వ్యానముచే ప్రాణాపానవాయు చేష్టాదికము సలుపబడుచున్నది. ఉదానము శరీరమందున్న పదార్థము లను జీర్ణము చేయుచున్నది. సమానము పోషణాదికమును చేయు చున్నది. నాగము త్రేపులు కలుగచేయుచున్నది. కూర్మవాయువు నిమీలనాది కృత్యములను చేయుచున్నది. కృకరవాయువు నిమేషో న్మేషములు, దేవదత్తము నిద్రాది కర్మలను, ధనఞ్జయవాయువు మరణించిన దేహము ఉబ్బునట్లుగా చేయుచున్నవి. **"నజహాతి మృతం వా౽పి సర్వవ్యాపీ దనఞ్జయః। ఏతే నాడీషు సర్వాసు భ్రమన్తే జీవ జన్తవః"** సర్వవ్యాపియై మరణించిన తరువాతకూడ ధనఞ్జయ వాయువు దేహమును ఆశ్రయించియుండును. ఇట్లు దశవిధ వాయువులు నాడీచక్రమును ఆశ్రయించియుండి పునరావృత్తి ప్రాపకములగుచున్నవి. ఎటులనగా ౭౨వేలనాడులలో ౭౨నాడులు ముఖ్యములనియు, అందు ప్రాణవాహిను లైన ౧౦నాడులు ప్రధానములనియు, అవి ఇడా పిఙ్గల, సుషుమ్నా, గాన్ధారీ, హస్తిజిహ్వా, పూష, యశస్విని, అలమ్బుస, కుహు, శఙ్ఖిని అనియు శ్రుతి ప్రమాణీకరించుచున్నది. వీటి స్థానములు జ్ఞాననాడియైన సుషుమ్నకు వామభాగమున ఇడానాడి, దక్షిణభాగమున పిఙ్గలానాడి యున్నవి. ఇవి విజ్ఞాననాడులని తన్త్రవచనము. గాన్ధారీనాడి ఎడమ కంటిలో, హస్తిజిహ్వా కుడికంటిలో, దక్షకర్ణమున పూషా, వామకర్ణమున యశస్విని, ఆస్యమున అలమ్బుసానాడి, లిఙ్గదేశమున కుహూనాడియున్నవి. మూలస్థానమున శఙ్ఖినీనాడియున్నది. ఇవి కర్మ మార్గములు. వీటియందు సంచరించు వాయువులు ఇన్ద్రియములను ప్రచోదనచేయుచు, వాసనాపూర్ణములై పురావృత్తికి హేతువులగుచున్నవి.





నవరన్ధ్రాత్మకమైన దేహాన్తర్గతనాడులను మహాముద్ర, నభోముద్ర, ఓడ్యాణ బన్ధము, జాలన్ధరబన్ధము, మూలబన్ధముల అభ్యాసముచే శుద్ధమొనర్ప వలెను. మహాముద్ర సర్వరోగహరము. మహాముద్ర సిద్ధించిన వానికి పథ్యాపథ్య వస్తుభేదము అక్కరలేదు. ఇది దేహమునందున్న నాడులను శుద్ధిచేయును. శరీరమును ఆశ్రయించియుండు దుష్టపిత్త వాతాది రసములను శోషింపజేయును. మూలబన్ధాభ్యాసము వలన ప్రాణాపాన ములకు ఐక్యము సిద్ధించును. దీనివలన మూత్రపురీషములు నశించును. ఓడ్యాణబన్ధాభ్యాసముచే ప్రాణము సుషుమ్నాకాశమునందు సంచరించు చుండును. జాలన్ధరాబన్ధాభ్యాసమున కణ్ఠగత రోగములన్నియు నశించును. కపాల కుహరమునుండి వెలువడునట్టి చన్ద్రకలామృతము జఠరాగ్నియందు పడదు. ప్రాణవాయువు ప్రకోపము చెందదు.

నాడీశుద్ధియైన పిదప వైశ్వానరాంశగల నాభిస్థానీయుడైన జీవుడు విషయవ్యాప్తి రహితుడగుటచే నిష్కళుడు. కారణరూపమైన క్షీరముకన్న కార్యభూతమగు ఆజ్యము భిన్నమైనప్పటికీ, కారణావస్థయందు ఏకరూపముగా (క్షీరముగా)నే ఉన్నట్లు, జీవుడును సర్వకారణభావాపత్తికి అనగా కారణముగా అగుటకు సాధనభూతములగు ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులను పఞ్చోపాయములచే ఆత్మభూ తుడగుచున్నాడు. అనగా ప్రాణాపానాది బాహ్యవ్యాపారములనుండి విముఖుడై సర్వేన్ద్రియవ్యాపారోపరమ లక్షణమగు నిర్వికల్పావస్థయందు నిష్కళత్వమును పొందుచున్నాడు. నాభికమలమందలి జీవుడు ప్రాణా పానములను సమముగాజేసి కేవల కుమ్భకమందు ఊర్ధ్వజ్ఞానము అనగా సహస్రారకమల అమృతాస్వాదనము కలవాడై మోక్షమును పొందును.

**అమరావతీన్ద్రలోకోఽస్మి న్నాసాగ్రే పూర్వతోదిశి।**
**అగ్నిలోకో హృది జ్ఞేయ శ్చక్షుస్తేజోవతీపురీ॥ ౨౩**

**టీ॥ అస్మిన్** = ఈ సుషుమ్నానాడియందు, **పూర్వతోదిశి** = తూర్పుదిక్కు నందు, **నాసాగ్రే** = నాసాగ్రమందు, **అమరావతీ** = అమరావతీ యను, **ఇన్ద్రలోకః** = ఇన్ద్రునిలోకము, **హృది** = హృదయమందు, **అగ్నిలోకః** = అగ్నిలోకము, **చక్షుః** = నేత్రము, **తేజోవతీపురీ** = తేజోవతియను పట్టణము, (వర్తతే), **జ్ఞేయం** = తెలియదగినది.

**దీపికా:** దేహములో మూలాధారాది సహస్రారపర్యన్తము సుషుమ్నా దణ్డము ఏవిధముగా సర్వాధారముగానున్నదో, యటులనే బ్రహ్మాణ్డాన్తర్గ తముగా సర్వదేవతావాసమైన మేరువుకలదు. పిణ్డాణ్డ బ్రహ్మాణ్డ సమన్వయ రూపముగా పరమాత్మ సదృశమైన మేరుస్వరూపము **"ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ"** అను శ్రుత్యర్థరూపముగా బోధింపబడుచున్నది. ఆ నాడియందు తూర్పుదిశయందు భ్రూమధ్యస్థానమున ఇన్ద్రుని అంటే ఏకాదశేన్ద్రియములకు ప్రభువైనవాని లోకమైన అమరావతీ నగరము కలదు.

మూలాధారచక్రము **'వ శ ష స'** అనెడి నాలుగు అక్షరములను కలిగి, కర్ణికయందు చతుష్కోణరూపమైన పృథ్వీమణ్డలము, ఆ మణ్డలమునకు అష్టదిక్కుల ప్రకాశమానమైన ఎనిమిది శూలములు కలిగి పీతవర్ణమున యున్నది. దానిమధ్యయందు నాలుగు భుజములు కలిగి, చేతియందు వజ్రాయుధము కలిగి, ఐరావతము నెక్కిన బంగారు వర్ణముగల **'లం'** అనెడి బీజరూపుడైన ఇన్ద్రుడు కలడని తంత్రవచనము.

కావున ఆజ్ఞాచక్రస్థానీయమైన ఇన్ద్రలోకము చేతసీపురమను ప్రసిద్ధికల అమరావతి. ఇది మనస్సుయొక్క స్థానము. ఇది సర్వదేవతా విశ్రాన్తి





స్థానము. **"తత్ర లోకపతేఃస్థాన మాదిత్యసమవర్చసః మహేన్ద్రస్య మహారాజ్ఞః సర్వసిద్ధైర్న మస్కృతమ్। తమిన్ద్రలోకం లోకస్య బుద్ధ్వా పరమయాయుతమ్। దీప్యతే త్వమర శ్రేష్ఠైస్త్రిదశైర్నిత్య సేవితామ్"** ఇది సుఖసదనము. హృదయమున అగ్న్యాదిదేవతలకు ఆవాసమైన లోకము కలదు. దక్ష నేత్రమందు తేజోవతీయను పురముకలదు. **కూటాగారైర్వి నిక్షిప్త మనేకై ర్భవనోత్తమైః। మహావిమానం ప్రథితం భాస్కరం జాతవేదసమ్। సా హి తేజోవతీ నామ హుతాశస్య మహాసభా। సాక్షాత్తత్ర సురశ్రేష్ఠః సర్వ దేవముఖోఽనలః॥**

**యామ్యాం సంయమినీ శ్రోత్రే యమలోకః ప్రతిష్ఠితః।**
**నైర్పతోహ్యథ తత్పార్శ్వే నైర్పతో లోక ఆశ్రితః॥౨౪**

**టీ॥** శ్రోతే = చెవియందు, **యామ్యామ్** = యముని సంబంధమైన, **సంయమినీ** = సంయమినియను, **యమలోకః** = యమలోకము, **ప్రతిష్ఠితః** = ప్రతిష్ఠింపబడినది, **అథ** = అనన్తరము, **తత్పార్శ్వే** = దానికిప్రక్కన, **నైర్పతః** = నిర్పతిసంబంధమైన, **నైర్పతిలోకః** = నిర్పతి లోకము, **ఆశ్రితః** = ఆశ్రయింపబడినది.

**దీపికా:** దక్షకర్ణమందు యముని సంబంధమైన సంయమినీయను లోకముకలదు. ఇది ధారణకు యోగ్యమైన స్థానముగానున్నది. **"తృతీయె పృస్తర తటే ఏవమేవ మహాసభా। వైవస్వతస్య విజ్ఞేయా లోకేఖ్యాతాస్తు సంయమా॥" "యమ్యతే చిత్తమనేన యమః॥ యమ ఉపరమే"** దీనిచే మనస్సు నిలుపబడును. యముడనగా మనస్సును ఉపరమింపజేయు వాడు. శరీరమాత్ర ఉపాధిని సాధనముగా అపేక్షించి యావజ్జీవము సత్యాహింసా సన్న్యాదులు ఆచరించువాడు. ఈ స్థానమునకు సంయమినీ అని సంజ్ఞ. ఇచ్చట పరపీడనాదులు విడిచి సత్వగుణవిశిష్టుడైన వాడు

మనస్సు నిలుపుస్థానము. కనుకనే ఉపనయన సంస్కార సమయమున గాయత్రీమన్త్రము దక్షకర్ణమున ఉపదేశింపబడు చున్నది. అనంతరము దానికి ప్రక్కగా నిర్ఋతి సంబంధమైన లోకము ఆశ్రయింపబడినది. దీనికి రక్షోవతీయని సంజ్ఞ కలదు. ఈ రక్షోవతీయను లోకమునకు కృష్ణాఙ్గనయను నామాంతరము కలదు. **"తథా చతుర్థ దిగ్దేశ నైరృత్యాధి పతేః సభా। నామ్నా కృష్ణాఙ్గనానామ విరూపాస్య ధీమతః"** ఇందు కర్మదేవతలు, పిశాచాదులు ఉందురు. ఇది అలక్ష్మీస్థానము. జననమరణ రూప సంసారమును (గర్భవాస రూపమైన నరకమును) కలిగించును.

**విభావరీ ప్రతీచ్యాం తు పృష్ఠేవారుణికాపురీ।**
**వాయోర్గన్ధవతీ కర్ణపార్శ్వే లోకః ప్రతిష్ఠితః॥** ౨౫

**టీ॥ ప్రతీచ్యామ్** = పశ్చిమ దిక్కునందు, **పృష్ఠే** = పృష్ఠభాగమునందు, **విభావరీ** = విభావరియను పేరుగల, **వారుణికా** = వరుణదేవుని, **పురీ** = పురము, **కర్ణపార్శ్వే** = ఎడమచెవి ప్రక్కన, **వాయోః** = వాయువుయొక్క, **గన్ధవతీ** = గన్ధవతీయను, **లోకః** = లోకము, **ప్రతిష్ఠితః** = స్థాపనచేయ బడినది.

**దీపికా:** పశ్చిమదిక్కునందు పృష్ఠభాగమున విభావరీయను పేరుగల వరుణపురి కలదు. ఈ విభావరికి శుద్ధవతీ(శుభవతీ) యను సంజ్ఞకలదు. **"పఞ్చమోప్యంతర తటే ఏవమేవ మహాసభా। వైవస్వతస్య విజ్ఞేయా నామ్నా శుభవతీ సతీ। ఉదకాధిపతేః ఖ్యాతా వరుణస్య మహాత్మనః।"** ఇది సిద్ధసేన, హేమసంజ్ఞ, సిద్ధవతియను పురత్రయముచే పరివేష్ఠింపబడి యున్నది. ఇచ్చట భగవానుడు వరుణుడు చుట్టచుట్టు కొనియున్నాడు. ఇది మిగుల ప్రకాశముగల స్థానము. వసువులు, విద్యాధరులు దీనిని ఆశ్రయించుకొనియుందురు. ఎడమచెవి ప్రక్కన వాయువ్యమూల వాయువుయొక్క గన్ధవతీలోకము ప్రతిష్ఠింపబడినది.





**"పరోత్తరే తథాదేశే షష్ఠోంతరతటే శివే। వాయోర్గన్ధవతీ నామ సభా సర్వ గుణోత్తరా।"** ఇది కిన్నరుల స్థానము.

**సౌమ్యా పుష్పవతీ సౌమ్యే సోమలోకస్తు కణ్ఠతః।**
**వామకర్ణే తు విజ్ఞేయో దేహమాశ్రిత్య తిష్ఠతి॥** ౨౬

**టీ॥ సౌమ్యే** = సోముడు అధిదేవతగా గల దిక్కునందు, **కణ్ఠతః** = కణ్ఠము మొదలు, **వామకర్ణే** = ఎడమచెవి వఱకు, దేహమ్ = దేహమును, **ఆశ్రిత్య** = ఆశ్రయించి, **సౌమ్యా** = చన్ద్రసంబంధమైన, **పుష్పవతీ** = పుష్పవతీయను, **సోమలోకస్తు** = సోమలోకము, **తిష్ఠతి** = ఉన్నది. **విజ్ఞేయమ్** = తెలియదగినది.

**దీపికా:** ఉగ్రముకాని స్థితియందు అనగా సృష్ట్యున్ముఖావస్థయందు కణ్ఠమునుండి వామకర్ణ పర్యన్తము దేహమును ఆశ్రయించి చన్ద్రసంబంధమైన పుష్పవతీయను సోమలోకము కలదు. ఇది అకార ఉకార సన్ధియోగముచే త్రయోదశసర్వ రూపముగా ప్రకాశించు శుద్ధబుద్ధి. ప్రకాశమాన బిన్దు రూపముగా ప్రకాశించుచున్నది. ఇది ఓఙ్కారమునకు చివరిదశ. చన్ద్ర లోకము ప్రపఞ్చరూప పరిణామమునకు అవకాశము కలది. అనగా వికసనధర్మముగలది. కావున ఈ స్థానము **పుష్పవతీ**యని పిలువబడు చున్నది. దీనికి మహోదయమను సంజ్ఞకలదు. **'నక్షత్రాధిపతేః సభా, నామ్నా మహోదయానామ శుద్ధవైదూర్య వేదికా'**

**వామే చక్షుషి చైశానీ శివలోకో మనోన్మనీ।**
**మూర్ధ్ని బ్రహ్మపురీజ్ఞేయా బ్రహ్మాణ్డం దేహమాశ్రితం॥** ౨౭

**టీ॥ వామే** = వామభాగమందలి, **చక్షుషి** = నేత్రమునందు, **ఈశానీ** = శివసంబంధమగు, **మనోన్మనీ** = మనోన్మనీయను, **శివలోకమ్** = శివలోకము; **మూర్ధ్ని** = శిరస్సునందు, **బ్రహ్మపురీ** = బ్రహ్మపురము

(ఉన్నవి), **బ్రహ్మాణ్డమ్** = సమస్తలోకములు, **దేహమాశ్రితమ్** = దేహమును ఆశ్రయించుకొని యున్నవని, **జ్ఞేయమ్** = తెలియదగినది.

**దీపికా:** వామభాగమందలి నేత్రమున శివసంబంధ మనోన్మనీయను లోకముకలదు. ఈ మనోన్మనీయను ఈశానుని లోకమునకు యశోవతీ యను సంజ్ఞకూడాకలదు. (దీనిని వైకుణ్ఠ, పద్మావతి, కామశుభయను పురత్రయము పరివేష్ఠించియున్నది) ఈ మనోన్మని ఇతఃపూర్వము పుష్పవతీ స్థానమును పొందునదిగను, దానినుండి విడువబడునదిగాను యున్నది, కావున **వామః** అని చెప్పబడినది. ఇది పూర్వదర్శితమైన చన్ద్రమణ్డలోపరి స్థితి. ఖేచరీముద్రానుష్ఠానపరులకు బిన్దునాశము లేదు. అనగా బిన్దువు పతనముకాకుండా ఊర్ధ్వగమనము కలదిగాయుండును. కేవల కుమ్భకమున వాయువు నిశ్చలమైన; బిన్దువును నిశ్చలమగు చున్నది. బిన్దువు నిశ్చలమైన వీర్యవన్తుడైన యోగి ఈశ్వరుడని చెప్పబడు చున్నాడు. **"చలేవాతే చలోబిన్దుః నిశ్చలేనిశ్చలో భవేత్। యోగీ స్థాణుత్వమాప్నోతి తతో వాయుం నిరున్ధయేత్"** వాయువు చలించిన ఈ మనోన్మనీ స్థానమునగల యోగి పరిణామ క్రమమున సృష్ట్యారమ్భ స్థానమైన పుష్పవతీ స్థానమును పొందుచున్నాడు. కేవలకుమ్భకమందున్న ఊర్ధ్వరేతస్కుడైన యోగిచిత్తము లౌకిక విషయముల నుండి లాగివేయబడి **ఉన్మని**యగును. లుప్తమైన మనస్సు కలవాడగుచున్నాడు. **"ఉన్మన్యా సహితో యోగీ, నయోగీ ఉన్మనీ వినా."** ఈ ఉన్మనీస్థానమున పతనము లేదు. పుష్పవతీయను సంజ్ఞగల 'కలా' అనగా శక్తిస్థానము. దీనిపై సమానచక్రము అను మనోన్మనీస్థానము. దీనిపై కార్యకారణరూప మనస్సు తెలియబడని ఉన్మనీస్థితి. మనోన్మనీ స్థానమందే మనోలయము జరుగును. మూర్ధ్నిస్థానమున బ్రహ్మపురము (సహస్రారం) కలదు. ఇది కేవల ఆనన్దరూపమైనది. **"ఇహస్థానే దేవః పరమశివ సమాఖ్యాన**





**సిద్ధః ప్రసిద్ధః। స్వరూపే సర్వాత్మా రసవిరస మితోऽజ్ఞాన మోహాన్ధ హంసః॥"** ఈ స్థానమున పరమశివ నామముగల భగవానుడు నివశించుచున్నాడు. ఈయన బ్రహ్మరూపి, జీవాత్మ పరమాత్మలకు అభేదముగనుక సర్వాత్మ స్వరూపి. ఈ దేహమునందు మూలాధారాది ఆజ్ఞాన్తము ఆకాశాది పఞ్చమహాభూతములకు వ్యాప్తి. ఇందు షట్కమల దళములు లేబది. ఈ దళములయందు పఞ్చాశద్వర్ణమాతృకలు దళమునకు ఒక వర్ణముగాయున్నవి. దీనిచే నామరూపాత్మక సకల ప్రపఞ్చము ప్రభవించినది. కావున సకలలోకములు, తదధిష్ఠాన దేవతలు ఈ శరీరముననే కలరు.

**పాదాదధశ్శివోऽనన్తః కాలాగ్నిప్రళయాత్మకః।**
**అనామయమధశ్చోర్ధ్వం మధ్యమం తు బహిశ్శివమ్॥** ౨౮

**టీ॥ పాదాదధః** = పాదములకు క్రింద, **అనన్తః** = అనన్తుడను, **శివః** = శివుడు, **ప్రళయాత్మకః** = ప్రళయరూపుండు, **కాలాగ్నిః** = కాలాగ్ని రూపమున నున్నాడు. **అధశ్చ** = అధోభాగమునను, **ఊర్ధ్వమ్** = పైభాగమునను, **మధ్యమమ్** = మధ్యదేశమునను, **బహిః** = బాహ్యముగను, **అనామయమ్** = అనామయుడగు, **శివః** = శివుడున్నాడు.

**దీపికా:** పాదముక్రింద అనగా కిరణములకు క్రింద **"పాదోప్రఘ్నే తురీయాంశే శైల ప్రత్యన్త పర్వతే చ మయూఖేచ"** అనాహతపద్మమందలి ఆదిత్యకిరణ ప్రసారములేని అంధతామిశ్రలోకము. ఇది ఆధారచక్రము. దీనికి కూర్మచక్రంబనియు నామాన్తరము. ఈ కూర్మచక్రమునకు ఇన్ద్రాద్యష్ట దిక్కుల ఐరావతము, పుణ్డరీక వామన కుముద అఞ్జన, పుష్పదన్త సార్వభౌమ సుప్రతీకమను అష్టదిగ్గజంబులు. ఇవి అభ్ర, కపిల, పిఙ్గల, అనుపము, తామ్రపర్ణి, శుభవతి, అఙ్గన, అఞ్జనా యను తమ స్త్రీలతోగూడి పృథ్విని వహింపుచున్నవి. అనన్త, తక్షక, వాసుకి,

శఙ్ఖపాల, పద్మ, కర్కోటక, క్రోడ, కాళంబులను అష్టనాగంబులు స్తంభాకారంబున అష్టదిక్కులనుండి పర్వతపాదములవలె భూమిని క్రమమున వహించియున్నవి. కూర్మచక్రము నకు క్రింద అనన్తుడను శివుడు ప్రళయాత్మకుడు అనగా అష్టవిధరూపముల కాలాగ్నివలె నున్నాడు. ఈవిధముగ గజమస్తక ఫణి మహాశేష ఫణముల మీద అతివిశాలమై సర్వాధారంబగు సువర్ణమయ భూమియున్నది. దానికి మీదను క్రిందను ఇన్ద్రాది దశదిక్కులయందు కాలాగ్నిరుద్ర భవనము కలదు. దానియందు అనామయుడు మఙ్గల స్వరూపుడైన శివుడున్నాడు.

**అధః పదోఽతలం విద్యాత్పాదం చ వితలం విదుః।**
**నితలం పాదసన్ధిశ్చ సుతలం జఙ్ఘముచ్యతే॥ ౨౯**
**మహాతలంతు జానుస్యా దూరుదేశో రసాతలమ్।**
**కటిస్తలాతలం ప్రోక్తం సప్తపాతాల సంజ్ఞయా॥౩౦**

**టీ॥ పదః అధః** = పాదములక్రింద, **అతలమ్** = అతలలోకము, **విద్యాత్** = తెలియవలెను, **పాదమ్** = పాదము, **వితలశ్చ** = వితల లోకము, **విదుః** = చెప్పుచున్నారు. **పాదసన్ధిశ్చ** = గుల్ఫస్థానమందు, **నితలమ్** = నితలలోకము, **జఙ్ఘమ్** = పిక్కలయందు, **సుతలమ్** = సుతలలోకమును, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది. **జానుః** = మోకాలి యందు, **మహాతలమ్** = మహాతలము, **ఊరుదేశే** = తొడలయందు, **రసాతలమ్** = రసాతలమును, **స్యాత్** = అగును. **కటిః** = కటిప్రదేశము, **తలాతలమ్** = తలాతలమును, **పాతాలసంజ్ఞయా** = పాతాల లోకములను సంజ్ఞచేత, **ప్రోక్తమ్** = చెప్పబడినవి.

**దీపికా:** పాదములక్రింద అతలలోకము, పాదములందు వితలము, గుల్ఫప్రదేశము నితలము, పిక్కలందు సుతలము, మోకాలియందు





మహాతలము, ఊరువులు రసాతలము, కటిదేశము తలాతలము. ఈ క్రమమున సప్తపాతాలములున్నవని చెప్పుదురు. ఈ స్థానములు క్రమముగా మృణ్మయ, వాలుక, లోహ, కాంస్య, సువర్ణ, రజత, తామ్ర, ధాతు మయములు. వీటి అధిపతులు బలి, బృహద్గర్భ, హిరణ్యాక్ష, కర్కన్ధుర, శఙ్ఖకర్ణ, ప్రహ్లాద, శిశుపాలురను దైత్యాధిపతులు.

**కాలాగ్నినరకం ఘోరం మహాపాతాల సంజ్ఞయా।**
**పాతాలం నాభ్యధోభాగే భోగీన్ద్రఫణిమణ్డలమ్।**
**వేష్టితస్సర్వతోఽనన్తః సమ్బిభ్రజ్జీవ సంజ్ఞకః॥ ౩౧**

**టీ॥** ఘోరమ్ = భయఙ్కరమైనదియును, కాలాగ్నినరకమ్ = కాలాగ్ని నరకమును, భోగీన్ద్రఫణిమణ్డలమ్ = సర్పరాజైన శేషునిపడగల మణ్డలము కలది, మహాపాతాలసంజ్ఞయా = మహాపాతాలమను సంజ్ఞ కలదియు, పాతాలమ్ = పాతాలము, నాభ్యధోభాగే = నాభిస్థానమునకు క్రిందగా, సర్వతః = అంతటను, వేష్టితః = చుట్టుకొన్నదై, జీవసంజ్ఞకః = జీవుడను సంజ్ఞకలదై, అనన్తః = అనన్తుడను సర్పము, సమ్బిభ్రత్ = బాగుగా ధరించెను.

**దీపికా:** భయఙ్కరమగు కాలాగ్ని నరకమను లోకము మహాపాతాలమను పేరున అధోలోకమందు వున్నది. జీవసంజ్ఞగల ఆదిశేషువు పడగదాల్చి మణ్డలాకారముగా దానిని చుట్టియున్నాడు.

**భూలోకం నాభిదేశం తు భువర్లోకం తు కుక్షితః।**
**హృదయం స్వర్గలోకంతు సూర్యాదిగ్రహతారకాః॥౩౨**

**టీ॥ నాభిదేశస్తు** = నాభిదేశము; **భూలోకః** = భూలోకము; కుక్షితః = కుక్షియందు; **భువర్లోకః** = భువర్లోకము; హృదయమ్ = హృదయమందు;

**స్వర్గలోకస్తు** = స్వర్గలోకము; **సూర్యాదిగ్రహతారకాః** = ఆ స్వర్గలోకము నందు సూర్యాదిగ్రహములు నక్షత్రములు వున్నవి.

దీపికా: నాభిస్థానము భూలోకము. నాభిస్థానమునకు క్రింద జీవసంజ్ఞ గల ఆది శేషువు పడగలదాల్చి మండలాకారముగ నున్నాడని చెప్పుటచే ఈ భూలోకమును భరిస్తున్నటువంటి వానిగ అనంతనామక ఆదిశేషువు ప్రకటింప బడుచున్నాడు. కనుకనే "మహీం మూలాధారే కమపిమణిపురే హుతవహం। స్థితం స్వాధిష్ఠానే హృదిమరుత మాకాశ ముపరి"అని నాభిస్థానము స్వాధిష్ఠానముగ వర్ణింపబడినది. స్వాధిష్ఠానకమల అధిష్ఠానదైవము శ్రీవత్సాఙ్కితుడైన విష్ణువును అనన్తశయనునిగా చెప్పుటయందలి పరమార్థము ఇదియే. హృదయమునందు స్వర్గలోకము. ఇది సూర్యాది గ్రహతారకా సంవేష్టితము. ఈ స్వర్గమున సూర్యుడున్నాడు. **"రవేరశ్మి సహస్రం యతు ప్రాఙ్మయా సముదాహృతం। తేషాం శ్రేష్ఠాః పునఃసప్త రశ్మయోగ్రహ యోనయః॥ సుషుమ్నో హరికేశశ్చ విశ్వకర్మా తథైవచ। విశ్వశ్రవాః పునశ్చాస్య, సంపద్వసురతః పరం। అర్వావసుః పునశ్చాన్యో మయాచాత్ర ప్రకీర్తితః॥ సుషుమ్నః సూర్యరస్మిస్తు క్షీణం శశినమేధయన్ తిర్యగూర్ధ్వ ప్రభావోఽసౌ సుషుమ్నః పరికీర్త్యతే॥ దక్షిణేవిశ్వకర్మాతు రశ్మిర్బర్ధయతే బుధం॥ విశ్వ శ్రవాస్తు యఃపశ్చాత్ శుక్రయోనిః స్మృతో బుధైః। సంపద్వ సుశ్చయోరశ్మిః సయోనిర్లోహి తస్యచ॥ షష్ఠస్త్వార్వావసు రశ్మియోనిస్తు సబృహస్పతేః। శనైశ్చరం పునశ్చాపి రశ్మిరాప్యాయతే స్వరాట్॥ ఏవం సూర్యప్రభావేణ గ్రహనక్షత్ర తారకాః। వర్ధంతే విదితాః సర్వావిశ్వం చేదం పునర్జగత్॥** సూర్యరశ్మి సహస్రములలో శ్రేష్ఠములగు ఏడురశ్మలు గ్రహయోనులు. అవి సుషుమ్న, హరికేశము, విశ్వకర్మ, విశ్వశ్రవసువు, సంపద్వసువు, అర్వావసువు, స్వరాట్టు అను సంజ్ఞలుకలవి. సుషుమ్నయను సూర్యరశ్మి క్షీణచన్ద్రుని వృద్ధినొందించును. ఇది తిర్యగూర్ధ్వగతి ప్రభావుడు.





హరికేశము నక్షత్రయోని, దక్షిణభాగమందు విశ్వకర్మయనునది బుధసంబంధి; పశ్చిమభాగమందున్న విశ్వశ్రవసు వను రశ్మి శుక్రయోని, సంపద్వసువను రశ్మి అఙ్గారకయోని, అర్వావసు వను రశ్మి బృహస్పతి గ్రహయోని, స్వరాట్ శనైశ్చరగ్రహ సంబంధి. ఇవ్విధమున ఆదిత్యుడే చన్ద్రాదిగ్రహ నక్షత్రములకు కారణుడై ప్రకాశించు చున్నాడు. ఇది ద్వాదశదళాత్మకమెన కమలస్థానము. ఈ ద్వాదశదళములు చైత్రాది ద్వాదశమాసములు. ఇందు సూర్యుని సంచారముచే ధాత, అర్యమ, మిత్ర, వరుణ, ఇన్ద్ర వివస్వన్త, పర్జన్య, పూష, అంశుమన్త; గభస్తిమన్త; త్వష్ట, విష్ణువుల క్రమమున ద్వాదశ సంజ్ఞలను పొందుచున్నాడు.

**సూర్యస్సోమ స్సనక్షత్రోబుధశ్శుక్ర కుజాఙ్గిరాః।**
**మన్దశ్చ సప్తమో జ్ఞేయః ధ్రువోన్త స్స్వర్గలోకతః॥** 33

**టీ॥ సూర్యః** = సూర్యుడు; **సనక్షత్రః** = నక్షత్ర సహితముగా; **సోమః** = చన్ద్రుడు; **బుధః** =బుధుడు; **శుక్రకుజఙ్గిరాః** = శుక్ర కుజగురులు; **సప్తమః** = ఏడవవాడు; **మన్దశ్చ** = శనియును; **స్వర్గలోకతః** = స్వర్గ లోకమునకు, **అన్తః** = చివర; **ధ్రువః** = ధ్రువుడు; **జ్ఞేయః** = తెలియదగినవారు.

**దీపికా:** పూర్వోక్త గ్రహమణ్డలములకు ఉపరిభాగములందలి గ్రహమణ్డలాధిదేవతా స్థానములు చెప్పబడుచున్నవి. సూర్యలోకము మొదలుగా ధ్రువలోక పర్యన్తము స్వర్గమనియే వ్యవహారము. ఇది సూర్యదేవత యుండు స్థానముగాని సూర్యగ్రహ మణ్డలముకాదు. ఆ సూర్యునిపై సోముడు నక్షత్ర సహితుడైయున్నాడు. ఇది చన్ద్రగ్రహము కాదు. గ్రహాధిదేవత నివసించెడి లోకము. ఈ అఙ్గారక, బుధ, గురు, శుక్ర, శనైశ్చర్య లోకములు గ్రహమణ్డలములు కావు. ఆయా గ్రహాధి దేవతలు నివశించెడి స్థానములు. దానిపై అఙ్గారకుడు, ఆపై బుధుడు, వానిపై

బృహస్పతి, ఆ బృహస్పతికిపైన శుక్రుడు. ఆ శుక్రునిపై అఞ్జనవర్ణ సదృశుడైన శనియున్నారు. ఆపై ధ్రువుడు కలడు. ఇవ్విధమ్మున కణ్ఠగత జనలోక పర్యన్తము ఈ స్వర్గము వ్యాపించియున్నది.

**హృదయే కల్పయన్యోగీ తస్మిన్సర్వసుఖం లభేత్**
**హృదయేచ మహర్లోకో జనోలోకం తు కణ్ఠతః**
**తపోలోకం భ్రువోర్మధ్యే మూర్ధ్ని సత్యం ప్రతిష్ఠితమ్॥** ౩౪

**టీ॥ యోగీ** = యోగి; **హృదయే** = హృదయమునందు; **కల్పయన్** = కల్పించుకొన్నవాడై; **తస్మిన్** = ఆహృదయమునందు; **సర్వసుఖమ్** = సమస్త సుఖములను, **లభేత్** = పొందును; **హృదయేచ** = హృదయము నందు; **మహర్లోకః** = మహర్లోకము; **కణ్ఠతః** = కణ్ఠమునందు; **జనోలోకః** = జనలోకము; **భ్రువోర్మధ్యే** = భ్రూమధ్యమున; తపోలోకః = తపోలోకము; **మూర్ధ్ని** = మూర్ధ్నిస్థానమున; **సత్యమ్** = సత్యము (బ్రహ్మము); **ప్రతిష్ఠితమ్** = ప్రతిష్ఠింపబడినది.

**దీపికా:** మూర్ధ్నిస్థానమున బ్రహ్మము ప్రతిష్ఠింపబడినది. భ్రూమధ్యమున తపోలోకము. ఇందు బ్రహ్మమానస పుత్రులైన సనక, సనన్ద, సనాతన, సనత్సుజాత, సనత్కుమారులను యోగనిష్ఠులు అధిపతులు. కణ్ఠమున జనలోకము. దీనికి వసిష్ఠాది ఋషీశ్వరులు అధిపతులు. హృదయము మహర్లోకము. దీనికి మార్కణ్డేయుడు అధిపతి. ఈ విధమున యోగి తన హృదయమందే సమస్తము సృష్టిక్రమమున కల్పించుకొని సమస్త సుఖములను పొందుచున్నాడు. ఈ స్థానములను పొందన యోగి ఆయా స్థానములందున్న యోగిపుఙ్గవుల దర్శించి తత్తద్భాగ్యములను పొంది సుఖించుచున్నాడని భావము.





**బ్రహ్మాణ్డ రూపిణీ పృథ్వీ తోయమధ్యే విలీయతే**
**అగ్నినా పచ్యతే తోయం వాయునా గ్రస్యతేఽనలః॥** ౩౫
**ఆకాశంతు పిబే ద్వాయుం మనశ్చాకాశ మేవ చ**
**బుద్ధ్యహఙ్కార చిత్తఞ్చ క్షేత్రజ్ఞః పరమాత్మని॥** ౩౬

**టీ॥ బ్రహ్మాణ్డరూపిణీ** = బ్రహ్మాణ్డమే రూపముగాగల; **పృథ్వీ** = భూమి; **తోయమధ్యే** = జలమధ్యమున; **విలీయతే** = విలీనమగుచున్నది; **తోయమ్** = నీరు; **అగ్నినా** = అగ్నిచే; **పచ్యతే** = పాకము చేయబడు చున్నది; **అనలః** = అగ్ని; **వాయునా** = వాయువుచే; **గ్రస్యతే** = మ్రింగబడు చున్నది; **ఆకాశః** = ఆకాశము; వాయుమ్ = గాలిని; **పిబేత్** = పీల్చు చున్నది; **మనః** = మనస్సు; **ఆకాశమేవ** = ఆకాశమును; **ఏవ** = ఇవ్విధంబుననే, **బుద్ధ్యహఙ్కారచిత్తఞ్చ** = బుద్ధి అహఙ్కారము చిత్తము క్షేత్రజ్ఞునియందు, **క్షేత్రజ్ఞః** = క్షేత్రజ్ఞుడు, **పరమాత్మని** = పరమాత్మయందు (ప్రవిలాపయేదిత్యర్థః)

**దీపికా:** ఇతఃపూర్వము సృష్టిక్రమమున సర్వలోకములు దేహాంతర్గతమైనవిగా చెప్పి, సంహారక్రమమున వాటి ఉపసంహారము చెప్పబడు చున్నది. బ్రహ్మాణ్డరూపంబగు భూమి నీటియందు, జలము అగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము మనస్సు నందు, మనస్సు బుద్ధియందు, బుద్ధి అహఙ్కారమునందు, అహఙ్కారము చిత్తమునందు, చిత్తము క్షేత్రజ్ఞుడైన జీవునియందు, ఆ జీవుడు పరమాత్మ యందు అణుగుచున్నవి.

**అహం బ్రహ్మేతి మాం ధ్యాయేదేకాగ్ర మనసా సకృత్।**
**సర్వంతరతి పాప్మానం కల్పకోటిశతైః కృతమ్॥** ౩౭

**టీ॥ అహమ్** = నేను; **బ్రహ్మేతి** = బ్రహ్మమని; **సకృత్** = ఒకప్పుడు; **ఏకాగ్రమనసా** = నిశ్చయాత్మక బుద్ధిచే; **మామ్** = నన్ను; **ధ్యాయేత్** = ధ్యానించునో; **కల్పకోటిశతైః** = నూరుకోట్ల కల్పములచే; **కృతమ్** = చేయబడిన; **సర్వమ్** = సమస్తమగు; **పాప్మానమ్** = పాపమును; **తరతి** = దాటుచున్నాడు.

**దీపికా:** ఏ మనుజుడు నేనే బ్రహ్మమను నిశ్చయాత్మక బుద్ధిచే నన్ను ధ్యానించుచున్నాడో వాడు అనగా జీవాత్మల అభేదామును గ్రహించిన వాడు అనేక కోట్ల కల్పములందు జేసిన పాపమును దాటుచున్నాడు. సకల ప్రాణులయందు కామ్యము కనబడుచున్నది. ఇది అజ్ఞానము, కామముఅను దోషములచే కలుగుచున్నది. భార్యా పుత్ర మిత్ర ఐశ్వర్యాదులు కామ్యమేగాని మరియొకటి కాదు. సాధ్య సాధనములు రెండును కామ్యమేయగునని **"ఉభేహ్యేతే సాధ్య సాధన లక్షణే ఏవ"** బృహదారణ్యకము ప్రమాణీకరించుచున్నది. ఈ కామ్యమునకు వాక్కు, మనస్సు కాయములను త్రికరణములే సాధనములు. భార్య పుత్ర మిత్ర బంధువులు అజ్ఞానికేగాని, జ్ఞానికి ప్రత్యేకముగా లేరు. జ్ఞానికి ప్రయోజనాపేక్షలేదు. ఫలమును కోరుటలేదు. ఫలాపేక్షలేదు కావున ఇవి బంధము కానేరవు. కామ్యమందు దృష్టిగల మనుజునకు ప్రత్యవాయ దోషము కలుగుచున్నది. తద్దోషపరిహారార్థము జీవితకాల పర్యన్తము అగ్నిహోత్రము విధింపబడినది. **"ఏతత్ నియోగా విషయత్వేన విదుషః ప్రత్యుక్తమ్, అశక్య నియోజ్యత్వాచ్చ ఇతి"**. నేను బ్రహ్మమను నిశ్చయాత్మక బుద్ధిగల జ్ఞాని విధికి లోబడినవాడు కాడు. అట్టి ఆత్మజ్ఞానిని విధించుటకు శక్తిగలవారు లేరు. కావున ఈతనియందు **"యావజ్జీవము"** అను నిత్యకర్మనువిధించు శ్రుతి ప్రయోజన శూన్యముగానున్నది. ఇట్టి





అత్మజ్ఞుని నియోగించుటయందు శాస్త్రాదులకు శక్తిలేనప్పటికిని ధర్మజ్ఞుడు, శాస్త్రమర్యాద తెలిసిన వాడగుటచే ధర్మము నతిక్రమింపడు. ఫలపేక్ష లేకయే నియమప్రకారము నడుచుకొనును. కావున పాపమును దాటుచున్నాడు.

**ఘటసంవృత మాకాశం నీయమానే యథాఘటే।**
**ఘటో నశ్యతి నాకాశం తద్వజ్జీవః ఇహాత్మని॥** ౩౮

**టీ॥ ఘటసంవృతమ్** = ఘటముచే ఆవరింపబడిన; **ఆకాశమ్** = ఆకాశము; **ఘటేనీయమానే** = ఘటము అన్యదేశమును పొందియుండగా; **యథా** = ఏరీతి; **ఆకాశం న** = ఆకాశముకాక; **ఘటఃనశ్యతి** = ఘటమే నశించుచున్నదో; **తద్వత్** = అలాగే; **ఇహాత్మని** = పరబ్రహ్మమందు; **జీవః** = జీవుడు.

**దీపికా:** ఇచ్చట జీవుని ముక్తిరూపము ఉపదేశింపబడుచున్నది. ఘటావచ్ఛిన్నంబై ఆకాశము ఘటమందణిగి ఘటాకాశము అను సంజ్ఞను పొంది, ఆ ఘటము పూర్వదేశమునుండి అన్యదేశమును పొందినను లేక నశించినను మహాకాశమందు ఎట్లు ఐక్యము పొందునో యట్లే ఉపాధిచే జీవుడు సంస్కారబలమున పరమాత్మునియందు ఐక్యము పొందును.

**ఘటాకాశ మివాత్మానం విలయం వేత్తి తత్త్వతః।**
**సగచ్ఛతి నిరాలమ్బం జ్ఞానాలోక్యం నసంశయః॥** ౩౯

**టీ॥ ఆత్మానమ్** = ఆత్మను; **ఘటాకాశమివ** = ఘటాకాశమువలె; **తత్త్వతః** = నిజముగా; **విలయం న** = నాశములేనిదిగా; **వేత్తి** = తెలిసికొనునో; **సః** = వాడు; **నిరాలమ్బమ్** = నిరాధారమగు; **జ్ఞానాలోక్యమ్** = జ్ఞానముచే చూడదగిన బ్రహ్మమును; **గచ్ఛతి** =

పొందుచున్నాడు. **న సంశయః** = సంశయములేదు.

**దీపికా:** ఏవిధముగా ఘటాకాశము మహాకాశమున లీనమగుచున్నదో ఆవిధముగా జీవాత్మ పరమాత్మల ఐక్యమును తెలుసుకొనునో వాడు నిరాలంబమగు జ్ఞానలోక బ్రహ్మమును పొందును. ఇందు సంశయము లేదు.

**తపేద్వర్షసహస్రాణి ఏకపాదస్థితో నరః।**
**ఏకస్య ధ్యానయోగస్య కలాం నార్హతి షోడశీం॥** ౪౦

**టీ॥ నరః** = నరుడు; **ఏక పాదస్థితః** = ఒకకాలుపై నిలబడిన వాడై; **వర్ష సహస్రాణి** = అనేక వేలసంవత్సరములు; **తపేత్** = తపమొనర్చిన; **ఏకస్య** = ముఖ్యమైన; **ధ్యానయోగస్య** = ధ్యానయోగముయొక్క; **షోడశీమ్** = పదునాఱరవదైన; **కలామ్** = భాగమును; **నార్హతి** = పొందలేడు.

**దీపికా:** నరుడు అనేక వేలసంవత్సరములు మహాకష్టములకోర్చి ఏకపాదముపై నిలబడి తపము వొనర్చినను ఒక ధ్యానయోగమునందలి షోడశకళా భాగమునకైన సమముగాదు. ఎందులకనగా **"తస్మాద్వా ఏతస్మాదన్నరసమయా దన్యోన్తర ఆత్మా"** అని శ్రుతి **"అన్నరసమయుని కంటే ఈ అన్తరాత్మ వేఱు"** పలుకుచున్నది. కృచ్ఛ్రచాన్ద్రాయణాది వ్రత రూపమైన తపస్సు అన్నమయ దేహసంబంధమైనది. కావున అన్నమయ దేహమునకు భిన్నమైయున్నట్టి దేహాతీతమైన అంతరాత్మ ఇట్టి తపస్సుచే ఎన్నటికి తెలియబడదు. బ్రహ్మమే నేననెడి సద్వృత్తిచేత నిరాలంబత్వ ముగా దేహాద్యనుసన్ధానములేని స్థితియందునుండుటయే పరమానంద ప్రదమగుచున్నది. ఇదియే ధ్యానమని చెప్పబడినది. ఇట్టి ధ్యానమే కృచ్ఛ్ర చాన్ద్రాయణాది వ్రతాచరణముకన్న ఉత్కృష్ఠమైనది.





**బ్రహ్మహత్యా సహస్రాణి భ్రూణహత్యాశతానిచ।**
**ఏకో హి ధ్యానయోగశ్చ దహత్యగ్నిరివేన్ధనమ్॥** ౪౧

**టీ॥ అగ్నిః** = అగ్ని; **ఇన్ధనమివ** = ఇంధనమునువలె; **బ్రహ్మహత్యా సహస్రాణి** = వేలకొలది బ్రహ్మహత్యలను; **భ్రూణహత్యాశతానిచ** = వందలాది భ్రూణహత్యలను; **ఏకఃధ్యానయోగః** = ఒక్కటైన ధ్యాన యోగము; **దహతి** = దహించుచున్నది.

**దీపికా:** ధ్యానయోగము సర్వపాపములను హరించుచున్నదని చెప్పుచున్నాడు. అగ్ని ఇంధనమును దహించునట్లు బ్రహ్మహత్యలవలన; భ్రూణహత్యల వలన కలిగిన పాపములను ధ్యానయోగ మొక్కటియే దహించుచున్నది. దేవ పితృలోకమును పొందెడి విషయమున ఋణ ప్రతిబంధకము అజ్ఞానికేగాని జ్ఞానికికాదు. **"సోఽయం మనుష్యలోకః పుత్రేణైన"** అని లోకత్రయమునకు మార్గము శ్రుతిచే ప్రదర్శింపబడెను. పరతత్త్వమును కోరునట్టి జ్ఞానికి దేవాదిలోక ఋణప్రతిబంధకము **"కిం ప్రజయా కరిష్యామః"** సంతానము వలన కలుగునదేమి?యను శ్రుతిచే నిరాకరిం పబడినది. **"ఏతద్ధస్మ వై తత్పూర్వే విద్వాంసః అగ్నిహోత్రం న జుహవాం చక్రుః"** పరమాత్మ నెఱింగిన జ్ఞానులు అగ్నిహోత్రమును చేయుటలేదు. అనుటచే గృహస్థాశ్రమ ధర్మమును అవలంబించుటలేదు. ఇతడు ధర్మ భ్రష్టుడుకాడు. **"సోఽకామయత జాయమే స్యాత్" ఇత్యాదినా పుత్ర విత్తాది పాఙ్క్త లక్షణం కామ్యమేవ"** భార్యా పుత్రులు సంపద మొదలైనవి కామ్యమగుటచే ఇట్టి కామ్యము లేనివాడు. ఋతుస్నాతయైన భార్యతో సఙ్గమింపని గృహాశ్రమి భ్రూణహత్యా ఫలమును పొందుచున్న వాడగు చుండుటచే సత్యమును, పరబ్రహ్మమును, సకల సంసారములకు ఔషధమును, ఊర్ధ్వరేతస్సుగలవాడు, విరూపాక్షుడు, విశ్వరూపుడు,

యోగీశ్వరుడు అగు మహేశ్వరుని, అతడే నేనను నిశ్చయాత్మక బుద్ధితో ధ్యానించు యోగికి ఇట్టిపాపము కలుగుటలేదని చెప్పబడుచున్నది. ఇందులకు శ్రీ శారదారామకృష్ణులు, శ్రీవాసుదేవానంద సరస్వతీత్యాదుల జీవితములే కలియందు తార్కాణము. బ్రహ్మహత్యయనగా అగ్నిపరిత్యాగము. గృహస్థుడైయుండి అగ్నిహోత్రమును చేయనివాడు. జ్ఞానియైన వాడు విధినియమములను అనుసరించి నడుచుకొనవలెనని ఇతః పూర్వమునుండి యెఱింగినవాడు కనుక అతిక్రమించుటలేదు. ఫలాపేక్ష లేక ఆచరింపబడుచుండుటచే అగ్నిహోత్రాదులు ఈతనియందు ప్రయోజనశూన్యమైనవిగా యున్నాయి. ఇట్టివానిని అగ్నిహోత్ర పరిత్యాగము చేసిన వానిగనే పరిగణింపవలెను. ఇట్టి వారినిగూర్చి **"ఏతద్ధస్మవై తత్పూర్వే విద్వాంసః అగ్నిహోత్రం నజుహవాం చక్రుః"** అని కౌషీతకీ బ్రాహ్మణము, **"ఉత్సన్నాగ్నిః అనగ్నికోవా"** అని జాబాలశ్రుతి ప్రత్యేకముగా జెప్పుచున్నవి. ఇట్టివానిని పాపము స్పృశించుటలేదు.

**అధీత్య చతురోవేదాన్ ధర్మశాస్త్రాణి సర్వదా।**
**యోవై బ్రహ్మ నజానాతి దర్వీపాకరసం యధా॥** ౪౨

**టీ॥ యోవై** = ఏవడు; **సర్వదా** = నిరంతరము; **చతురోవేదాన్** = నాల్గువేదములను; **ధర్మశాస్త్రాణి** = ధర్మశాస్త్రములను; **అధీత్య** = అధ్యయనమొనర్చి; **బ్రహ్మ** = పరబ్రహ్మమును; నజానాతి = యెఱుంగడో; **సః** = వాడ; **పాకరసమ్** = వంటయొక్క రుచిని; **దర్వీ** =గరిటె; **యధా** = ఎట్లు; **నజానాతి** = తెలియదో(అట్లే).

**దీపికా:** అట్టి జ్ఞానమోగము అసమానమైనదని చెప్పుచున్నాడు. ఏ మనుష్యుడు వేదములను, ధర్మ శాస్త్రములను నిరంతరము అధ్యయనము చేయుచు, బ్రహ్మచింతన లేనివాడు వంటయొక్క రుచి గరిటకెట్లు





తెలియదో అట్లే పరమాత్మను యెఱుంగడు. అనగా నాల్గువేదములను, ధర్మశాస్త్రములను అధ్యయనమొనర్చి పరమాత్మజ్ఞాన శూన్యుడైనవాడు కామ్యకర్మాద్యభిమానము గలవాడై యజ్ఞయాగాది కర్మలనొనర్చి ధూమాదిమార్గముగా చన్ద్రునిబొంది, కర్మనివృత్తియైన వర్షాదుల వలన ఓషధులజేరి అన్నమై పురుషాగ్నియందు హోమముచేయబడి పురుష దేహమునుండి జీవుడు రేతోరూపమున బయటకు వచ్చి; స్త్రీగర్భమును పొంది కరచరణాద్యవయవములతోగూడి బయటకు వచ్చి; శాస్త్రోక్తము లగు సకలపుణ్యకర్మలు చేయుటకొఱకు తండ్రిచే నియమింపబడి త్రివిధ జన్మములతో సంసారమును బొందుచున్నాడు. ఆత్మస్వరూపము తెలియనివాడగుటచే జననమరణాద్యనేకార్థములను పొందియున్న శరీర బంధమును భేదింప సామర్థ్యములేనివాడై పాకరసమందలి గరిటెవలె నున్నాడు.

**యథా ఖరశ్చన్దన భారవాహీ**
**సారస్య వాహీ న తు చన్దనస్య।**
**ఏవం హి శాస్త్రాణి బహూన్యధీత్య**
**సారం న జానన్ ఖరవ ద్వహేత్సః॥** ౪౩

**టీ॥ యథా** = ఏవిధముగా, **చన్దనభారవాహీ** = చందనభారమును వహించునట్టి, **ఖరః** = గాడిద, **చన్దనస్య** = చందనముయొక్క, **సారస్య** = సారమును, **వాహః** = వహించునట్టిది, **నతు** = కాదో, **ఏవమ్ హి** = ఈవిధముగానే, **బహూని** = అనేకమైన, **శాస్త్రాణి** = శాస్త్రములను, **అధీత్య** = అధ్యయనముచేసి, **సారమ్** = సారమును, **నజానన్** = తెలియని, **సః** = వాడు, **ఖరవత్** = ఖరమువలె, **వహేత్** = వహించును.

**దీపికా:** గంధపుచెక్కలను మోయు గాడిద ఎట్లుదాని పరిమళమును గ్రహింపలేనటుల అనేక శాస్త్రములను అధ్యనముచేసియు అందలి

సారమును గ్రహింపలేని బ్రహ్మణుడు గాడిదవలెనే వాటిని వహించు చున్న వాడుగానున్నాడు. అనగా సంసారచక్రమందే పరిభ్రమించు చున్నాడు.

**అనన్త కర్మశౌచం చ జపోయజ్ఞస్తథైవ చ,**

**తీర్థయాత్రానుగమనం యావతత్త్వం న విన్దతి॥ ౪౪**

**టీ॥ అనన్తకర్మశౌచమ్** = అనన్తములగు కర్మములయొక్క పరిశుద్ధత యును, **జపోయజ్ఞశ్చ** = జపయజ్ఞములును, **తథైవ** = ఆవిధముగానే, **తీర్థయాత్రానుగమనమ్** = తీర్థయాత్రలనుజేయుటయును, **యావత్** = ఎంతవఱకు, **తత్త్వమ్** = వాస్తవమును అనగా బ్రహ్మతత్త్వమును, **నవిందతి** = తెలియడో, **తావత్** = అంతవఱకును, **అనుష్ఠేయమ్** = అనుష్ఠింపదగినది.

**దీపికా:** బ్రహ్మజ్ఞానమెఱుంగు వరకు కర్మానుష్ఠానము చేయతగినదని చెప్పుచున్నాడు. ఎంతవఱకు పరతత్త్వమును తెలిసికొనడో అంతవఱకు అంతములేని కర్మపరిశుద్ధిని, నిత్యకర్మలు, జపము అనగా వేదాధ్యయనము, తీర్థయాత్రాదులు చేయుటతగినది. వీటిచే అన్తఃకరణ శుద్ధి కలుగును. మనుష్యులకు జ్ఞానమను విశేషగుణము కలదు. ఇది వేదశాస్త్రాది అధ్యయనము, నిత్యకర్మలు, జపము, తీర్థయాత్రాదుల సేవనరూప జన్యమైన అన్తఃకరణశుద్ధి ద్వారా లభించును. జ్ఞానము లభించువఱకు ఇవి అనుష్ఠేయమే.

**గవా మనేక వర్ణానాం క్షీరం స్యాదేకవర్ణకమ్।**

**క్షీరవదృశ్యతే జ్ఞానం దేహినాఇు గవాం యథా॥ ౪౫**

**టీ॥ గవామ్** = గోవులు, అనేకవర్ణానామ్ = అనేక వర్ణములైనను; **క్షీరమ్** = పాలు; **యథా** = ఎట్లు; **ఏకవర్ణకమ్** = ఒకేవర్ణముగ; **స్యాత్**





= అగునో; దేహినామ్ = ప్రాణులకు; జ్ఞానమ్ = జ్ఞానాత్మ; గవామ్ = గోవులయొక్క; క్షీరం యథా = పాలు ఎట్లో; (తథా) దృశ్యతే = (అట్లే ఒకే ఆకారముగలదై) కనబడుచున్నది.

**దీపికా:** ఉపాధులు వేరైనను ఆత్మయొక్కటియేయని చెప్పుచున్నాడు. గోవులవర్ణములందు నానాత్వమున్నను క్షీరము ఏకాకారముగనే యుండును. ఇవ్విధముననే శరీరధారులందరకు ఆత్మయొక్కటియే. కావున ఆత్మ పాలవలెను, దేహములు గోవులవలెను వున్నవని గ్రహింప వలెను.

**అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనామ్**

**ద్వేపదే బన్ధమోక్షాయ న మమేతి మమేతిచ,**

**మమేతి బధ్యతే జన్తుర్నమమేతి విముచ్యతే॥ ౪౬**

**టీ॥ అహమ్** = నేను; **బ్రహ్మేతి** = బ్రహ్మనెడి; **నియతమ్** = నియమము; **మహాత్మనామ్** = జ్ఞానులకు; **మోక్షహేతుః** = మోక్షకారణము; **నమమేతి** = నాదికాదు; **మమేతి** = నాదియను; **ద్వేపదే** = రెండుమాటలు; **బన్ధమోక్షాయ** = బన్ధమోక్షములకొఱకు; **జన్తుః** = జంతువు; **మమేతి బధ్యతే** = మమత్వముచే బంధింపబడుచున్నది; **నమమేతి విముచ్యతే** = నిర్మముత్వముచే విడువబడుచున్నది.

**దీపికా:** బంధమోక్ష స్వరూపమును చెప్పుచున్నాడు. మోక్షము కొరకు నేను బ్రహ్మమను నిశ్చయబుద్ధిగలవారు జ్ఞానులు. నాది నాదికాదు అను రెండుపదములే బంధమోక్షములకు కారణము. నాది నాదికాదు అనువానిచే ద్వైతభావన కలుగుచున్నది. ఇది భయమును బంధమును కలుగజేయుచున్నది. జీవుడు మమత్వ బుద్ధిచే సంసారమున చిక్కుకొను చున్నాడు. నిర్మమత్త్వముచే సంసారమునుండి ముక్తుడగుచున్నాడు.

**మనసో హ్యున్మనీ భావాద్వైతం నైవోపలభ్యతే।**
**యదాయాత్యున్మనీ భావం తదా తత్పరమం పదమ్॥** ౪౭

**టీ॥ మనసః** = మనసునకు; ఉన్మనీ **భావాత్** = ఉన్మనీస్థితి వలన; **ద్వైతం నైవోపలభ్యతే** = రెండవది పొందబడుటలేదు; **యదా** = ఎప్పుడు; **ఉన్మనీభావమ్** = ఉన్మనీస్థితిని; **యాతి** = పొందుచున్నాడో; **తదా** = అప్పుడు; **తత్** = ఆ ప్రసిద్ధంబగు; **పరమమ్** = శ్రేష్ఠమైన; **పదమ్** = పదమును; **యాతి** = పొందుచున్నాడు.

**దీపికా:** మనసునకు ఉన్మనీస్థితి కలుగుటవలన రెండవది పొంద బడుట లేదు. ఖేచరమైన చిత్తము సమస్త లౌకక విషయములనుండి లాగివేయబడి ఉన్మనియగును. ఇచ్చట ద్వైతభావ ప్రకాశములేదు. సఙ్కల్పవికల్పాత్మక మగు మనస్సు, తత్కార్యభూతమగు జగత్తు వీనిని నశింపజేసినవాడు ఉన్మనుడు. ఇది అజపోపసంహారమని చెప్పబడినది. అప్పుడు సూక్ష్మ రూపముకూడా పరిత్యజింపబడి ప్రసిద్ధమగు శ్రేష్ఠమైన పరమాత్మ పదమును పొందుచున్నాడు. ఇది అమనస్కస్థితి **"కాష్ఠవ జ్ఞాయతే దేహ ఉన్మన్యావస్థయా ధ్రువమ్"** ఉన్మాన్యవస్థను పొందిన ద్వైతభావన శమించి ఉపాధి కాష్ఠమువలె తోచును. ఇది సర్వదేవతా కారణభూతమైన స్వరూపము. ఇట్టి యోగి త్రిమూర్తులను సహితము అనుగ్రహింపగల సామర్థ్యము కలవాడు.

**హన్యాన్ముష్టిభిరాకాశం క్షుధార్తః ఖణ్డయేత్తుషమ్।**
**నాహం బ్రహ్మేతి జానాతి తస్యముక్తిర్నజాయతే॥** ౪౮

**టీ॥ క్షుధార్తః** = ఆకలిచే బాధపడువాడు; **ముష్టిభిః** = పిడికిళ్ళచే; **ఆకాశమ్** = ఆకాశమును; **హన్యత్** = కొట్టుటవలన; **తుషమ్** = నీటిని; **ఖణ్డయేత్** = ఖండించుటవలను; **యః** = ఎవ్వడు; **అహమ్** = నేను; **బ్రహ్మేతి** = బ్రహ్మనని; **నజానాతి** = ఎఱుగడో; **తస్య** = వానికి; **ముక్తిః** = మోక్షము; **నజాయతే** = లేదు.

**దీపికా:** క్షుధార్తుడు ముష్టిఘాతములచే ఆకాశమును కొట్టుట వలనను, నీరు చిలుకుట వలనను ఆకలిచే విడువబడుటలేదు. అట్లే **'సోఽహం'** జ్ఞానములేని వానికి సకల శాస్త్రములు ప్రయోజనశూన్యములై ముక్తి కలుగుటలేదు. దానంజేసి బ్రహ్మవిచారము చేయనివానికి అంతయు నిష్ప్రయోజనమని చెప్పుచున్నాడు.

**ఇతి శ్రీమన్మహాభారతే అశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీభగవదర్జున సంవాదే ద్వితీయోధ్యాయః**



శ్రీ రామలాల సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీభగవదుత్తరగీతా

## తృతీయోధ్యాయః

**యోగీవ్యర్థక్రియాలాప పరిత్యాగేన శాన్తధీః।**
**తృతీయో శరణంయాతి హరిమేవేతి కీర్త్యతే॥ ౧**

**టీ॥ యోగీ** = యోగియగువాడు, **వ్యర్థక్రియాలాప** = వ్యర్థమైన క్రియలను, సంభాషణములను, **పరిత్యాగేన** = విడుచుటచే, **శాన్తధీః** = శాంతించిన మనోవికారములు కలవాడై, **హరిమ్** = నారాయణుని, **శరణంయాతి** = శరణుపొందుచున్నాడు. **ఇతి** = అని, **తృతీయే** = తృతీయాధ్యాయమున, **కీర్త్యతే** = చెప్పబడుచున్నది.

**దీపికా:** యోగియగువాడు వ్యర్థమైన క్రియలను,సంభాషణలను పరిత్యజించినవాడై, **"వాసోబహూనాం కలహో భవే ద్వార్తా ద్వయోరపి"** జనసంగమువలన కలహము కలుగునని, మాటలు కలుగుటకు ఇద్దరు చాలని భాగవతవచనము. ఇవి యోగాభ్యాసమునకు ఘాతకలిగించును, కనుక యోగి సర్వప్రయత్నములచే నిస్సంగుడైయుండవలెను. శాంతించిన మనోవికారములుగలవాడై **"ఆత్మక్రీడా ఆత్మరతిః క్రియావా నేష బ్రహ్మవిదాంవరిష్ఠః"** ఆత్మక్రీడయును, ఆత్మయందు రమించుట అను క్రియలుగలవడై, అజ్ఞానముచే పుట్టిన మిథ్యాజ్ఞాన స్వరూపమైన చీకటినిహరించు బ్రహ్మమును శరణుపొందుచున్నాడని ఈ ఆధ్యాయమున చెప్పబడుచున్నది.

॥భగవానువాచ॥

**అనన్త శాస్త్రం బహువేదితవ్య**
**మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః।**





**యత్సారభూతం తదుపాసితవ్యం**
**హంసో యథాక్షీర మివామ్బుమిశ్రమ్॥ ౨**

**టీ॥ అనన్త శాస్త్రమ్** = అంతులేని శాస్త్రసముదాయము; **బహు** = విస్తారమని; **వేదితవ్యమ్** = తెలుసుకొనదగినది; **కాలః** = కాలము; **అల్పశ్చ** = స్వల్పమైనది; **విఘ్నాః** = విఘ్నములు; **బహవః** = అనేకములు; **హంసః** = హంస; అమ్బుమిశ్రం = ఉదకముతో కలిసిన; **క్షీరమివ** = పాలను వలెను; **సారభూతమ్** = సారముకలదగు; **యత్** = ఏదికలదో; **తత్** = అది; **ఉపాసితవ్యమ్** = సేవింపతగినది.

**దీపికా:** కేవల శాస్త్రాధ్యయనాదులు వ్యర్థమని ఆత్మానుసంధానమునకు ఉపయుక్తమగు సాధనముఖ్యమని చెప్పుచున్నాడు. శాస్త్రములు అనంతములు, మనుష్యుని ఆయుఃకాలము స్వల్పమైన్నది. **"పుంసో వర్షశతం హ్యాయుః"** అను న్యాయానుసారము ఈ శాస్త్రముల నభ్యసించి తత్త్వము నెఱుంగుటకు మానవుని కాలపరిమితి అల్పము. ఈ శాస్త్రాభ్యాసముచే జనించిన ప్రజ్ఞ మోహకారకమై తత్త్వమును గ్రహింపనీయుట లేదు.

**శ్రు॥ ప్రథమాభ్యాసకాలే తు విఘ్నాః స్యుశ్చతురానన**
**ఆలస్యం కత్థనం ధూర్తగోష్ఠీ మన్త్రాది సాధనమ్॥**
**ధాతుస్త్రీ లౌల్యకాదీని మృగతృష్ణామయాని వై**

తత్త్వజ్ఞాన సముపార్జనమున సోమరితనము, ఆత్మస్తుతి, దుష్టులతో సంభాషణము, మన్త్రాదిసాధనములు, స్వర్ణవేది, స్త్రీలోలత్వము మున్నగు విఘ్నములు అనేకములుగ కలుగును. వీటిని మృగతృష్ణాసమమని గ్రహించి హంస నీటిని విడచి పాలను స్వీకరించునట్లు శాస్త్రములయందలి సారమునే గ్రహించవలెను. ఆత్మానుసన్ధానముకన్న అన్యమైన శాస్త్రజ్ఞానము వ్యర్థము.

**పురాణం భారతం వేద శాస్త్రాణి వివిధాని చ।**
**పుత్రదారాది సంసారో యోగాభ్యాసస్య విఘ్నకృత్॥ ౩**

**టీ॥ పురాణమ్** = భాగవతము మొదలగు పురాణములును; **భారతమ్** = భారతమును; **వేదః** = వేదము; **వివిధానిశాస్త్రాణి** = అనేకములైన శాస్త్రములు; **పుత్రదారాది సంసారః** = పుత్రులు భార్య మొదలగు సంసారము; **యోగాభ్యాసస్య** = యోగాభ్యాసముయొక్క; **విఘ్నకృత్** = విఘ్నమును జేయును.

**దీపికా:** పాణ్డిత్య ప్రకటనము బ్రహ్మోపాసనకు ప్రతిబంధకముగాన దానిని విసర్జింప వలయునని తెలుపుచున్నాడు. అష్టాదశపురాణములు, ఉపపురాణములు, భాగవతముతో సహా భారతము, వేదముయొక్క పూర్వోత్తర రూపములు, అనేకములులైన శాస్త్రములు. పుత్ర, మిత్ర, కళత్రాది నానారూపముల ప్రకాశించు సంసారము ఈ సర్వము యోగాభ్యాసమునకు విఘ్నము కలుగజేయుచున్నవి.

**'శ్రు. గురు శాస్త్రోక్త మార్గేణ స్వానుభూత్యా చ చిద్ఘనే బ్రహ్మైవాహమితి జ్ఞాత్వా'** పురాణేతిహాసముల యందలి స్థూలమైన కథాంశమున దృష్టి కలిగి యుండుట; రాగద్వేషములకు కారణమగుచున్న సంసారము, ఇవి యోగసాధనకు ప్రతిబంధకములే యగుచున్నవి.

భారతము శతాధిక గీతలచే బ్రహ్మతత్త్వమును పునఃపునః ప్రతిపాదిస్తూ బుద్ధిని నిశ్చయాత్మక మొనర్చుటకే ప్రకటింపబడినది. ఇట్లే పురాణములు తత్త్వమును ప్రతిపాదింపదలచి కథను ఆలంబనగా గైకొనినవి. అంతియేకాని రమ్యమైన వాక్యనిర్మాణ రీతులను, అలఙ్కార ములను, లోకాలోక వర్ణనలను బుద్ధివిక్షేపాన్ని కలిగించు స్త్రీల అఙ్గాఙ్గ వర్ణనలను పరిచయం చేయటానికికాదు. శాస్త్ర, గురువాక్య సముద్భూత





మైన యోగము (స్వానుభవము) నేను చిద్ఘనమగు బ్రహ్మమునే అయియున్నాను అను జ్ఞానమును కలిగించును.

**శ్రు. అనభ్యాసవతశ్చైవ వృథాగోష్ఠ్యా నసిద్ధ్యతి। తస్మాత్సర్వ ప్రయత్నేన యోగమేవ సదాఽభ్యసేత్॥** అభ్యాసము లేనందువలన, వృథాగోష్ఠుల వలన బ్రహ్మజ్ఞానము సిద్ధింపదు తత్త్వవిచారాది సర్వప్రయత్నములతో యోగమును సదాఅభ్యసింపవలెనని శ్రుతియే తెల్పుచున్నది. బ్రహ్మమును గూర్చి అభ్యాసానుభవములేని కేవల వాచాలురు ప్రతిబింబ ఫలములచేత సంతోషించు వారుగానున్నారు.

**ఇదం జ్ఞానమిదం జ్ఞేయం యస్సర్వం జ్ఞాతుమిచ్ఛతి।**
**అపి వర్షసహస్రాయుః శాస్త్రార్థం నాధిగచ్ఛతి॥ ౪**

**టీ॥ యః** = ఎవడు; ఇదమ్ = ఇది; **జ్ఞానమ్** = జ్ఞానమనియు; **ఇదమ్** = ఇది; **జ్ఞేయమ్** = తెలిసికొనదగినదనియు; **సర్వంజ్ఞాతుమ్** = సర్వమును ఎఱుగుటకు; **ఇచ్ఛతి** = కోఱునో (సః = వాడు); **వర్షసహస్రాయుఃఅపి** = వేయిసంవత్సరముల ఆయుర్దాయము కలవాడై నప్పటికి; **శాస్త్రార్థమ్** = శాస్త్రప్రయోజనమును; **నాధిగచ్ఛతి** = పొందలేడు.

**దీపికా:** గురుసమక్షమున ఆత్మానాత్మ విచారము చేయతలంపు లేనివాడు ఎన్నిశాస్త్రములను అధ్యయన మొనర్చినను ప్రయోజనము లేదని భగవానుడు చెప్పుచున్నాడు. **"జ్ఞానమ్ బన్ధః"** ఎవడు ఇది జ్ఞానము (తెలియుట) ఇది జ్ఞేయము (తెలియతగినది) అని సమస్తమును తెలుసుకొనుటకు ఇచ్ఛగించునో వాడు కేవల శబ్దశ్రవణ మాత్రజన్య మైన అర్థస్ఫురణ వలన త్రిపుటి సంబంధముగలవాడై శాస్త్ర ప్రయోజన మును పొందలేడు. ఇన్ద్రియములు విషయములను గ్రహించునప్పుడు ఆ విషయ సంబంధజ్ఞానము కలుగును. దశేన్ద్రియముల చేతను అనేక

జ్ఞానములు ప్రాప్తించుచున్నవి. వీటిచే తురీయజ్ఞానము నష్టమగుచున్నది. జన సామాన్యమున త్రిపుటి సంబంధమునందు ఐక్యము లేకపోవుటచే అనగా జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము వీటిమధ్య భేదముండుటచే తజ్జన్యమైన చిత్తవృత్తులచే ద్వైతము భాసమానమై సంశయభావన, విపరీత భావన యనెడు ప్రతిబన్ధకములు ఏర్పడి సుఖవినాశకరమై బన్ధమగుచున్నది.

యోగులయందు త్రిపుటిసంబంధమైన ఐక్యముచే జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము వీటిమధ్య అభేదము సిద్ధించి సర్వేన్ద్రియములచే కలిగిన అనేక జ్ఞానములు (బ్రహ్మవిషయకమైన) ఏకరూపతనుపొంది, శబ్దాది విషయములచే ఆకర్షింపబడి అభాసయైన తురీయజ్ఞానము పునః భాసమానమగుచున్నది. ఇది సమాధి సుఖమని శివసూత్రవ్యాఖ్యయందు చెప్పబడినది. **"అతోయుక్తం నిష్క్రియ బ్రహ్మాత్మ విజ్ఞానస్య సమాధినాఽ ప్రతిబద్ధతాం ప్రాపితస్యావిద్యా నిశ్శేష నిర్మూలకత్వం"** అని జ్ఞానమునకు గల సంశయభావన, విపరీతభావన యనెడు ప్రతిబన్ధములు సమాధి చేతనే నిర్మూలింపబడును అని చెప్పబడినది. ఇట్టి యోగులకు మాత్రమే శాస్త్రప్రయోజనము సిద్ధించుచున్నది. అన్యులకు జ్ఞానము బన్ధమై జననమరణరూప సంసారమున బద్ధుడగుచున్నాడు.

ఈ జ్ఞానములన్నియు తురీయమున ఐక్యముగటను ఐక్య సంపత్కరమని చెప్పబడుచున్నది. ఇది సంపత్కరీవిద్యగా లలితోపాఖ్యాన మునందు గలదు.

**విజ్ఞేయోఽక్షర తన్మాత్రం జీవితఞ్చాపి చఞ్చలమ్।**
**విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతామ్॥** ౫

**టీ॥ అక్షర తన్మాత్రమ్** = సత్తామాత్రమైన పరమాత్మను; **విజ్ఞేయ** = గ్రహించి; **జీవితమ్** = జీవితమును; **చఞ్చలమ్** = స్థిరముకానిదానినిగ





(తెలుసుకొని); **శాస్త్రజాలాని** = శాస్త్రసముదాయములను; **విహాయ** = విడిచి; **యత్సత్యమ్** = సత్యమైనదేదో; **తదుపాస్యతామ్** = దానిని ఉపాసన చేయవలయును.

**దీపికా:** నాశరహితుడగు పరమాత్మను తెలుసుకొని, జీవితము క్షణభంగురమని గ్రహించి, బుద్ధివిక్షేపమునకు కారణమగుచుండుటచే శాస్త్రసముదాయములను విడిచి, అనగా అకారాది క్షకారాన్త మాతృకా చక్రమందలి సర్వవర్ణములు, వర్ణసంయోగముచే ఏర్పడిన సకల పదములు, పదముల సంయోగముచే ఏర్పడుచున్న నానావిధ వాక్య సముదాయము, సాఙ్ఖ్యశాస్త్రము సర్వము అనన్తత్వమునే ప్రతిపాదించు చుండుటచే అనన్తము, శాశ్వతము సత్యమగు (తత్త్వమునే) బ్రహ్మమునే ఉపాసన చేయవలయును.

**పృథివ్యాం యాని భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్।**
**జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యా కిమ్ప్రయోజనమ్॥** ౬

**టీ॥ పృథివ్యామ్** = భూమియందు; **యాని** = యే; **భూతాని** = భూతములు కలవో; **తత్** = ఆ భూతముల సముదాయము; **జిహ్వోపస్థ నిమిత్తకమ్** = జిహ్వోపస్థలు నిమిత్తముగాకలవి; **జిహ్వోపస్థపరిత్యాగే** = జిహోపస్థలతో పరిత్యాగము కలుగుచుండగా; **పృథివ్యా** = పృథివితో; **కిమ్ప్రయోజనమ్** = ఏమి ప్రయోజనము

**దీపికా:** స్వాధీనమైన ఇన్ద్రియములు కలవానికి వైరాగ్యము స్వయము గానే కలుగునని తెలుపుచున్నాడు. పృథ్వియందలి ప్రాణులు జిహ్వోపస్థలు నిమిత్తముగా గలవారు. జిహ్వోపస్థలనుత్పత్తి పొందించువారుగానున్నారు. సమస్తములైన విషయభోగములకు ఇవియే కారణమైయున్నవి. మొదటగా అన్తఃకరణశుద్ధికి ఆహారము శుద్ధముగా నుండవలెనని

ఛాన్దోగ్యము చెబుతోంది. **"ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః"** జిహ్వను విడుచుట అనగా రుచిభేదాన్ని గ్రహింపకుండుట. జీవించుట కొఱకైన ఆహారాన్ని ఏవిధంగా సంపాదించాలి అనగా **"విధివిశాత్ప్రాప్తేన సన్తుష్యతాం"** అంటారు శఙ్కరులు. ఈ ప్రకృతిలో ఆహారం సిద్ధవస్తువని పణ్డితుల మతము. సృష్టిలో సర్వజీవులందు ఇది అనుభవములోనున్నదే. మానవుడు మాత్రమే ఈ నియమాన్ని ఉల్లఙ్ఘించినట్లుగా కనబడుతుంది. ఈ జిహ్వను తృప్తిపరచుటకు మానవుడు అనుల్లఙ్ఘనీయమైన విధి నియమాలను కూడ విస్మరించుట జరుగుచున్నది. ఇట్టి జిహ్వను ప్రయత్నపూర్వకముగానైన శాంతింప జేయుటకొఱకు **"హస్తప్రాప్తఇచ్ఛ భక్షయేత్"** భిక్షాన్నమును భుజించుట అదియు కరపాత్రమునందు దొరికిన దానిని భుజించుచుండవలెనని శ్రుతి విధించుచున్నది. ఇట్టి భిక్షాన్నము చేతను, విధివశమున ప్రాప్తించిన ఆహరముచేతను వీడు సర్వభూతములందు వైరములేనివాడై సర్వభూత హితైషియగును. **శ్రు. "నిర్వైరేణ సమం పశ్యన్ద్విజగోఽశ్వమృగాదిషు"** అని నారదపరివ్రాజకోపనిషత్తు ఈ విషయాన్నే స్పష్టముచేయుచున్నది. **శ్రు. మాంసాసృక్పూయ విణ్మూత్ర స్నాయు మజ్జాస్థిసంహతే। దేహే చేత్ప్రీతిమా న్మూఢో భవితా నరకేఽపిసః॥** మాంసము, రక్తము, మలమూత్రములు, నరములు, మజ్జ, ఎముకలు మొదలైనవాని సమూహమైన దేహమునందు అభిమానముగల మూఢుడు నరకమును పొందువానినిగా శ్రుతి పల్కుచున్నది. ఇట్టి అభిమానమును దూరము చేయుటకొఱకు శ్రుతి మాతృవాత్సల్యముచే ఉపస్థాస్వరూప స్వభావాలను వివరిస్తోంది. **శ్రు. స్త్రీణామవాచ్యదేశస్య క్లిన్న నాడీ వ్రణస్యచ। అభేదేఽపి మనోభేదాజ్జనః ప్రాయేణ వఞ్చ్యతే॥ చర్మఖణ్డం ద్విధా భిన్న మపానోద్గార దూషితమ్। యేరమన్తి నమస్తేభ్యః సాహసం కిమతః పరమ్॥** స్త్రీలయొక్క





గుహ్యప్రదేశమునకు తడిసిన నాడులతోకూడిన వ్రణమునకు భేదము లేదని మోహవశమున జనులు మనోభేదముచే తరచుగా మోసపోవు చున్నారని, అపానవాయువచే దూషితమైనది, రెండుగా చీలినదియైన చర్మఖండము మాత్రమేకాని ఇందు సౌన్దర్యమెంత మాత్రములేదని పలుకుచున్నది. ఇవ్విధమున సమస్తములైన విషయభోగములకు కారణమైన జిహ్వోపస్థలయందు ఎవనికి హేయభావము కలిగునో వాడు చపలత్వం లేనివాడగుటచే దేహాభిమాన రహితుడగు అట్టివానికి వైరాగ్యము స్వయముగనే సిద్ధించుచున్నది. ఇట్టి వానికి ప్రపఞ్చముతో పనిలేదు. శ్రు. **యస్యైతాని సుగుప్తాని జిహ్వోపస్థోదరం కరః। సంన్యసేదకృతో ద్వాహో బ్రాహ్మణో బ్రహ్మచర్యవాన్॥** జిహ్వేన్ద్రియ గుహ్యేన్ద్రియములను వశమందుంచుకొన్న వాడే బ్రహ్మనిష్ఠుడని శ్రుతి వచనము.

**తీర్థానితోయరూపాణి దేవాన్పాషాణమృణ్మయాన్।**
**యోగినో న ప్రపద్యన్తే ఆత్మధ్యాన పరాయణాః॥** ౭

**టీ॥ ఆత్మధ్యాన పరాయణాః** = ఆత్మధ్యాన పరాయణులగు; **యోగినః** = యోగులు; **తీర్థాని తోయపూర్ణాని** = తీర్థములను జలపూర్ణములుగాను; **పాషాణ మృణ్మయాన్** = రాళ్ళతోను మట్టితోను చేయబడిన; **దేవాన్** = దేవతలను; **న ప్రపద్యన్తే** = సేవింపరు.

**దీపికా:** ఆత్మధ్యానాసక్తులకు తీర్థక్షేత్రములతో పనిలేదని ఉపదేశించుచున్నాడు. ఆత్మధ్యాన పరాయణులగు యోగులు ఉదక రూపములయిన తీర్థములనుసేవింపరు. **"తీర్థభ్రాన్త్యధమాధమా"** అని శ్రుతికూడ దీనిని నిరసించినది. దేహమునందుగల శిరస్సుమున్నగు అవయవములనే పవిత్ర తీర్థస్థానములుగా భావనచేయవలయునని ఉపనిషన్మతము.

శ్రు. శ్రీపర్వతం శిరస్థానే కేదారం తు లలాటకే।

వారాణసీం మహాప్రజ్ఞ భ్రువోర్ఘ్రాణస్య మధ్యమే॥
కురుక్షేత్రం కుచస్థానే ప్రయాగం హృత్సరోరుహే।
చిదమ్బరం తు హృన్మధ్యే ఆధారే కమలాలయమ్॥
ఆత్మతీర్థం సముత్సృజ్య బహిస్తీర్థాని యోవ్రజేత్।
కరస్థం సమహారత్నం త్యక్త్వా కాచం విమార్గతే॥
బావతీర్థం పరం తీర్థం ప్రమాణం సర్వకర్మసు।
అన్యథాఽఽలిఙ్గ్య కాన్తా అన్యథాఽఽలిఙ్గ్యతే సుతా॥
తీర్థాని తోయపూర్ణాని దేవాన్ కాష్ఠాది నిర్మితాన్।
యోగినో నప్రపద్యన్తే స్వాత్మ ప్రత్యయ కారణాత్॥
బహిస్తీర్థాత్పరన్తీర్థ మన్తస్తీర్థం మహామునే।
ఆత్మతీర్థం మహాతీర్థం మన్యతీర్థం నిరర్థకమ్॥
చిత్త మన్తర్గతం దుష్టం తీర్థస్నానైర్నశుద్ధ్యతి।
శతశోఽపి జలైర్ధౌతం సురాభాణ్డమివాశుచి॥
విషువాయనకాలేషు గ్రహణే చాన్తరేసదా।
వారాణస్యాదికే స్థానే స్నాత్వా శుద్ధోభవేన్నరః॥
జ్ఞానయోగ పరాణాం తు పాద ప్రక్షాలితఙ్జలమ్।
భావశుద్ధ్యర్థ మజ్ఞానం తత్తీర్థం మునిపుఙ్గవ॥

శిరస్సును శ్రీశైలముగా, లలాటమును కేదార క్షేత్రముగా, కనుబొమ్మల యొక్కయు, నాసికయొక్క మధ్యభాగమును కాశీ క్షేత్రముగా, కుచస్థానము కురుక్షేత్రముగా, హృదయము ప్రయాగక్షేత్రముగ, హృదయంతర్భాగము చిదంబర క్షేత్రముగా, మూలాధారము లక్ష్మీనివాసము (కొల్హాపురము) గా భావనచేయవలెనని ఉపనిషత్తు పలుకుచున్నది. ఆత్మతీర్థములను సేవింపక వెలుపలనున్న తీర్థక్షేత్రములనుగూర్చి ఎవ్వడు (తీర్థయాత్రా రూపముగా) శ్రమపడునో అట్టివాడు మూర్ఖుడని శ్రుతి ప్రమాణీకరించు





చున్నది. భావమునకే (తత్త్వమునకే), ప్రాధాన్యముకాని బాహ్యవ్యాపారమునకు కాదనునది నిశ్చయము. యోగీశ్వరులగు వారలకు ఆత్మయందు దృఢమైన విశ్వాసముకలదు కావున వారు బహిస్తీర్థములను జల మయములుగను, దేవతలను కాష్ఠాది వినిర్మితములుగను భావింతురు. **పాషాణ లోహమణి మృణ్మయ విగ్రహేషు పూజా పునర్జనన భోగకరీ ముముక్షోః। తస్మాద్యతి స్స్వహృదయార్చన మేవకుర్యాద్బాహ్యార్చనం పరిహరే దపునర్భవాయ॥** శిలామయములు, లోహమయములు, మణి మయములు, మృత్తికామయములు అగు విగ్రహములను వదలి తన హృదయమందలి పరమాత్మనే అర్చించవలెనని శ్రుతి ఉత్తమాధికారులకు విధించుచున్నది. మూఢులు మాత్రమే పవిత్రతీర్థములని, దేవతలని భావింతురు. లోపలహృదయము దుష్టమైయుండి బాహ్యతీర్థములందు స్నానము చేసినను కల్లుకుణ్డవలే పవిత్రుడు కాజాలడని ప్రమాణీకరించుచున్నది. భావశుద్ధిగల యోగులు అన్తఃతీర్థ సేవనయందే దృష్టిగలవారు. అన్యులకు ఇట్టివారి పాదప్రక్షాళనతీర్థము సేవింప తగినదిగాయున్నది. దీనిచే సామాన్యులు కూడ భావశుద్ధిగల వారలగుచున్నారు. అటుల కానివారు గంగా గోదావర్యాది నానాసంజ్ఞల తెలియబడుచున్న బాహ్య జలమునందలి మత్స్యకూర్మది ప్రాణిసములే అగుచున్నారు.

**అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్।**
**ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్॥** ౮

**టీ॥ ద్విజాతీనామ్** = ద్విజులకు; **దేవః** = దేవుడు; **అగ్నిః** = అగ్ని; **మునీనామ్** = మునులకు; హృది = హృదయమందు; **దైవతమ్** = దేవుడు కలదు; **స్వల్ప బుద్ధీనామ్** = మూఢులకు; **ప్రతిమా** = విగ్రహమే దేవుడు; **సమదర్శినామ్** = సమదృష్టికల వారలకు; **సర్వత్ర** = అంతటను దేవుడున్నాడు.

**దీపికా:** ద్విజులకు అగ్నియే దైవము. కర్మిష్ఠియగు గృహాశ్రమి నిత్య నైమిత్తికములగు అగ్నిని ఐశ్వర్యముకొఱకు ఉపాసించుచున్నాడు. తన్మూలకమైన సంపదచే ప్రత్యహము ఔపాసన, బ్రహ్మయజ్ఞ, వైశ్వదేవ అతిథిపూజాదికాలను చేయుచు స్వర్గాది లోకములయందు దృష్టికల వాడగుచున్నాడు. **"అతిథి స్స్వర్గసఙ్క్రమః"** అని కర్మమార్గానుయాయులకు స్మృతులు మార్గము చూపుచున్నాయి. శ్రు. **అగ్నేనయ సుపథారాయే అస్మాన్, విశ్వాని దేవవయునాని విద్వాన్। యుయోధస్య జ్జుహురాణ మేనః భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ॥** అతిథిపూజాది సర్వకర్మలు నిర్విఘ్నముగా సాగుటకొఱకు గృహాశ్రమి "ఓ అగ్నీ! నీవు సమస్తము తెలిసినవాడవు. మా పాపములను పోగొట్టి మంచిమార్గమున మమ్ము ప్రవేశబెట్టుము. మాకు సంపదలు లభింపజేయుము నీకు నమస్సులు" అని ఐశ్వర్యప్రదమగు అగ్నినే దైవముగా తలంచుచున్నాడు.

**స్మృ॥ వైశ్వదేవ విహీనాయే ఆతిథ్యేన బహిష్కృతాః।**
**సర్వేతి నరకం యాతి కాకయోనిం వ్రజన్తి చ॥**

కర్మనిష్ఠుడగు గృహాశ్రమి ఏకారణము చేతనూ ఈమార్గమును విస్మరింప కుండుటకు వైశ్వదేవ అతిథిపూజాది షట్కర్మలను విడువకుండుటకు; ఇట్లు చేయనివాడు నరకమును, హీనజన్మలను పొందుననితెలిపి అగ్న్యా దానములందు ప్రవర్తింపజేయుచున్నవి. **"మునీనాం హృది దైవతం"** మునులకు హృదయమందు దైవముకలడు. శ్రు. **సవా ఏష ఆత్మాహృది తస్యైత దేవ నిరుక్తం హృద్యయమితి। తస్మాద్ధృదయ మహరహర్వా ఏవం విత్స్వర్గం లోకమేతి.** ఈ ఆత్మ హృదయమందే కలదని ఛాన్దోగ్యం ప్రమాణీకరిస్తోంది. ఈ హృదయకమల మధ్యమునగల దైవము నిర్మలుడు, దుఃఖరహితుడు, చింతింపనలవికానివాడు, అగోచరుడు, అనన్తుడు, మఙ్గళకరుడు అమృతస్వరూపుడు, మాయకు కారణభూతుడు,





ఆదిమధ్యాన్త రహితుడు, అద్వితీయుడు, సర్వవ్యాపి, చిదానన్ద స్వరూపుడు, రూపరహితుడు. శ్రు. **హృత్పుణ్డరీకం విరజం విశుద్ధం, విచిన్త్య మధ్యే విశదం విశోకం, అచిన్త్య మవ్యక్త మనన్తరూపం, శివం ప్రశాన్తమమృతం బ్రహ్మయోనిం, తదాది మధ్యాన్త విహీన మేకం, విభుం చిదానన్ద మరూప మద్భుతమ్॥**. ఇట్టి సర్వసాక్షి, తమస్సునకు అన్యమైనవాడు, సమస్తప్రాణులకు ఆదికారణుడైన పరమాత్మను పొందినవాడు ముని యనబడుచున్నాడు. శ్రు. **మునిర్గచ్ఛతి భూత యోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్॥** వీరు సర్వకర్మోపరతిచే శుద్ధాన్తః కరణులులైన యోగులు వేదాన్తవిజ్ఞానులగు వీరికి హృదయగుహయందే పరమాత్మ ప్రకాశించుచున్నాడు. **"స్వల్ప బుద్ధీనాం ప్రతిమా"** అజ్ఞులకు విగ్రహమే దేవుడు. వీరు పరిచ్ఛినదృష్టిగలవారు. ద్వైతులు. శ్రు. **"సర్వవ్యాపిన మాత్మానం క్షీరేసర్పిరివార్పితమ్"** పాలలో నేయివలె సర్వవ్యాపిగానున్న భగవంతుని, ఏకరూపుడు అపరిచ్ఛిన్నుడైన పరమాత్మను తనకంటె వేఱైనదిగా భావిస్తూ, ఆనేకత్వాన్ని కరచరణా ద్యవయవములను పరికల్పించి ఆ పరమాత్ముని పరిచ్ఛినునిగావించు చున్నారు. వీరు **"నేహనానాస్తి కిఞ్చన" "ఏకధైవాను ద్రష్టవ్యా"** అను శ్రుతివాక్యములకు ఘాత కలిగించుచు మృత్యుభయమును పొందు చున్నారు.

**అథయోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథాపశు॥** ఎవడు తనకంటే వేఱైన దేవత కలదని, అదివేఱు తానువేఱని భావించి అన్యదేవతోపాసనచేయు వానిని బృహదారణ్యకం పశువని సంభోదించింది. శ్రు. **"యథాసోమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"** మృణ్మయములైన విగ్రహములన్నియు మృత్తికయే

అని నామరూపములు మాత్రమే వేఱు అని, మృత్తికమాత్రమే సత్యమని తెలియవలెను. అనగా ఈ ప్రపఞ్చము బ్రహ్మమయమై యున్నదని, బ్రహ్మమే సత్యమని ఎఱుగవలెను. ఇట్లుగాక మఱియొక విధమున భావనచేయువారు (ద్వైతభావన కలవారు) విగ్రహరూపులైన ఇతర దేవతలకు లోబడి నాశనముకల లోకములను పొందుచున్నారు. ఇట్టి వారిని శ్రుతి బలహీనులని, మందబుద్ధులని, (అజ్ఞానులని) మూఢులని పశువులని పేర్కొంటోంది. ఇట్టివారికి మాత్రమే విగ్రహమందు దేవుడు కలడు. **"సర్వత్ర సమదర్శినమ్"** సమదర్శియైన వానికి అంతటను భగవంతుడు కలడు. సమదర్శియొక్క భావన మందబుద్ధిగలవాని భావనకు భిన్నమైనది. ఇతడు బ్రహ్మము నేత్రములచేతను, వాక్కుచేతను, ఇన్ద్రియములచేతను, తపస్సుచేతను, కర్మచేతను గ్రహింపశక్యము కానిదిగా ఎఱిగినవాడు. **'తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః'** అని శ్రుతి చెప్పినట్లుగా ఆ బ్రహ్మమును అవయవరహితముగా ధ్యానించువాడు. ఆ ఆత్మయు జీవరూపముగానున్న తానును ఏకమేయని ఎఱిగినవాడు. **తే సర్వగం సర్వతః ప్రాప్యధీరా। యుక్తాత్మానః సర్వమేవా విశన్తి॥** ఇట్టి మహాత్ములు సర్వవ్యాపకమగు పరమాత్మను అంతటపొంది ధీరులును, ఏకాగ్రచిత్తులును అయి సమస్తమును పొందుచున్నారు.

**సర్వత్రావస్థితం శాన్తం నప్రపశ్యే జ్జనార్దనమ్।**
**జ్ఞానచక్షుర్విహీనత్వా దన్ధ స్సూర్యమివోదితమ్॥** ౯

**టీ॥ సర్వత్ర** = అంతటను; **అవస్థితమ్** = ఉన్నవాడును; **శాన్తమ్** = నిర్వికారుడైన; **జనార్దనమ్** = జనార్దనుని; **ఉదితమ్** = ఉదయించిన; **సూర్యమ్** = సూర్యుని; **అన్ధఇవ** = గ్రుడ్డివానివలె; **జ్ఞాన చక్షుర్విహీనత్వాత్** = జ్ఞాననేత్రము లేనివాడగుట వలన; **నప్రపశ్యేత్** = చూడబడడు.





**దీపికా:** ఆత్మానాత్మ విచారముచేయనివాడు తత్త్వజ్ఞుడుకాడని భగవానుడు చెప్పుచుచున్నాడు. గ్రుడ్డివాడు సూర్యుని చూడలేనట్లు జ్ఞాననేత్రము లేనివాడు సర్వత్రావస్థితుడు, శాంతుడు, ప్రళయకాల మందు లయమొనర్చువాడు అయిన పరమాత్మను చూడజాలడు. కర్మము సూర్యాశ్రయమైనది. అంధుడనగా వేదప్రతిపాద్యమైన కర్మాచరణ యందు ఉదాశీనుడైన వాడు. ఇట్టి వానిచే వేదవిదితమైన కర్మాచరణ జన్యమైన ఫలము (స్వర్గాదులు) చూడబడుట లేదు. **"యధా వేదో వాఽ ఽ ననూక్తోఽ న్యద్వా కర్మాకృతం యదిహ వా అప్యనేవం..."** అధ్యయనముచేయబడని వేదము మనుజుని రక్షించుటలేదని బృహదా రణ్యకము పలుకుచున్నది. ఎవడీ ప్రపఞ్చమున తన స్వరూపమే అయిన సర్వత్రావస్థితుడు శాంతుడు, ప్రలయకాలమందు లయమొనర్చు వాడు అయిన పరమాత్మను ఎఱుగడో వానిని ఆత్మరక్షింపదు. ఇట్టివాడు అంధుడనియే శ్రుతిమాత అభిప్రాయము.

**యత్రయత్ర మనోయాతి తత్ర తత్ర పరం పదమ్।**
**తత్ర తత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్॥** ౧౦

**టీ॥ యత్రయత్ర** = ఎక్కడెక్కడ; **మనః యాతి** = మనస్సు పోవుచున్నదో; **తత్ర తత్ర** = అక్కడక్కడ; **పరంపదమ్** = పరమపదము; **తత్ర తత్ర** = అచ్చటచ్చట; **పరం బ్రహ్మః** = పరబ్రహ్మమును; **సర్వత్ర** = అంతట; **సమవస్థితమ్** = సమముగానున్నది.

**దీపికా:** జ్ఞానచక్షువులుకల యోగులు అంతటానిండిన బ్రహ్మపదార్థము నెఱుంగుదురని ప్రమాణీకరించుచున్నాడు. జ్ఞానయోగుల మనంబెచ్చట లయమగునో అచ్చట పరమపదము ఉండును. **"తద్విష్ణోః పరమ మ్పదమ్"** అది సర్వవ్యాపకుడైన పరమాత్మస్థానమని శ్రుతి పలుకు

చున్నది. మనస్సు నిశ్చలమైన యోగి వీర్యవంతుడై ఈశ్వరస్వరూపు డగును. నేత్రములు దేనిని చూచుచున్నవో, ఘ్రాణము మూర్కొను చున్నదో, ఇన్ద్రియములచేతను, మనస్సుచేతను తెలియబడు సర్వము బ్రహ్మపదార్థమునకు భిన్నముకానట్టిది. **శ్రు. "అఖిల మిద మనన్త మాత్మతత్త్వం దృఢపరిణామిని చేతసిస్థితో"** ఈ సమస్తము అనంతమగు ఆత్మతత్త్వమే. నిస్సఙ్కల్పస్థితి దృఢమైన చిత్తమునకు అది అనుభూత మగుచున్నది. ఇట్టి మనస్సు ఆత్మను పొందునదిగాయున్నది. ఇచ్చట అనేకత్వము కొంచమైనను లేదని **"మనసైవేద మాప్తవ్యం నేహనా నాస్తి కిఞ్చన"** అని శ్రుతే పలుకుచున్నది. కనుకనే ఆత్మ దృశ్య పదార్థ రూపమున చలించునని, అధిష్ఠానదృష్టిచే చలించునది కాదని **శ్రు. "తదేజతి తన్నేజతి"** ఈశావాశ్యోపనిషత్తు ప్రమాణీకరించుచున్నది.

మరియొక విధమున **శ్రు. వాచావదతి యత్కిఞ్చి త్సఙ్కల్పైః కల్ప్యతే క్వచిత్। మనసా చిన్త్యతే యద్వత్సర్వం మిథ్యా నసంశయః ॥ యత్కిఞ్చి ద్దృశ్యతే లోకేయత్కిఞ్చిద్భాష్యతే జనైః। యత్కిఞ్చి ద్భుజ్యతే క్వాపి తత్సర్వమసదేవహి॥** వాక్కుచేత చెప్పబడునది, సఙ్కల్పములచే కల్పింపబడునది, మనస్సుచేత చింతింపబడునదియగు సమస్తము మిథ్యయే, ఈ ప్రపఞ్చమున ఏది కనిపించుచున్నదో, జనులచే ఏది భాషింపబడుచున్నదో, ఏది భుజింపబడుచున్నదో అదియంతయు అసత్తే అని సంభావింపవలెను. ఇట్టి వానికి ఇతరములగు సంసార దృష్టు లెవ్వియును లేక అన్తఃకరణము శుద్ధమగును. ఇట్టి జ్ఞానము కలవారికి మనంబెచ్చట లయమగునో అనగా విక్షేపములేకయుండునో అది పరమపదంబనబడును. పరమాత్మయు అచ్చట సమముగా నుండును.





**దృశ్యతే దృశి రూపాణి గగనం భాతి నిర్మలమ్।**
**అహమిత్యక్షరం బ్రహ్మ పరమం విష్ణుమవ్యయమ్॥** ౧౧

**టీ॥ పరమమ్** = సర్వోత్కృష్టమును; **అక్షరమ్** = క్షరరహితమును, **అవ్యయమ్** = వినాశరహితమును, **విష్ణుమ్** = సర్వవ్యాపకుడైన, **బ్రహ్మ** = బ్రహ్మము, **అహమితి** = నేనను అభేదభావనచే, **దృశి** = జ్ఞానము నందు; **రూపాణి** = నామరూపాత్మకమైన జగత్తు, **దృశ్యన్తే** = కనబడు చున్నవి; **గగనమ్** = ఆకాశము; **నిర్మలమ్భాతి** = మలరహితమై ప్రకాశించుచున్నది.

**దీపికా:** నిర్మలమైన (ఏకరూపమగు) ఆకాశము నానావిధ రూపముల కనబడుచున్నది. చిదాకాశ రూపుడగుటచే పరమాత్మ ఆకాశసదృశుడని చెప్పబడుచున్నాడు. నేనే బ్రహ్మమను పారమార్థిక నిత్యత్వముగల స్వరూప జ్ఞానము కలవాడే ఈ కనబడుచుండు నానావిధములైన రూపములతో కూడిన ఆత్మవస్తువును ప్రత్యక్షముగా జూచుచున్నాడు. అద్వైతజ్ఞానము కలవాడు, అక్షరమగు స్వరూపజ్ఞానము కలవాడు ఏది చుచుచున్నాడో, వినుచున్నాడో, దేనిచే అంతయు నెఱుగుచున్నాడో, అది అంతయు వేఱుగలేదని తెలుసుకొనుచున్నాడు. ఈ ఆత్మయందే సమస్త ప్రాణులు, సమస్తలోకములు, సర్వదేవతలు, సకలభూతములు సమర్పింపబడి యున్నవని గ్రహించి ఆ ఆత్మ వస్తువునే ప్రత్యక్షముగా చూచుచున్నాడు. అనగా శ్రు. **"ఏవాత్మన మేవ లోక ముపాసీత"** ఆత్మను తన ప్రపఞ్చమని ఉపాసించుచున్నాడు.

**దృశ్యతేచే త్ఖగాకారం ఖగాకారం విచిన్తయేత్।**
**సకలం నిష్కలం సూక్ష్మం మోక్షద్వారేణ నిర్గతమ్॥** ౧౨
**అపవర్గస్య నిర్వాణం పరమం విష్ణు మవ్యయమ్।**

**సర్వతో జ్యోతిరాకాశం సర్వభూతాధి వాసినమ్॥**
**సర్వత్ర పరమాత్మానం బ్రహ్మాత్మా పరమవ్యయమ్।** ౧౩

**టీ॥ ఖగాకారమ్** = ద్వాదశదళాన్తర్గత జీవస్వరూపము; **దృశ్యతే చేత్** = చూడబడినచో; **సకలమ్** = సమస్తమగు (కలాసహితమగు); **నిష్కలమ్** = కలాతీతమయినదియు; **సూక్ష్మమ్** = సూక్షమును (అయినదానిని); **మోక్షద్వారేణ** = మోక్షమార్గముచే; **నిర్గతమ్** = పోందతగినదియు; **అపవర్గస్య** = మోక్షముయొక్క; **నిర్వాణమ్** = సుఖమును; **పరమమ్** = శ్రేష్ఠమైనదియు; **విష్ణుమ్** = సర్వవ్యాపక మైనదియు; **అవ్యయమ్** = నాశములేనిదియు (వికారరహిత మైనదియు); **సర్వతోజ్యోతిః** = సర్వత్ర స్వయముగా ప్రకాశించునదియు; **ఆకాశమ్** = చిదాకాశ స్వరూపమైనదియు; **సర్వభూతాధివాసినమ్** = సర్వభూతాన్తర్వర్తి యును, **పరమ్** = శ్రేష్ఠమై; **అవ్యయమ్** = నాశములేనిదైన; **పరమాత్మానమ్** = పరబ్రహ్మమును; **బ్రహ్మాత్మా** = బ్రహ్మరూపుడై; **సర్వత్ర** = అంతట; **విచిన్తయేత్** = భావింపవలెను.

**దీపికా:** బ్రహ్మనిష్ఠునకు ఇతర సాధనముల ఆవశ్యకత లేదని తెలుపుచున్నాడు. ద్వాదశదళాంతర్గతమైన జీవుడు ప్రకాశమైన సమయమున తానే బ్రహ్మమగును. స్వయముగా వాసనలులేని నేత్రాదీన్ద్రియములు పూర్వసంస్కార మాత్రముచే ప్రేరితములయి విషయములందు ప్రవర్తించుచున్నవి. రూపమును గ్రహించుట, శబ్దమును గ్రహించుట మొదలగు ప్రవృత్తికి మనోవాసనలే ముఖ్య కారణము. ఇట్టి వాసనలచే సంసారమందు తగులుకొని బద్ధుడై జీవభావమును పొందుచున్నాడు. శ్రు. **ద్వాదశారే మహాచక్రే పుణ్యపాప వివర్జితే। తావజ్జీవో భ్రమత్యేవం యావతత్త్వం నవిన్దతి॥** జీవుడు





పుణ్యపాపసంబంధ రహితమగు మార్గము నెఱుగనంతవఱకు ద్వాదశదళాత్మకమగు అనాహతచక్రమునందు పరిభ్రమించు చుండును. సకలవిద కామవాసనలు నశించిన జీవుడు హృదయగ్రన్థి భేదించి అమృతస్వరూపమగు మోక్షమును పొందుచున్నాడు. ఎవడు వాసనలు క్షయింపగా చిన్మాత్ర విగ్రహుడగు పరమాత్మయందు వృత్తులతో కూడ లీనమగుచున్నాడో వాడు బ్రహ్మమే అయియున్నాడని శ్రుతి పలుకు చున్నది.

శ్రు. **"సన్త్యక్త వాసనాన్మౌనా దృతే నాస్త్యుత్తమం పదం"** సర్వవాసనా శూన్యమయిన ఇట్టివాడు నామాత్మక, రూపాత్మకశాఖకు ఊర్ధ్వ మందున్న వాడగుటచే మౌనావస్థయందున్న (ప్రపఞ్చధర్మ సంబంధ ములను పరిత్యజించిన) వాడు బ్రహ్మస్వరూపుడు. తేజోరూపంబై, కలాతీతంబై, సూక్ష్మమగు మోక్షమార్గమునుండి పొందదగిన సుఖరూప ఆనందదశయే ఈ మౌనావస్థ నాశనములేకయుండి పూర్ణతేజో మయమై సకలభూతకోటి యందుండు పరమాత్మరూపంబైన ఆనందము నేనే యని ధ్యానముచేయవలెను. కనుకనే కొందరు ఈ మౌనావస్థనే ధ్యాన మనియు పలుకచున్నారు.

**అహం బ్రహ్మేతి యస్సర్వం విజానాతి నరస్సదా।**
**హన్యాత్స్వయ మిమాన్కామాన్సర్వాశీ సర్వవిక్రయీ॥** ౧౪

**టీ॥ యః** = ఏ; **నరః** = నరుడు; **సదా** = ఎల్లపుడు; **అహమ్** = నేను; **బ్రహ్మేతి** = బ్రహ్మంబని; **విజానాతి** = తెలిసికొనుచున్నాడో; **సః** = వాడు; **సర్వాశీ** = అన్ని పదార్థములను తినినను; **సర్వవిక్రయీ** = అన్ని వస్తువులను అమ్మినను; **స్వయమ్** = తానే; **ఇమాన్** = ఈ; **కామాన్** = కొరికలను; **హన్యాత్** = చంపును.

**దీపికా:** బ్రహ్మనిష్ఠునకు కర్మబంధములు లేవని ఉపదేశించుచున్నాడు. ఏ మనుజుడు తానే బ్రహ్మమని యెఱిగియుండునో వాడు తన శరీరమును శవమువలే చూచుచుండును. ప్రాప్తించిన దానితో తృప్తి చెందును. ఔషధమువలె భోజనముచేయును. అనగా ప్రాణసన్ధార ణార్థము దొరికిన దానితో తృప్తినొంది భుజించును. ఇట్టి వానికి ఇవి తినకూడనివి, ఇవి తినతగినవి అను నియమములేదు. **"సర్వవిక్రయీ"** సర్వమును అమ్మినను అనగా దేహధారణ నిమిత్తమై జీవయాత్రను సలుపువాడు. వాణిజ్యమునందున్న వానిగా చెప్పుట ధర్మాధర్మములను; సత్యాసత్యములను సమస్త దృశ్యములను త్యజించిన వాడని రాగ రహితుడని చెప్పుటకు. దేనితో ఇట్టి సమస్త దృశ్యమును విడుచునో దానిని కూడ విడుచున్నాడు. ఇది సఙ్కల్పరూపమైన మనస్సు దానిని ఆలంబనగాగైకొని ఆ మనస్సును నిగ్రహించును. అనగా వృత్తిశూన్యము గావించును. **శ్రు."సర్వాశా సంక్షయే చేతః క్షయో మోక్షఇతీష్యతే"** కొరికలు నశించిన చిత్తమును లయించుచున్నది. ఈ చిత్తలయమే మోక్షమని చెప్పబడుచున్నది. **శ్రు. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః॥** దేనిని పొంది మఱియొక లాభమును అధికముగా తలంపడో అట్టి గొప్పలాభమును పొందుచున్నాడు. నేను బ్రహ్మమని యెఱిగిన వానికి భక్ష్యాభక్ష్యములు, చేయతగిన కర్మలుగాని, చేయతగని కర్మలుగాని లేవు. వీనికి విధినిషేధములు లేవు. ఇట్టివాడు శ్రుతులందు అవధూతగా, సన్న్యాసిగా నిష్కామకర్మయోగిగా చెప్పబడుచున్నాడు. వీనికి కర్మలంటవు.

**నిమిషం నిమిషార్థం వా శీతాశీత నివారణమ్।**
**అచలా కేశవే భక్తిర్విభవైః కిం ప్రయోజనమ్॥** ౧౫





**టీ॥ నిమిషమ్** = క్షణమైనను; **నిమిషార్థమ్** = అరక్షణము అయినను, **శీతాశీతనివారణమ్** = శీతోష్ణములను నిగ్రహించి; **కేశవే** = కేశవుని యందు; **అచలా** = చలించని; **భక్తిః** = భక్తిగలవాడైన; **విభవైః** = భోగములతో; **కిం ప్రయోజనమ్** = ఏమి ప్రయోజనము.

**దీపికా:** క్షణకాలమైన బ్రహ్మానుభవమును పొందినవానికి ఇతర సుఖములకైన చింతయుండదని చెప్పుచున్నాడు. క్షణమైనను అరక్షణ మైనను శీతోష్ణములను నిగ్రహించి అనగా ద్వన్ద్వభావనను విడచి; సర్వవస్తువులయందును ఉదాసీనముగానుండుట; ఇది ఉత్తమమైన ఆసనమని శాస్త్రజ్ఞుల నిర్ణయము. **"కుర్యాత్త దాసనం స్థైర్యమారోగ్యం చాఙ్గలాఘవమ్"** ఆ ఆసనము స్థైర్యమును కలుగజేయును. ఈ చిత్తస్థైర్యము (నిశ్చయస్థితి) ధారణము. పరమాత్మయే నేనని చింతించుట ధ్యానము. ఈ ధ్యానమునుకూడా మరచుట సమాధి. **"ఆసనేన రజోహన్తి"** ఆసనము శరీరముయొక్క మనస్సుయొక్క చంచలస్థితియైన రజోధర్మమును పోగొట్టునదగుటచే అది స్థిరత్వమును కలుగజేయును. చిత్తముస్థిరమై పరమాత్మయందు అచఞ్చలమైన భక్తిగల సాధకునకు భోగములతో ఏమి ప్రయోజనము. ఆసనము యోగమునకు ప్రథమ అంగముగా నుండుటవలన స్థిరత్వమును మొదటగా చెప్పి ఆ పరమాత్మ యందు చలించని భక్తిగలవాడని ధ్యాన విస్మృతిరూప సమాధి చెప్పబడినది. ద్వైతభావన విడచి సర్వవస్తువులయందు ఉదాసీనముగా నుండునట్టి ఆసనము, సకలజగత్తును మిథ్యగాచూపు ప్రాణాయామము, చిత్తము యొక్క అంతర్ముఖత్వరూప ప్రత్యాహారము, చిత్తముయొక్క నిశ్చయాత్మకస్థితిరూప ధారణ, బ్రహ్మయే నేనని చింతించు ధ్యానము. ఈ ధ్యాన విస్మృతిరూపమైన సమాధి. ఈ ధ్యానవిస్మృతి బ్రహ్మతో

ఐక్యానుసన్ధాన రూపమైనట్టిది. ఈ ఐక్యానుసన్ధానమే భక్తియని, సమాధియని చెప్పబడుచున్నది. **"పరజ్ఞానన్తు సఙ్గమః"** అని యామునాచార్యుల మతము. ఐక్యానుసన్ధానరూప సమాధియందు వున్నవాడు, స్వతన్త్రుడై సర్వులచేతను ఉపాసింపతగిన వాడుగా, సర్వులకు ఆశ్రయభూతుడైన రాజుగాయున్నాడు. సర్వత్రా తన యిచ్ఛానుసారము వర్తించును. ఇట్టి అద్వైతి స్వతఃసమర్థుడు కావున కార్యసిద్ధిని కలిగించు ఇతర విభవములతో ప్రయోజనము లేనివాడు. **"స ఆత్మా తత్త్వమసి"** అని పలికిన ఛాన్దోగ్యశ్రుతికి విరుద్ధముగా తనకు భిన్నముగా దేవత(ఆత్మ)కలదను వారికి, ఆ ద్వైతభావ ప్రపఞ్చమున తనకంటె ఉత్కృష్టుడైన వానిని తృప్తుని గావించుటకొఱకై కార్యసిద్ధి యందు సమర్థమైనవిగా పేర్కొనబడిన ఇతర విభవముల ఆవశ్యకత ఉండనేవుంది. ఇది లోకన్యాయము. **"విభవైః కిం ప్రయోజనమ్"** అని చెప్పుటచే ఇందలి భక్తి **"స్వస్వరూపాను సన్ధానం భక్తిరిత్యభిధీయతే"** యని శ్రీఆచార్య శఙ్కరులు వర్ణించినట్టిది.

**భిక్షాన్నం దేహరక్షార్థం కన్థా శీతనివారణం।**
**అశ్మానం చ హిరణ్యం చ శాకం శాల్యోదనం తథా॥** ౧౬
**సమానం చిన్తయేద్యోగీ యది చిన్త్యామపేక్షతే।**
**భూతవస్తు న్యశోచిత్వే పునర్జన్మ నవిద్యతే॥** ౧౭

**టీ॥ యోగీ** = యోగియైనవాడు; **దేహరక్షార్థమ్** = శరీరరక్షణకు; **భిక్షాన్నమ్** = భిక్షాన్నమును; **శీతనివారణమ్** = చలిని పోగొట్టుకొనుటకు; **కన్థా** = బొంతను; **అపేక్షతే** = కోరును; **అశ్మానమ్** = రాతిని; **హిరణ్యమ్** = బంగారమును; **తథా** = అట్లే; **శాకమ్** = కూరను; **శాల్యోదనఞ్చ** = శాల్యన్నమును; **సమానమ్** = సమముగా; **చిన్తయేత్** = చింతించును;





**చిన్త్యామ్** = (మోక్షమును) కోరువాడేని; **భూతవస్తుని** = పొందబడిన వాటియందు; **అశోచిత్వే** = దుఃఖము లేకుండును; **పునర్జన్మ నవిద్యతే** = (అట్టివానికి) పునర్జన్మలేదు.

**దీపికా:** యోగి ముముక్షువైనచో అన్యవిషయాసక్తుడుకాడని చెప్పుచున్నాడు. యోగియైనవాడు కేవల దేహరక్షణార్థము భిక్షాన్నమును మాత్రము కోరును. **ద్వౌభాగౌ పూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్! పాయోః సఞ్చరణార్థాయ చతుర్థమవశేషయేత్॥** అభియుక్తమను గ్రన్థము నందు తెల్పినట్లుగా రెండుభాగములు అన్నముచేతను, ఒక భాగము జలముచే పూరించి నాల్గవభాగము వాయు సంచారమునకై విడుచి పెట్టునట్టివాడు. **"భోక్తాదేవో మహేశ్వరః"** అను భావనస్థిరముగా గలవాడు. భుజించు నపుడు ఇది రుచికలది, ఇది రుచిలేనిదని తలంపు లేకుండుటకు భిక్షాన్నమని చెప్పబడినది. శరీరమును ప్రియముతో పోషింపకుండ నాలుక లేనివానిగా యండవలెను. **శ్లో॥ భోజన మహితం విద్యాత్పురస్యో ష్ణీకృతం రూక్షమ్। అతిలవణ మమ్లయుక్తం కదశన శాఖోత్కటం వర్జ్యమ్॥** అని హఠయోగప్రదీపిక వండిన దానిని మఱల వెచ్చచేసినవి, నేయి మొదలగునవి లేనివి, అధికముగా ఉప్పుకలది, పులుసుతో చేరినది, మాడిన అన్నము, మిగుల కారముగలది వర్జనీయములని పేర్కొనుట చేతను; గోధుమలు, పచ్చిపెసలు, వడ్లు, మొదలగువాని అన్నము యోగవృద్ధి నోసంగునని యోగతత్త్వోపనిషత్తు నందు చెప్పుటచేతను; **"ఏకోభిక్షుర్యథోక్తః"** భిక్షువు ఏకాకిగనే సంచరింపవలెనని శ్రుతి పేర్కొనుట చేతను యోగులకు సిద్ధాన్నమే యుచితమని గ్రహింప తగినది. (లేనియెడల పథ్యమును హితమునైన వానిని స్వబుద్ధిచే విచారించి గ్రహింపతగినదని పణ్డితాభిప్రాయం) **"యథాలబ్ధో పజీవీస్యాన్ముని ర్దాన్తో జితేన్ద్రియః"** యదృచ్ఛికముగా దొరకిన దానితో జీవయాత్ర

సాగించవలెనని శ్రుతియే ప్రమాణీకరించుచున్నది. ఎట్లనగా అగ్నిహోత్రుడు అదియిదియనక సమస్తమును భక్షించినట్లు. **"కన్థాశీత నివారణం"** చలిని నివారించుకొనుటకు మాత్రమే కన్థను అపేక్షించువాడు. శరీరాభి మానముచే జీవత్వము కలుగుచున్నది. కావున శరీరాభిమానమును విడచి కౌపీనధారియైగాని, దిగంబరుడైకాని యున్నట్టివాడు వశీకృతేన్ద్రి యుడు అని గ్రహింపతగినది. రాయిని, బంగారమును; శాకమును శాల్యన్నమును సమముగా చింతించువాడు అనుటచే అభిమాన రహితుడు, ద్వన్ద్వరహితుడు, సంశయవర్జితుడు, ద్వేషభావన లేనివాడు అనునది స్పష్టము. **"చిన్తాం భూతవస్తుని అశోచిత్వే"** మోక్షమును కోఱువాడు పొందబడిన వాటియందు దుఃఖము లేకుండును. ప్రతి జీవునియందు ముందుగా పొందబడునవి కామ క్రోధాదులు. ఐహికాభిలాషులు కామక్రోధాదులచేత దుఃఖము పొందు చున్నారు. వైరాగ్యోదయమైనవారు, మోక్షేచ్ఛ గలవారలు, శమదమాదులు సాధించి కామక్రోధాదులవలన కలిగెడి దుఃఖము లేనివారుగానున్నారు. కామక్రోధాదులచే కలుషితమైన జీవనము సాగిస్తే పునరావృత్తి రూపమైన దుఃఖకారకమైన సంసారము కలుగును. మోక్షేచ్ఛగలవారలు ముందుగా పొందబడిన కామక్రోధాదులయందు (సంసారమందు) దుఃఖము(కోరిక) లేకపోవుటచేతను, శమదమాదులను సాధించుట చేతను పునారావృత్తి రూపమైన సంసారము లేనివారగుచున్నారు.

**ఇతి శ్రీమన్మహాభారతే అశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీభగవదర్జున సంవాదే తృతీయోధ్యాయః**





శ్రీ రామలాల సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీభగవదుత్తరగీతా

## చతుర్థోధ్యాయః

॥అర్జునఉవాచ॥

**ఓఙ్కారస్యతు మాహాత్మ్యం రూపంస్థానం పరం తథా।**
**తత్సర్వం శ్రోతుమిచ్ఛామి బ్రూహిమే పురుషోత్తమ॥ ౧**

**టీ॥** హేపురుషోత్తమ = ఓపురుషోత్తమ! ఓఙ్కారస్యతు = ఓఙ్కారము యొక్క, మాహాత్మ్యమ్ = మహిమను, రూపమ్ = స్వరూపమును, తథా = అట్లే, పరంస్థానమ్ = శ్రేష్ఠమైన స్థానమును, తత్సర్వమ్ = ఆ సమస్తమును, శ్రోతుమ్ = వినుటను, ఇచ్ఛామి = కోరుకొనుచున్నాను. బ్రూహిమే= నాకొఱకు చెప్పుము.

**దీపికా:** హే పురుషోత్తమ ! ఓఙ్కారముయొక్క మాహాత్మ్యము, స్వరూపము, స్థానము మొదలగు విషయమునంతను విన ఇచ్ఛకల వాడను, వివరముగా చెప్పవలసినది. అని అర్జుననిచే ప్రార్థింపబడెను.

॥శ్రీ భగవానువాచ॥

**సాధుపార్థ మహాబాహో యన్మాం త్వం పరిపృచ్ఛసి।**
**విస్తరేణ ప్రవక్ష్యామి తత్తే నిగదితం శృణు॥ ౨**

**టీ॥ మహాబాహో** = గొప్పభుజములు కల, **పార్థ** = ఓ అర్జునా!, **యత్** = దేనినైతే, **త్వమ్** = నీవు, **సాధుపృచ్ఛసి** = చక్కగా అడిగితివో, **తత్** = దానిని, **విస్తరేణ** = విస్తారముగా, **తే** = నీ కొఱకు, **ప్రవక్ష్యామి** = చెప్పుచున్నాను, **నిగదితమ్** = చెప్పబడుదానిని, **శృణు** = వినుము.

**దీపికా:** ఓఙ్కార స్వరూపవర్ణన, మహాత్మ్యము తత్త్రద్రహస్యములు తెలుపవలసినదని ప్రశ్నించెను. కేవలము ప్రశ్నించుటయే విషయ గ్రహణమునకు అధికారము కాజాలదు. చెప్పబడిన విషయమును సమర్ధముగా అందుకొనగలవాడై యుండవలెను. కనుకనే 'హే మహాబాహో' అని సంబోధించాడు భగవానుడు. గొప్ప బాహువులు కలవాడా! యనగా బాగుగాగ్రహింపగల సామర్థ్యముగలవాడా నీవడిగిన ప్రశ్నచాల ఉత్తమైనది. దానికి సవివరముగ సమాధానము చెప్పు చున్నాను. గ్రహింపమని పల్కెను.

**పృధివ్యగ్నిశ్చ ఋగ్వేదో భూరిత్యేవ పితామహః।**
**అకారేతు లయం ప్రాప్తే ప్రథమే ప్రణవాంశకే॥** ౩
**అన్తరిక్షం యజుర్వేదో భువో విష్ణు స్సనాతనః।**
**ఉకారేతులయం ప్రాప్తే ద్వితీయే ప్రణవాంశకే॥** ౪
**ద్యౌస్సూర్య స్సామవేదశ్చ స్వరిత్యేవ మహేశ్వరః।**
**మకారేతులయం ప్రాప్తే తృతీయే ప్రణవాంశకే॥** ౫

**టీ॥ ప్రథమే** = మొదటిదైన, **ప్రణవాంశకే** = ప్రణవాంశమైన, **అకారేతు** = అకారము, **లయమ్** = లయమును, **ప్రాప్తే** = పొందినదగుచుండగా, **పృథివి** = భూమియును, **అగ్నిశ్చ** = అగ్నియును, **ఋగ్వేదః** = ఋగ్వేదమును, **భూః** = భూలోకమును, **పితామహః** = బ్రహ్మ, **ఇత్యేవ** = ఇట్లే, **ద్వితీయే** = రెండవదైన, **ప్రణవాంశకే** = ప్రణవభాగమైన, **ఉకారేతు** = ఉకారము, **లయమ్** = లయమును, **ప్రాప్తే** = పొందినదగు చుండగా, **అన్తరిక్షమ్** = అన్తరిక్షలోకమును, **యజుర్వేదః** = యజుర్వేద మును, **భువః** = భువర్లోకమును, **సనాతనః** = సనాతనుడైన, **విష్ణుః** = విష్ణువును, **జాయన్తే** = పుట్టుచున్నారు. **తృతీయే** = మూడవదైన,





**ప్రణవాంశకే** = ప్రణవాంశమైన, **మకారేతు** = మకారము, **లయమ్** = లయమును, **ప్రాప్తేసతి** = పొందినదగుచుండగా, **ద్యౌః** = ద్యులోకము, **సూర్యః** = సూర్యడు, **సామవేదశ్చ** = సామవేదమును, **స్వః** = స్వర్లోకము, **మహేశ్వరః** = మహేశ్వరుడు, **ఇత్యేవ** = ఇట్లే (అగును)

**దీపికా:** ప్రణవముయొక్క మొదటి భాగము "అకారము". అకారము లయమొందగా పృథ్వీలోకము, అగ్ని, ఋగ్వేదము, బ్రహ్మ పుట్టుచున్నారు. ఇచ్చట అగ్ని గార్హపత్యాగ్ని **"అకారో లీయతే బ్రహ్మ"** అకారమునందు బ్రహ్మ లీనమగుచున్నాడు.

ఈ అకారము ఉకారమునందు లీనమగుచున్నది. ఉకారము దీనికి భూతము ఆకాశము. యజుర్వేదము విష్ణువు అధిదేవత. ఇచ్చట అగ్ని దక్షిణాగ్ని. ఈ ఉకారము మకారమునందు లీనమగును. **"ఉకారో లీయతే హరిః"** ఈ ఉకారమునందు విష్ణువు లీనమగును. మకారము తృతీయమాత్ర. దీనిలోకము ద్యులోకము. సామములతో కూడినది. రుద్రుడు అధిదేవత. ఇచ్చట అగ్ని ఆవహనీయాగ్ని. ఈ మకారమునందు రుద్రుడు లీనమగుచున్నాడు. ఇవి ప్రణవముయొక్క అవయవములు.

**అకారః పీతవర్ణశ్చ రజోగుణ సముద్భవః**
**ఉకార శ్శుక్ల వర్ణశ్చ సత్వగుణ సముద్భవః॥** ౬
**మకారః కృష్ణవర్ణశ్చ తమోగుణ సముద్భవః।**
**అకారేచ ఉకారేచ మకారేచ ధనఞ్జయ॥** ౭
**ఇదమేకం సునిష్పన్నమోమితి జ్యోతిరూపకమ్।**

**టీ॥ అకారః** = అకారము, **పీతవర్ణశ్చ** = పీతవర్ణముకలదియు, **రజోగుణసముద్భవః** = రజోగుణమువలన బుట్టినదియు, **ఉకారః** = ఉకారము, **శుక్లవర్ణశ్చ** = శుక్లవర్ణము కలదియు, **సత్త్వగుణ సముద్భవః**

= సత్త్వగుణమువలన పుట్టినదియు, **మకారః** = మకారము, **కృష్ణవర్ణశ్చ** = కృష్ణవర్ణము కలదియును, **తమోగుణ సముద్భవః** = తమోగుణము వలన పుట్టినదియు, (అగుచున్నది).

**ధనఞ్జయ** = ఓ అర్జునుడా! **అకారేచ** = అకారమునందు, **ఉకారేచ** = ఉకారమునందు, **మకారేచ** = మకారమునందు, **జ్యోతిరూపకమ్** = జ్యోతిస్స్వరూపమైనది, **ఏకమ్** = ఒక్కటైనది అయినది, **ఓమితి** = ఓఙ్కారము, **సునిష్పన్నమ్** = జనించెను.

**దీపికా:** ఓ ధనఞ్జయా! అని సంబోధించుటచే ఈ **"రహస్యం బ్రహ్మ విద్యాయాం ధ్రువాగ్ని స్సంప్రచక్షతే"** చెప్పబోవు విద్య అనధికారులకు ఉపదేశింపననర్హమైనదని, నీవు ధనమును జయించిన వాడవగుటచే అనగా కోరికలను జయించిన వాడవగుటచే నీకు ఉపదేశింపబడుచున్నదని తెలుపుచున్నాడు. **"ఇహాముత్ర విరక్తస్య సంసారం ప్రజిహాసతః, జిజ్ఞాసోరేవ కస్యాపి యోగేస్మిన్నధికారితా"** విరక్తునకు, సంసారమున ఇచ్ఛలేనివానికి యోగమునందు అధికారము కలదని సురేశ్వరాచార్య వచనము. **నైతద్దేయా దుర్వినీతాయ జాతుజ్ఞానం గుప్తం తద్ధి సమ్యక్ఫలాయ, అస్థానే హి స్థాప్యమానైవ వాచాం దేవీ కోపాన్నిర్దహే న్నోచిరాయ** ఈ విద్య దుర్వినీతులకు ఉపదేశింపతగదు. సమ్యక్ఫలార్థము రహస్యముగా గ్రహింపతగినది. కావున ఇది ఉత్తమాధికారుల విషయమని గ్రహింపవలెను. అకార ఉకార మకారములనెడి మూడక్షరములచే జ్యోతిరూపంబగు ఓఙ్కారము జనించెను. ఈ జ్యోతి ధ్రువాగ్ని స్వాజ్ఞాన తత్కార్యభూతమైన స్వాతిరిక్త ప్రపఞ్చావభాసమును భస్మ మొనరించుచున్నది. **"సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి, యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సఙ్గ్రహేణ బ్రవీమ్యోమిత్యే తత్"** అను శ్రుతి ప్రమాణముచే ఈ జ్యోతిరూపంబగు ఓఙ్కారము బ్రహ్మమునకు ఆలంబన భూతము.





అకార ఉకార మకారాత్మకమైన ప్రణవమునందు అకారము మొదటిమాత్ర ఇది ఎఱ్ఱగా నుండును. దాని శక్తి పీత మనబడును. అనగా స్వర్ణకాన్తిగలది. ఇది రజోగుణమువలన పుట్టినది. **"ప్రథమారక్తా పీతామహద్బ్రహ్మదైవత్యా" "అకారో రాజసోరక్తో బ్రహ్మాచేతన ఉచ్యతే"** అని శ్రుతులు ప్రమాణీకరించుచున్నవి. రెండవదగు ఉకారము **"ఉకార స్సాత్త్విక శ్శుక్లో విష్ణురిత్యభిధీయతే"** తెల్లని వర్ణము కలది. **"ద్వితీయా విద్యుమతీ కృష్ణా విష్ణుదైవత్యా"** అని దీని శక్తి కృష్ణయననది. పై శ్రుతియందు చెప్పిన శుక్లవర్ణము ఇచ్చట విద్యుమతి అనగా మెఱుము వంటి కాంతియని చెప్పబడినది. **"కర్షతి సర్వాపరాధాన్ కృష్ణః"** కృష్ణయను శక్తి సాధకుని యందలి తమోగుణరూపమైన సర్వపాపములను నశింపజేసి మకారమునందు లీనమగును. మూడవమాత్ర మకారము. ఇది నల్లని వర్ణము కలది. తమోగుణమున పుట్టినది. రుద్రుడు బాహ్యమునకు తమోగుణ రూపమున కనబడుచున్నప్పటికిని ఆన్తరమున శుద్ధసత్వ స్వరూపుడుగా నుండుటచే **"తృతీయా శుక్లా రుద్రదైవత్యా"** అని అధర్వశిఖోపనిషత్తు చెప్పుచున్నది. మకారాధిదైవతమైన రుద్రునిశక్తి శుక్లాయనునది. తెల్లని కాన్తిగలది అని ప్రణవముయొక్క వర్ణ స్వరూపాదులను బోధించాడు.

**త్రిస్థానంచ త్రిమాత్రం చ త్రిబ్రహ్మత్ర్యక్షరం తథా॥ ౮**
**త్రిమాత్ర మర్ధమాత్రం చ ప్రణవస్య విశేషతః।**
**అష్టాఙ్గఞ్చ చతుష్పాదం త్రిస్థానం పఞ్చదైవతమ్॥ ౯**
**ఓఙ్కారం యోనజానాతి బ్రాహ్మణో నసబ్రహ్మణః।**

**టీ॥** ప్రణవస్య = ప్రణవముయొక్క, **త్రిస్థానమ్** = త్రివిధ స్థానములను, **త్రిమాత్రమ్** = త్రివిధమాత్రలను, **త్రిబ్రహ్మ** = బ్రహ్మత్రయమును, **త్ర్యక్షరమ్** = అక్షరత్రయమును, **త్రిమాత్రమ్** = కూటత్రయమును, **అర్ధమాత్రం చ** = అర్ధమాత్రను, **విశేషతః** = విశేషించి, **అష్టాఙ్గమ్ చ**

= అష్టాఙ్గములను, **చతుష్పాదమ్** = నాలుగు పాదములను, **త్రిస్థానమ్** = స్థానత్రయమును, **పఞ్చదైవతమ్** = పఞ్చదేవతాత్మకమైన, **ఓఙ్కారమ్** = ఓఙ్కారమును, **యః** = ఏ, **బ్రాహ్మణః** = బ్రాహ్మణుడు, **నజానతి** = ఎఱుగడో, **సః** = అతడు, **న బ్రాహ్మణః** = బ్రాహ్మణుడుకాడు.

**దీపికా:** ప్రణవముయొక్క త్రిస్థానములు, అకారమునకు **"యో౽ యన్దక్షిణే౽ క్షన్పురుషః"** అను శ్రుత్యనుసారము దక్షనేత్రము స్థానము. ఉకారమునకు వామనేత్రము స్థానము. మేరుసమమగు మకారమునకు భ్రూమధ్యము స్థానము. **"అకారే వహ్నిరిత్యాహు రుకారే హృది సంస్థిత। మకారే చ భ్రువోర్మధ్యే ప్రాణశక్త్యా ప్రబోధయేత్।"** అకారము మూలాధారము వైశ్వానరాగ్ని. ఉకారము హృదయము విష్ణువు. మకారము భ్రూమధ్యము ప్రాణశక్తి. అని శ్రుతిప్రమాణికరించుచున్నది. **"బ్రహ్మగ్రన్థి రకారే చ విష్ణుగ్రన్థిర్హృ ృది స్థితిః॥ రుద్రగ్రన్థి ర్భ్రువోర్మధ్యే భిద్యతే౽ క్షర వాయువా।** అని నాభిహృదయ భ్రూమధ్యములను స్థాన త్రయమందున్న అకారాది మాత్రాత్రయమునందు అకారము బ్రహ్మ గ్రన్థి, ఉకారము హృదయమందలి విష్ణుగ్రన్థి, మకారము రుద్రగ్రన్థి ఇవి స్థానత్రయము. ఈ స్థానత్రయము కూటత్రయమనబడుచున్నది. ప్రణవమునకు త్రిమాత్రలు **"స్థూలమేత ద్ధ్రస్వదీర్ఘప్లుత మితి ఓమ్, ఓమ్,ఓమ్"** ఓఙ్కారము హ్రస్వ, దీర్ఘ, ప్లుతమను మాత్రాత్రయము కలది. అ ఉ, మ అను మూడక్షరములు బ్రహ్మ త్రయము. హ్రస్వ దీర్ఘ ప్లుతములు కలిసిన నాల్గవది అర్ధమాత్ర. **'యా౽ వసానే౽ స్య చతుర్థ్యర్ధమాత్రా సా సోమలోక ఓఙ్కారః, సాథర్వణ మంత్రైరథర్వవేదః సంవర్తకో౽ గ్నిః మరుతో విరాట్ ఏకర్షిః భాస్వతీ స్మృతాః॥'** ఈ అర్ధమాత్ర అథర్వవేదము సంవర్తకాగ్ని మాహాగ్రాసమను సంజ్ఞకలది. అష్టాఙ్గములు





కలది. అనగా అవ్యక్త, మహత్తత్త్వోపాధికమగు బ్రహ్మము, అందుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి క్రమశః ఒకదానిచే ఒకటి పుట్టినది. ఇట్లు అష్టాఙ్గములు కలది. పాద చతుష్టయము కలది. **"ఏతదక్షరం పరం బ్రహ్మ, అస్య పాదాశ్చత్వారో వేదాః చతుష్పాదిద మక్షరం పరంబ్రహ్మ"** ఓఙ్కారముయొక్క నాలుగుపాదములు ఋగ్వేదాది నాలుగు వేదములు. ఈ నాలుగు పాదములతో కూడిన ప్రణవము పరబ్రహ్మ స్వరూపము. జాగ్రత్స్వప్న సుషుప్తితురీయము లయందు ప్రకాశించుచున్నది. **"అకారో జాగ్రతి నేత్రే వర్తతే సర్వజన్తుషు। ఉకారః కణ్ఠత స్స్వప్నే మకారోహృది సుప్తితః।** అకారము జాగ్రత్తునందు, ఉకారము స్వప్నమందు, మకారము సుషుప్తియందు, అర్ధమాత్ర తురీయమందు ప్రకాశించుచున్నవి. పఞ్చదైవతములు కలరు. **"పఞ్చధా పఞ్చదైవత్యం సకలం పరిపఠ్యతే॥ బ్రహ్మణోహృదయం స్థానం కణ్ఠేవిష్ణుస్సమాశ్రితః। తాలుమధ్యే స్థితోరుద్రో లలాటస్థో మహేశ్వరః॥ నాసాగ్రే అచ్యుతం విద్యాత్తస్యాన్తే తు పరం పదమ్।"** బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, అచ్యుతడు (సదాశివుడు) అను పఞ్చవిధ దైవతములు కలరని యెఱుంగవలెను. వీరు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులను వారు. అట్లు తెలియనివాడు బ్రాహ్మణు డని పిలువబడుటలేదు. ఇట్టి ప్రణవస్వరూపమును ఆలంబనగా చేసుకొని పరమాత్మను దర్శించవలెను. ఇట్టి ప్రణవ స్వరూపము వృషభమని శ్రుతులందు చెప్పబడినది. కనుకనే సంప్రదాయములో ఈశ్వరదర్శనము నందిని(వృషభమును) ఆలంబనగా జేసుకొని చేయవలెనని పణ్డితులు చెప్పుచున్నారు.

**ఓమిత్యేవ పరంరూపం పరంబ్రహ్మ ప్రవర్తితమ్॥ ౧౦**
**ఓఙ్కారేతు ప్రవిష్టోఽహం ప్రభవః ప్రళయస్తథా।**
**ప్రణవే సర్వగం దేవమేకీకృత్య సమభ్యసేత్॥ ౧౧**

**టీ॥ ఓమిత్యేవ** = ఓఙ్కారమే, **పరంరూపమ్** = సర్వశ్రేష్ఠమైన రూపముగా గల, **పరంబ్రహ్మ** = పరబ్రహ్మస్వరూపమై, **ప్రవర్తితమ్** = ప్రవర్తింప చేయబడినది. **ఓఙ్కారేతు** = ఓఙ్కారమునందు, **అహమ్** = నేను, ప్రవిష్టః = ప్రవేశించియున్నాను, **తథా** = ఆవిధముగానే, **ప్రళయః** = ప్రళయము, **ప్రభవః** = ఉత్పత్తి, **ప్రణవే** = ప్రణవమునందు, **సర్వగమ్** = సమస్తమును పొందిన, **దేవమ్** = భగవానుని, **ఏకీకృత్యమ్** = ఏకీభవింపజేసి, **సమభ్యసేత్** = బాగుగా అభ్యసింపవలెను.

**దీపికా:** ఓం అను అక్షరము సర్వశ్రేష్ఠమైన స్వరూపముకలది. అదియే పరబ్రహ్మము. నేను ఓఙ్కారమునందు ప్రవేశించియున్నాను. ఆ ఓఙ్కారమే జగముల ఉత్పత్తి నాశనములకు కారణమగుచున్నది. అట్టి ప్రణవమందు సర్వవ్యాపకుడైన భగవంతుని ఏకీభవింపజేసి ధ్యానింపవలెను.

**భూర్భువ స్స్వేతి మన్త్రేణ శరీరం పరిశుద్ధ్యతే।**
**శరీరీ ప్రణవం ధ్యాయే త్సర్వాజ్ఞాన నివర్తకమ్॥ ౧౨**

**టీ॥ భూర్భువస్స్వేతి** = భూర్భువస్స్వః అను ప్రకటగాయత్రీ మన్త్రముచేత, **శరీరమ్** = ఉపాధి, **పరిశుద్ధ్యతే** = పరిశుద్ధి కలదిగా చేయబడుచున్నది, శరీరీ = దేహి, **సర్వాజ్ఞాననివర్తకమ్** = అవిద్యను నివర్తింపజేయునట్టి, **ప్రణవమ్** = ప్రణవమును, **ధ్యాయేత్** = ధ్యానము చేయవలయును.

**దీపికా:** 'భూర్భువస్స్వః' అను మన్త్రము ధ్యానించుటచే బాహ్యోపాధి శుద్ధమగును. ఈవిధముగా బాహ్యశుద్ధిగల ఉపాధిగలవాడు ప్రణవ





ధ్యానము వలన అజ్ఞానము నశించును. భూర్భువస్స్వర్లోకములు చన్ద్ర సూర్యాగ్నులు దేవతలు ఓఙ్కారమును అనుసరించియున్నవి. ఓఙ్కారమును ఆశ్రయించిన వ్యష్ఠిస్వరూపములను (దేవతలను) ధ్యానించుటచే మనః సహితముగా సర్వేన్ద్రియ సమాహార రూపమైన దేహము శుద్ధమగును. సర్వదేవతా సమష్ఠిస్వరూపమైన ఓఙ్కారము మనోవాక్కాయములచేత ఇట్టిదని చెప్పుటకు వీలులేనిది. అట్టి ఓఙ్కారమును ఎవ్వడు ధ్యానించు చున్నాడో వానిని పాపపఙ్కము స్పృశించుటలేదు. **"చిర్వీప్యశుచిర్వాఽపి యో జపేత్ప్రణవం సదా, నసవిప్యతి పాపేన పద్మపత్ర మివామ్భసా॥** అని శ్రుతికూడా పలుకుచున్నది.

**రేచకోచ్ఛ్వాస నిశ్వాసః పూరకః పరిచక్షతే**
**తద్రోధః కుమ్భకశ్చైవ ప్రాణాయామ స్స ఉచ్యతే॥ ౧౩**

**టీ॥ ఉచ్ఛ్వాసనిశ్వాసః** = ప్రాణవాయువును లోనికి పీల్చుట, బయటకు విడుచుట, **పూరకః** = పూరకమనియు, **రేచకః** = రేచకమనియు, **పరిచక్షతే** = చెప్పబడుచున్నవి. **తద్రోధః** = దానిని లోనికి,బయటకు కదలనీయక నిలుపుట, **కుమ్భకః** = కుమ్భకము, **సః** = అది, **ప్రాణాయామః** = ప్రాణాయామని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది.

**దీపికా:** ప్రాణవాయువును బయటకు విడుచుట రేచకము, ప్రాణ వాయువును లోనికి లాగుట పూరకము, అట్లు లోనికి వెలుపలకు పోనీయక నిరోధించుట కుమ్భకము. ఈ మూడిటి నాచరించుట ప్రాణాయామము అనబడుచున్నది.

**ప్రణవస్స శిరోహ్యాత్మా తల్లక్ష్యం బ్రహ్మఉచ్చతే।**
**అప్రమత్త స్స వేద్ధవ్యం శరవత్తన్మయోచ్యతే॥ ౧౪**

**టీ॥ సశిరః** = శిరస్సహితమైన, ప్రణవః = ప్రణవము, **ఆత్మా** =

పరమాత్మ, **స్యాత్** = అగును. **తల్లక్ష్యమ్** = ఆ ప్రణవముయొక్క లక్ష్యము, **బ్రహ్మ** = బ్రహ్మము, **ఇతి** = అని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది, **అప్రమత్తః** = ప్రమాదములేని వాడై, **శరవత్** = బాణమువలె, **తన్మయః** = ఆ బ్రహ్మమయుడైన, **సః** = అతడు, **వేత్తవ్యమ్** = తెలుసుకొనదగునని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**దీపికా:** శిరోయుక్త ప్రణవమే బ్రహ్మము. **'ఏషహ్యోఙ్కారశ్చతురక్షరః, చతుష్పాదః, చతుశ్శిరశ్చతురర్ధమాత్రః'** అని నాలుగైన అక్షరములు, పాదములు, తలలు గలది. శిరస్సే ప్రధానమగుటంజేసి దేవతలని యెఱుంగునది. ఇట్టి దేవతాయుక్త ప్రణవమే బ్రహ్మము. ప్రణవమునకు బ్రహ్మమే గుఱుతు. బాణము సంధించునపుడు యోధుడు ఎట్లు ధనువునందు లక్ష్యము నిలుపునో, అట్లే పరబ్రహ్మమునందు లక్ష్యమునుంచి ధ్యానము చేయవలయును.

**నివర్తన్తే క్రియా స్సర్వాః తస్మిన్దృష్టే పరాపరే।**
**ఓఙ్కార ప్రభవా వేదా ఓఙ్కార ప్రభవాస్స్వరాః॥** ౧౫

**టీ॥ తస్మిన్ పరాపరే** = ఆ కార్యకారణరూపుడైన బ్రహ్మమందు, **దృష్టేసతి** = దృష్టికలుగుచునుండగా, **సర్వాః** = సమస్తములైన, **క్రియాః** = క్రియలు, **నివర్తన్తే** = నివర్తింపబడుచున్నవి. **వేదాః** = వేదములు, **ఓఙ్కారప్రభవాః** = ఓఙ్కారమునుండి ప్రభవించినవి. **స్వరాః** = స్వరములు, **ఓఙ్కార ప్రభవాః** = ఓఙ్కారమునుండి ప్రభవించినవి.

**దీపికా:** ఓఙ్కార వాచ్యుడనదగిన యాపరమాత్మను తెలియగా సమస్తమైన క్రియలు నివర్తింపబడుచున్నవి. నాలుగు వేదములు స్వరములన్నియు ఓఙ్కారము వలననే పుట్టినవి.





**ఓఙ్కార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరా చరమ్।**
**ఓమిత్యేవ పరంరూపం హృత్పద్మే చ వ్యవస్థితమ్॥** ౧౬

**టీ॥ త్రైలోక్యం** = త్రిజగంబులు, **సచరాచరమ్** = చరాచరాత్మకమైన, **సర్వమ్** = సమస్తము, **ఓఙ్కారప్రభవమ్** = ఓఙ్కారమ్మునపుట్టినవి. **ఓమిత్యేవ** = ఓం అనునట్టి, **పరంరూపమ్** = శ్రేష్ఠమైనరూపము, **హృత్పద్మేచ** = హృదయకమలమందు, **వ్యవస్థితమ్** = ఉంచబడియున్నది.

**దీపికా:** చరాచరాత్మకమైన త్రిలోకములు ఓఙ్కారమువలన ప్రభవించినవి. ఓఙ్కారముయొక్క శ్రేష్ఠమైన స్వరూపము హృదయకమలమందు కలదని తెలుసుకొనవలెను. **"సర్వస్యాన్తస్థానేభ్యో ధ్యేయేభ్యః ప్రదీపవత్ ప్రకాశయతీతి ప్రకాశః"** సకల ప్రాణులయొక్క హృదయస్థానమందు ధ్యానయోగ్యమైన వస్తువు దీపమువలె ప్రకాశించుచున్నది. కావున ప్రకాశము (ఓఙ్కారము) అనబడుచున్నది. అని శ్రుతి పలుకుచున్నది. హృదయము ఆదిత్యస్థానము. **"ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషామ్ రవి రంశుమాన్"** అని భగవద్గీత ద్వాదశాదిత్యులలో విష్ణువును హృదయస్థానీయునిగా పేర్కొన్నది. **"సర్వకరణాని మనసి సంప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః"** విష్ణువనగా స్థూలశరీరమందలి సర్వేన్ద్రియములను మనస్సునందు చక్కగా నిలిపి ధ్యానించుటయే. అనగా ఇట్లు ధ్యానించువాడు సాక్షాన్నారాయణుడని భావము. **"సర్వేదేవాస్సంవిశన్తీతి విష్ణుః"** ఇట్టి విష్ణువుచే సకలదేవతలు, ఆ దేవతలచే సృష్టింపబడడిన సకల భూతములు శాంతించుచున్నవి. దీనిచే వాసనాక్షయమైన జీవుడే విష్ణువని ఓఙ్కారస్వరూపుడని తెలియుచున్నది. ఇట్టి ఓఙ్కారముచేతనే పరబ్రహ్మము దర్శింపబడుచున్నది. అట్లు తెలుసుకొనినవాడే మోక్షము నొందును.

**తస్మాత్త దభ్యసేదేకం సర్వగం పరమేశ్వరమ్।**
**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్ష ప్రదాయకః॥ ౧౬**

**టీ॥ తస్మాత్** = చరాచరాత్మకమై త్రిలోకములు ఓఙ్కారమువలన ప్రభవించినవి అందువలన, **ఏకమ్** = ఒక్కటైనది, **సర్వగమ్** = సర్వము వ్యాపించియుండునది, **పరమేశ్వరమ్** = పరమేశ్వర రూపమైన, **తత్** = ఆ ప్రణవమును, **అభ్యసేత్** = అభ్యశింపవలెను. **హ్రస్వః** = హ్రస్వము, **పాపాని** = పాపములను, **దహతి** = దహించుచున్నది. **దీర్ఘః** = దీర్ఘము, **మోక్షప్రదాయకః** = మోక్షమునిచ్చునది.

**దీపికా:** అందువలన ఒక్కటైనది, సర్వము వ్యాపించియుండునది, పరమేశ్వరరూపమైనదగు ప్రణవమును అభ్యసింపవలెను. ఇట్లు ఓఙ్కారమును క్రమక్రమముగా ఉచ్చరించుచు ఉపాసించునపుడు సర్వము ప్రణవస్వరూపమనియు, అదియే శ్రేష్ఠమైన పొందతగిన స్థానమనియు తెలియును. **"సకృదుచ్చరిత మాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోఙ్కారః"** ఏకమాత్ర ప్రణవోచ్చారణ శ్రేష్ఠగతిని కలిగించును. అనగా ఆ ప్రణవము హ్రస్వమైన సమస్తపాపములను దహించును. దీర్ఘంబైన మోక్షము నొసంగును. అనగా ఈ ఓఙ్కారము ప్రళయస్వరూపమని చెప్పుచున్నారు. **"ప్రాణాన్ సర్వాన్ ప్రలీయతే ఇతి ప్రళయః। ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతతి ప్రణవః। చతుర్థావస్థిత ఇతి సర్వదేవవేదయోనిః సర్వవాచ్యవస్తు ప్రణవాత్మకమ్॥"** సకలప్రపఞ్చము ఓఙ్కారమునందుండి ఉద్భవించి దానియందేలయించును. ప్రాణోప ప్రాణములు సర్వము లయించుస్థానమగుటచే ఓఙ్కారము ప్రళయమన బడుచున్నది. దీనిచేతనే (సకల ప్రాణములను పరమాత్మయందు చేర్చుటనుబట్టి) ప్రణవమనబడుచున్నది. దశవిధవాయు సమాహార





రూపమైన మహాప్రాణము లయించుటచే మనస్సు సఙ్కల్పవికల్ప రహితమై మోక్షప్రదమగుచున్నది.

**అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద సవేదవిత్।**
**ఓఙ్కార ప్రభవోవిష్ణు స్త్రినేత్రో వచసాంపతిః॥ ౧౭**

**టీ॥ అవాచ్యమ్** = ఇట్టిదనిచెప్పనలవికాని; **ప్రణవస్యార్థమ్** = ప్రణవార్థ మును; **యః** = ఎవడు; **వేద** = తెలుసుకొనునో; **తమ్** = వానిని; **సవేదవిత్** = వేదవిదునిగా; **విష్ణుః** = విష్ణువు; **త్రినేత్రః** = ఈశ్వరుడు; **వచసాంపతిః** = వాక్పతి; **ఓఙ్కారప్రభవః** = ఓఙ్కారమునుండి ప్రభవించిరి.

**దీపికా:** ఇట్టిదని చెప్పనలవికాని ప్రణవార్థమును ఎవడు తెలుసుకొనునో వాడే వేదవిదుడు. త్రిమూర్తులు ఈ ప్రణవమునుండి ప్రభవించినవారు. **"సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేన్ద్రాః తే సంప్రసూయన్తే"** బ్రహ్మవిష్ణు రుద్రాదులు, సర్వము ప్రణవమునుండియే పుట్టుచున్నవి. సమస్తమునకు కారణస్థానమైయుండుటచే ఇది **'యోని'**యై యున్నదని గ్రహింపతగినది.

**తస్యోచ్చారణ మాత్రేణ పరం బ్రహ్మాధి గచ్ఛతి।**
**ధ్రువమగ్నిమయం రూపం తద్దేహే సమధిష్ఠితమ్॥ ౧౮**

**టీ॥ తస్య** = దానియొక్క; **ఉచ్చారణమాత్రేణ** = ఉచ్చారణమాత్రముచే; **పరమ్**= శ్రేష్ఠమైన; **బ్రహ్మాధిగచ్ఛతి** = బ్రహ్మమును పొందుచున్నాడు; **ధ్రువమ్** = నిశ్చలమైన; **అగ్నిమయమ్** = అగ్నిమయమైన; **రూపమ్** = రూపము; **తత్** = ఆ ఓఙ్కారము, **దేహే** = దేహమునందు; **సమధిష్ఠితమ్** = కలదు.

**దీపికా:** ప్రణవోచ్చారణ మాత్రముననే పరబ్రహ్మమును పొందుచున్నాడు. నిశ్చలమై అగ్నిమయమైన ఆ ఓఙ్కారము దేహమునందే కలదు.

**ఇన్ద్రియాణి పశూన్ హత్వా ఆత్మనైవతు తుష్యతి।**
**హృత్పద్మ కర్ణికామధ్యే శుద్ధం దీపశిఖాకృతి॥ ౨౦**
**అఙ్గుష్ఠమాత్ర మచలం ధ్యాయేదీశ్వర మవ్యయమ్।**

**టీ॥ ఇన్ద్రియాణి** = ఇన్ద్రియములనెడి, **పశూన్** = పశువులను, **హత్వా** = చంపి, **ఆత్మనైవతు** = ఆత్మచేతనే, **తుష్యతి** = సంతోషించుచున్నాడు. **శుద్ధమ్** = పరిశుద్ధమును, **దీపశిఖాకృతి** = దీపశిఖాకృతి కలదియును, **అఙ్గుష్ఠమాత్రమ్** = అఙ్గుష్ఠ పరిమాణము కలదియు, **అచలమ్** = చలింపనిదియు, **ఈశ్వరమ్** = ఈశ్వర స్వరూపమునైన, **ఓఙ్కారమ్** = ఓఙ్కారమును, **హృత్పద్మకర్ణికామధ్యే** = హృత్పద్మకర్ణికామధ్యమున, **ధ్యాయేత్** = ధ్యానింపవలయును.

**దీపికా:** ఇన్ద్రియములనెడి పశువులను చంపి, ఆత్మచేతనే సంతుష్టి నొందుచున్నాడు. హృత్పద్మ కర్ణికమధ్య దేశమున శుద్ధము, దీపశిఖాకృతి గలది, అఙ్గుష్ఠమాత్ర ప్రమాణంకలది; స్వరూపము, సామర్థ్యము జ్ఞానము మొదలగు వానినుండి కదలికలేనివాడగుటచే అచలుడు, వినాశ విక్రియా రహితుడగుటచే అవ్యయుడు అయినట్టి ఈశ్వర స్వరూపమును ధ్యానింపవలెను.

**హృదయకమలమధ్యే దీపవద్వేదసారం॥ ౨౧**
**ప్రణవమయ మతర్క్యం యోగిహృద్ధ్యాన గమ్యమ్।**
**అజహరి శివయోగం సర్వభూతస్థమేకం॥ ౨౨**
**సకృదపి మనసా మాం ధ్యాయతే యస్సముక్తః।**

**టీ॥ హృదయకమలమధ్యే** = హృదయపుణ్డరీక మధ్యమున, **దీపవత్** = దీపమువంటివాడు, **వేదసారమ్** = వేదముయొక్క నిశ్చయార్థరూపుడును, **ప్రణవమయమ్** = ప్రణవస్వరూపుడును, **అతర్క్యమ్** = ఊహాతీతుడును,





యోగిహృద్ధ్యానగమ్యమ్ = యోగులయొక్క హృదయమునందు ధ్యానముచే పొందగినవాడును, అజహరిశివయోగమ్ = త్రిమూర్త్యాత్మకుడును, ఏకమ్ = ఒక్కడును అయిన, మామ్ = నన్ను, సకృదపి = ఒక్కసారైనను, మనసా = మనస్సుచేత, యః = ఎవడు, ధ్యాయతే = ధ్యానించుచున్నాడో, సః = అతడు, ముక్తః = ముక్తుడు.

**దీపికా:** హృదయకమల మధ్యమున ప్రకాశించు వేదసారస్వరూపుడు. **"శ్రుత్యా యదుక్తం పరమార్థమేతత్"** వేదమునందు ఏది చెప్పబడినదో అది శ్రేష్ఠమైనది. అట్టి శ్రేష్ఠమైన వేదములయొక్క నిశ్చయాత్మక స్వరూపుడై, ప్రణవరూపుడై ఊహకందనిదై యోగులచే ధ్యానమున హృదయమందు పొందబడుచు మూర్తిత్రయ స్వరూపుడై సర్వభూతస్థుడై ఏకరూపుడైన వానిగనున్న నన్ను ఒక్క పర్యాయమైన నెవడు ధ్యానించునో వాడు మోక్షమును పొందును.

**ఇడాయాం వాయుమారోప్య పూరయిత్వోదర స్థితమ్॥ ౨౩**
**తతోఽగ్నిం దేహమధ్యస్థం ధ్యాయేజ్వాలా వళీవృతమ్।**

**టీ॥ ఉదరస్థితమ్** = ఉదరభాగముననున్న, **వాయుమ్** = వాయువును, **పూరయిత్వా** = పూరించి, **ఇడాయామ్** = ఇడానాడియందు, **ఆరోప్య** = ఆరోపించి, **తతః** = పిమ్మట, **దేహమధ్యస్థమ్** = దేహమధ్యమున, **జ్వాలావళీత్రయమ్** = జ్వాలాసమూహముతో ఆవరింపబడిన, **అగ్నిమ్** = అగ్నిని, **ధ్యాయేత్** = ధ్యానింపవలెను.

**దీపికా:** ఉదరభాగముననున్న వాయువును పూరించి ఇడానాడియందు ఆరోపించి దేహమధ్యమున జ్వాలాసమూహముతో చుట్టుకొన్న అగ్నిని ధ్యానింపవలెను.

**రేచకం బిన్దు సంయుక్త మగ్నిమణ్డల సంస్థితమ్॥ ౨౪**
**ధ్యాయేచ్చ రేచయే త్పశ్చాన్నాదం పిఙ్గల మాప్నుయాత్।**

**టీ॥ బిన్దుసంయుక్తమ్** = బిన్దుయుక్తమును, **అగ్నిమణ్డలసంస్థితమ్** = అగ్నిమణ్డలమునవున్నదియునగు, **రేచకమ్** = రేచకమును, **ధ్యాయేత్** = ధ్యానింపవలెను. **రేచయేత్ చ** = రేచకమునుకుడా అభ్యసింపవలెను. **పశ్చాత్** = పిమ్మట, **పిఙ్గలమ్** = పిఙ్గలయను, **నాదమ్** = నాదమును, **ఆప్నుయాత్** = పొందును.

**దీపికా:** బిన్దుయుక్తముగ అగ్నిమణ్డలమునందున్నదియునగు రేచకము ను ధ్యానింపవలెను. పిదప రేచకయోగమును అభ్యసింపవలెను. అటుపై పిఙ్గళనాదమును పొందును. ఇది సూర్యగ్రహణ యజనమని చెప్పబడు చున్నది. పిఙ్గలానాడీమార్గమున కుణ్డలినీస్థానమును ప్రవేశించు వాడు నాదరూపమైన బ్రహ్మపదమును పొందుచున్నాడు.

**బ్రహ్మాతు పూరకోజ్ఞేయః కుమ్భకో విష్ణురుచ్యతే॥ ౨౫**
**రేచకస్తు తథాజ్ఞేయో క్షరాక్షర మయశ్శివః।**

**టీ॥ పూరకః** = పూరకము, **బ్రహ్మా** = బ్రహ్మమని, **జ్ఞేయః** = తెలియ దగినది. **కుమ్భకః** = కుమ్భకము, **విష్ణుః** = విష్ణువు(అని), **ఉచ్యతే** = చెప్పబడుచున్నది. **తథా** = అట్లే, **రేచకస్తు** = రేచకము, **క్షరాక్షరమయః** = క్షరాక్షరస్వరూపుడైన, **శివః** = శివుడని, **జ్ఞేయః** = తెలియదగినది.

**దీపికా:** బ్రహ్మ పూరకప్రాణాయామంబని తెలియవలెను. ఇది అకారము. విష్ణువు కుమ్భకప్రాణాయామము. ఉకారస్థానము. క్షరాక్షరస్వరూపుడు శివుడు రేచకప్రాణాయామంబని తెలియదగినది. మకారస్థానము.





**దేహోదేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః॥ ౨౬**
**త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్।**

**టీ॥ దేహః** = దేహము, **దేవాలయః** = దేవాలయము(ఇతి), **ప్రోక్తః** = చెప్పబడినది. **జీవః** = జీవుడు, **సనాతనః** = సనాతనుడైన, **దేవః** = దేవుడు, **త్యజేదజ్ఞాననిర్మాల్యమ్** = నిర్మాల్యరూపమైన అజ్ఞానమును విడువవలెను, **తతః** = తరువాత, **సోఽహంభావేన** = బ్రహ్మము నేను అనుభావనచే, **పూజయేత్** = పూజింపవలెను.

**దీపికా:** దేహమే దేవాలయము. అందున్న జీవుడే సనాతనుడైన దేవుడు. నిర్మాల్యరూపంబగు అజ్ఞానమును విడచి ఆ బ్రహ్మము నేను అనుభావన కలిగియుండుటయే పూజ.

**బహిర్భ్రామ్యతి యఃకశ్చి త్త్యక్త్వా దేహస్థమీశ్వరమ్।**
**స్వగృహే పాయసం త్యక్త్వా భిక్షా మటతి దుర్మతిః॥ ౨౭**
**శిలామృద్దారు పాత్రేషు దైవబుద్ధిః ప్రకల్పితః॥**
**అకల్పిత స్స్వయంజ్యోతిరాత్మనో దేవతా న కిం। ౨౮**

**టీ॥ యఃకశ్చిత్** = ఎవ్వడు, **దేహస్థమ్** = దేహమందున్న, **ఈశ్వరమ్** = ఈశ్వరుని, **త్యక్త్వా** = విడిచి, **బహిః** = వెలుపల, **భ్రామ్యతి** = తిరుగు చున్నాడో, **సః** = ఆ, **దుర్మతిః** = దుష్టబుద్ధిగలవాడు, **స్వగృహే** = స్వగృహమందు, **పాయసమ్** = పాయసమును, **త్యక్త్వా** = విడిచి, **భిక్షామ్** = భిక్షనుగూర్చి, **అటతి** = తిరుగుచున్నాడు.
**శిలామృద్దారుపాత్రేషు** = శిలాదారు మృణ్మయములైన పాత్రలయందు, **దైవబుద్ధిః** = దేవతాబుద్ధి, **ప్రకల్పితః** = కల్పింపబడినదిగా, (భవతి) **స్వయంజ్యోతిః** = స్వయంజ్యోతిస్వరూపుడగు, **ఆత్మ** = పరమాత్మ, **నః** = మనకు, **అకల్పితః** = కల్పింపబడని, **దేవతానకిమ్** = దేవుడు కాడా!

**దీపికా:** స్వదేహాంతర్వర్తియగు ఈశ్వరుని వదలి, బాహ్యముగా ఈశ్వరుడున్నాడని చింతించువాడు స్వగృహమందున్న క్షీరాన్నమును విడచి బిక్షకు పరగృహమునకు పోవుటవంటిది. శిలాదారు మృణ్మయ ములైన బొమ్మలందు దైవమను బుద్ధికలుగుట కల్పితము. స్వయంజ్యోతి స్వరూపుడగు పరమాత్మయన్ననో అకల్పితుడు. శరీరమందే స్వతస్సిద్ధుడై అకల్పిత బ్రహ్మముయుండగా, ఇతర దేవతలతో మనకు ప్రయోజనమేమి

**నాభిమూలే స్థితం పద్మం నాళం తస్య దశాఙ్గులమ్।**
**కోమలం తస్య తన్నాళం నిమ్న పద్మ మధోముఖమ్**
**కదలీపుష్ప సఙ్కాశం చన్ద్రకాన్త సమప్రభమ్॥** ౨౯

**టీ॥ నాభిమూలే** = నాభిమూలమున, **పద్మమ్** = పద్మము, **స్థితమ్** = కలదు, **తస్య** = దానియొక్క, **నాళమ్** = నాళము, **దశాఙ్గులమ్** = పదిఅఙ్గుళముల పరిమితికలది, **తన్నాళమ్** = ఆనాళము, **కోమలమ్** = మృదువైనది, **తస్య** = ఆనాళముయొక్క, **నిమ్నః** = క్రిందిభాగమున, **పద్మమధోముఖమ్** = అధోముక కమలము, **కదలీపుష్ప సఙ్కాశమ్** = కదలీపుష్ప సదృశమైనది, **చన్ద్రకాన్త సమప్రభమ్** = చన్ద్రకాన్త మణియొక్క ప్రకాశముకలది, (భవతి).

**దీపికా:** నాభిమూలమున ఒక పద్మము కలదు. ఆ పద్మనాళము ౧౦ అఙ్గుళముల ప్రమాణము కలది. మిగుల మృదువైనది. అధోభాగమునకు ముఖము గలిగియుండును. కదలీపుష్ప సదృశమైనది. చన్ద్రకాన్తి సమప్రభ కలదిగానున్నది. **"ఊర్ధ్వమేఢ్రాదధోనాభేః కన్దయోనిః ఖగాణ్డవత్"** మేఢ్రమునకు పైన నాభిమూలమున గ్రుడ్డువలె ఒక మాంస పిణ్డము కలదు. ఇది కదలీపుష్ప సదృశమని చెప్పుటచే ఇచ్చటినుండి ౭౨ వేలనాడులు పుట్టినవని తెలియదగినది. అధోభాగమునకు ముఖము





గలదని చెప్పుటచే ఇది ప్రవృత్తిమార్గమున వున్నవారి విషయమని స్పష్టము. **"జ్ఞానినా మూర్ధ్వగో భూయాదజ్ఞానినా మధోముఖః"** ప్రవృత్తి కాముల విషయంలో ఆధారాది కమలములు అధోముఖములని, నివృత్తి మార్గమందున్న వారలకు ఊర్ధ్వముఖములని స్పష్టము.

॥అర్జున ఉవాచ॥

**దుర్విజ్ఞేయం దురారాధ్యం దుష్ప్రగమ్యం జనార్ధన**
**అధోముఖం యథా భూత్వా హృదయే కేనగచ్ఛతి॥** ౩౦

**టీ॥ దుర్విజ్ఞేయమ్** = గ్రహింపశక్యముకానిది, **దురారాధ్యమ్** = ఆరాధింప శక్యముకానిది, **దుష్ప్రగమ్యమ్** = పొందశక్యముకానిది, **అధోముఖమ్** = అధోముఖము కలదియు (అయిన హృత్పద్మమును), **జనార్ధన** = హేజనార్ధన, **హృదయే** = హృదయమందు, **యథాభూత్వా** = ఏవిధముగా నైన, **కేన** = దేనిచేత, **గచ్ఛతి** = పొందబడుచున్నాడు.

**దీపికా:** ఓ జనార్ధన ! తెలికొన శక్యము కానిది, ఆరాధింప వీలులేనది, పొందుటకు వీలులేనిది. అధోముఖము గలిగియుండునదియగు పద్మమును హృదయమందు దేనిచేత పొందుచున్నాడు. వివరముగా తెలుపమని అర్జునుడు అడిగెను.

॥భగవానువాచ॥

**అధోముఖన్తు హృత్పద్మ ముద్ధృత్య ప్రణవేనతు,**
**గత్వాతు పద్మకోశాన్త మేకస్సేవ్యో పునఃపునః॥**
**తతః పశ్చాద్భవేత్పద్మం సర్వగాత్ర సుఖావహమ్।** ౩౧

**టీ॥ అధోముఖన్తు** = అధోముఖమైన, **హృత్పద్మమ్** = హృదయకమలము ను, **ప్రణవేనతు** = ప్రణవముచే, **ఉద్ధృత్య** = ఊర్ధ్వగతమొనర్చి, **పద్మ కోశాన్తమ్** = పద్మకోశముయొక్క అంతమును, **గత్వా** = పొంది, **ఏకః**

= ఒక్కడైనవాడు, **పునఃపునః** = మాటిమాటికిని (నిరంతరము), **సేవ్యః** = సేవింపదగినవాడుగా, **భవతి** = అగుచున్నాడు, **తతఃపశ్చాత్** = అటుపిమ్మట, **పద్మమ్** = హృత్కమలము, **సర్వగాత్ర సుఖావహమ్** = సర్వావయవములకును సుఖమును కలిగించునదిగా, (భవతి)

**దీపికా:** అధోముఖముగల హృత్పద్మమును ప్రణవముచే ఊర్ధ్వగత మొనర్చి. **"ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతతి ప్రణవః"** అని ఇది ప్రళయము. ఇది నివృత్తిమార్గము. నివృత్తి మార్గరూపమైన ప్రణవధ్యానముచేత అధోముఖ కమలములు ఊర్ధ్వముఖ మొనర్పబడి పద్మకోశముయొక్క అంతమునుపొంది, స్వజాతీయ విజాతీయ స్వగత భేదములులేని ఒక్కడైన వానిని పునఃపునః సేవించినవాడు, బ్రహ్మము నెఱింగినవాడై మోక్షమునొందును. తరువాత ఆపద్మము సర్వ దేహమునకును సుఖమును కలుగ జేయునదగును.

**హృదిస్థితం పఙ్కజమష్టపత్రం**
**సకేసరం కర్ణిక మప్యలీనమ్,**
**అఙ్గుష్ఠమాత్రం మునయోవదన్తి**
**ధ్యాయేతి విష్ణుం పురుషం పురాణమ్॥** ౩౨

**టీ॥ హృదిస్థితమ్** = హృదయమందున్నట్టి, **పఙ్కజమ్** = పద్మము, **అష్టపత్రమ్** = ఎనిమిది దళములుగలది, సకేసరమ్ = కేసరయుక్తమైనది, **కర్ణికమ్** = కర్ణిక కలదియు, **అపి** = అయినప్పటికి, **అలీనమ్** = అణిగియుండునది కాదు, **అఙ్గుష్ఠమాత్రమ్** = అఙ్గుష్టమాత్ర ప్రమాణము గల (హృత్పద్మమునందు), **పురుషం పురాణమ్** = పురాణ పురుషుడైన, **విష్ణుమ్** = సర్వవ్యాపియైన బ్రహ్మమును, **ధ్యాయేతి** = ధ్యానముజేయుము (అని), **మునయోవదన్తి** = మునులు చెప్పుచున్నారు.




**దీపికా:** హృదయస్థితమైన ఆపద్మమున అష్టదళములున్నవి. కేసరయుక్త నాభికలది. అనాహతము, హృత్పద్మము సమానార్థకములు. కాని అనాహతము ద్వాదశదలాత్మకము, దాని అన్తర్గతముగా షట్కోణ శోభాన్వితమైన వాయుమణ్డలము, దానిమధ్య త్రికోణాకారముగా శక్తి, **"త్రికోణాన్తర్బాణ లిఙ్గం కనకాభరణైర్యుతమ్। చన్ద్రార్ధమస్తకం దేవం మధ్యే రక్తామ్బుజ మ్పురమ్"** త్రికోణాన్తర్గతముగా బాణలిఙ్గము, ఆ లిఙ్గమునకు శిరస్సునందు **"అర్ధచన్ద్రయోగాత్"** చన్ద్రరేఖవలె విభేదము (చిద్రము) కలదు. దీని మధ్యన రక్తవర్ణ అష్టదళపద్మము ఊర్ధ్వముఖముగా కలదు. **"తన్మధ్యేష్టదలం రక్తం తత్ర కల్పతరుం తథా। ఇష్టదేవాసనం చారుచన్ద్రాతప విరాజితమ్" "అస్యమధ్యేஉస్తి హృదయం సనాలం పద్మకోశవత్। సత్వాన్తర్వర్తినో దేవాః కర్త్రహఙ్కార చేతనాః"** ఇక్కడ సత్వగుణ ప్రధానులైనట్టి అన్తఃకరణవిశిష్టులైనట్టి బ్రహ్మేన్ద్రాది దేవతలు ఉంటున్నారని త్రిశిఖిబ్రాహ్మణ వచనము. ఈ అష్టదలపద్మమే విశేషించి హృత్పద్మమని చెప్పబడుచున్నది. ఆ పద్మము అణిగియుండునది కాదు. అఙ్గుష్ఠమాత్ర ప్రమాణముగల హృత్పద్మమునందు విష్ణువుని ధ్యానింప వలెను.

**అష్ట పత్రన్తు హృత్పద్మం ద్వాత్రింశత్కుసుమస్తథా**
**తత్ర మధ్యస్థితం ధ్యాయేదిన్ద్రాద్యాన్దిశి దేవతాన్॥** 33

**టీ॥ హృత్పద్మమ్** = హృత్పద్మము, **అష్టపత్రమ్** = ఎనిమిది దళములు కలది, **తథా** = అట్లే, **ద్వాత్రింశత్కుసుమమ్** = ముప్పదిరెండు పుష్పములు కలది, **తత్ర** = ఆపద్మమునందు, **మధ్యస్థితమ్** = మధ్యస్థితుడైన వానిని, **దిశి** = దిక్సముదాయమందలి, **ఇన్ద్రాద్యాన్** = ఇన్ద్రాది, **దేవతాన్** = దేవతలను, **ధ్యాయేత్** = ధ్యానింపవలెను.

**దీపికా:** అష్టదళయుక్తమైన హృత్పద్మము ముప్పదిరెండు కుసుమ యుక్తమగుచున్నది. ఈ ముప్పదిరెండు మూలాధారాది మణిపూర పర్యన్తముగా గల ౩౨వర్ణ కుసుమములు. మూలాధార స్వాధిష్ఠాన మణిపూరకములను పద్మములు అనాహత స్థానమున లీనమగుచున్నవి. కావున అష్టదళ హృత్పద్మము ౩౨ కుసుమములు కలదైయున్నది. తత్కమల మధ్యస్థితుడైన దేవుని (జీవుని) ఇన్ద్రాది దిక్పాలకులు సేవించుచున్నారు. స్థూలశరీరము నందలి దశేన్ద్రియములను మనస్సు నందు చక్కగా నిలిపి ధ్యానించుటచే **"సర్వకరణాని మనసి సంప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః"** వాసనాక్షయమైన యోగి విష్ణుశబ్ద వాచ్యుడగుచున్నాడు. ఇట్టి వానిని ఇన్ద్రియాధిష్ఠాన దేవతుల సేవించుచున్నారు.

**తస్యమధ్యగతో భానుర్భానుమధ్యగత శ్శశీ।**
**శశిమధ్యగతో వహ్నిర్వహ్నిమధ్యగతా ప్రభా॥** ౩౪

**టీ॥ భానుః** = సూర్యుడు, **తస్య** = హృదయపుండరీకముయొక్క, **మధ్యగతో** = మధ్యనుపొందెను, **శశీ** = చన్ద్రుడు, **భానుమధ్యగతః** = సూర్యునకు మధ్యభాగమును పొందినవాడు, **వహ్ని** = అగ్ని, **శశిమధ్యగతః** = చన్ద్రుని మధ్యభాగమును, **ప్రభా** = కాంతి, **వహ్నిమధ్యగతా** = అగ్నిమధ్యమును పొందినది.

**దీపికా:** ఆ పద్మమునకు మధ్యభాగమున సూర్యుడున్నాడు. **"తన్మధ్యేష్ట దలం రక్తంతత్ర కల్పతరుం తథా । ఇష్టదేవాసనం చారు చన్ద్రాతప విరాజితం"** అని ఈ అష్టదళ పద్మమునందు ఇష్టదేవతను వారివారి ఇష్టదేవతను ధ్యానింపవలెనని కలదు. ఈ పద్మమందున్న సూర్యుడు అనేకాకారములు గలవాడని, సర్వతోముఖుడని, అనేక నయనములు కలవాడని **"హృదయామ్బురుహాసీనం ధ్యాయేద్వా విశ్వరూపిణమ్,**





**అనేకాకార ఖచిత మనేక వదనాన్వితమ్॥ అనేక నయనాకీర్ణం సూర్యకోటి సమప్రభమ్।** శ్రుతి ప్రమాణీకరించుచున్నది. **"చన్ద్రార్ధమస్తకం దేవం మధ్యే రక్తామ్బుజమ్పరమ్"** ఈ పద్మమధ్యమున సూర్యునకు నడిమిభాగమున చన్ద్రుడు కలడు. ఆ చన్ద్రునకు నడుమ అగ్నికలదు. ఆ అగ్నిమధ్యమందు గొప్పతేజమున్నది.

**ప్రభా మధ్యగతం పీఠం నానారత్న ప్రవేష్ఠితమ్।**
**అనేక రత్న సఙ్కీర్ణం జ్వలనార్క సమప్రభమ్॥** ౩౫

**టీ॥ పీఠమ్** = పీఠము, **ప్రభామధ్యగతమ్** = తేజమునకు మధ్యభాగమును పొందెను, **తత్** = ఆపీఠము, **నానారత్నప్రవేష్ఠితమ్** = వివిధ రత్నములచే పరివేష్ఠింపబడిన, **అనేక రత్న సఙ్కీర్ణమ్** = అనేక రత్నములచే వ్యాప్తమైన, **జ్వలనార్కసమప్రభమ్** = అగ్న్యాదిత్యుల ప్రకాశముగలట్టిదిగా, **(తత్** భవతి)

**దీపికా:** పూరోక్తశ్లోకమున అగ్ని మధ్యయందు తేజమున్నదని తెల్పి ఆ తేజముయొక్క మహిమను, అందున్న సర్వవ్యాపకుడైన పరమాత్మను గూర్చియు ఉపదేశించుచున్నాడు. ఆ తేజమునకు మధ్యభాగమునందు ఒక పీఠము కలదు. ఆ పీఠము నానారత్నములచే పరివేష్ఠితమైనది. ఇంకను సూర్యాగ్ని తేజముతో సమానమైన తేజముకలది.

**తస్య మధ్యస్థితం దేవం నారాయణ మనామయమ్।**
**శ్రీవత్స కౌస్తుభోరస్కం ముక్తాహారోప శోభితమ్॥** ౩౬

**టీ॥ తస్య** = ఆ పీఠముయొక్క, **మధ్యస్థితమ్** = మధ్యయందున్నవాడు, **దేవమ్** = స్వయంప్రకాశుడు, **అనామయమ్** = కల్మషరహితుడు, **శ్రీవత్స కౌస్తుభోరస్కమ్** = శ్రీవత్సకౌస్తుభములు వక్షస్థలమందుగలవాడు, **ముక్తాహారోపశోభితమ్** = ముత్యాలహారములచేత ప్రకాశించుచున్న వాడు, **నారాయణమ్** = నారాయణుని.

**దీపికా:** ఆ పీఠముయొక్క నడుమ భాగమందు ప్రకాస్వరూపుడు, కల్మషరహితుడు అగు నారాయణుడు కలడు. శ్రీవత్స కౌస్తుభములు హృదయమున కలవాడు. ముక్తాహారములచే ప్రకాశించువాడు. అనగా పృథివ్యాది అహఙ్కార పర్యన్తమైన ప్రకృత్యష్టకమును విడిచినవాడు, కౌస్తుభము పృథ్వికి సఙ్కేతము, శ్రీవత్సము అహఙ్కారవాచకము అద్యన్తములు స్మరించుటచే **"భూమిరాపోనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ। అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతినష్టధా"** అష్టక్రృతి రూపాత్మకమైన జగత్తును విడిచినవాడు. ఇచ్చట నారాయణుడు అనగా పరమాత్మనుండి పుట్టినవాడు జీవుడు. ఆకాశముచే ఆచ్ఛాదింపబడినవాడు. పృథివ్యాది తత్త్వసఙ్గ్రహణరూపమైన హృదయము కలవాడు. ఉపాధులచే విడువబడి ప్రకాశించువాడు. అట్టి నారాయణుని సేవింపవలెను.

**అనేక సూర్యసఙ్కాశం మకుటాధిష్ఠ మస్తకమ్।**
**శఙ్ఖం చక్రం గదాపద్మం ముసలం ఖడ్గమేవచ॥** ౩౭

**టీ॥ అనేక సూర్యసఙ్కాశమ్** = అనన్త సూర్యప్రభాసదృశుడు, **మకుటాధిష్ట మస్తకమ్** = కిరీటముతో అలఙ్కరింపబడిన శిరస్సుగలవాడు, **శఙ్ఖమ్** = శఙ్ఖమును, **చక్రమ్** = చక్రమును, **గదా** = గదను, **పద్మమ్** = పద్మమును, **ముసలమ్** = ముసలమును, **ఖడ్గమేవ చ** = ఖడ్గమును కూడా, (ధరించిన వాడు).

**దీపికా:** ఆనన్తసూర్య ప్రకాశమానుడు, కిరీటముచే అలఙ్కరింపబడిన శిరస్సు కలవాడు. శఙ్ఖచక్ర గదాపద్మ ముసలఖడ్గములను ధరించిన వాడు. పుణ్యాపుణ్య సంబంధరహితమైన మార్గమున వాసనాక్షయమైన జీవుడు; జ్ఞానముచే అలఙ్కరింపబడిన శిరస్సు కలవాడు. జ్ఞానముచే అలఙ్కరింపబడుటయే మకుటధారణ. త్రివిధతాపములు ఉపశమించు





టచే దుఃఖస్పర్శ లేనివాడు. కనుకనే శఙ్ఖముద్రాధారి. చక్రధారియనుటచే నిత్యతృప్తుడని ఎఱుంగవలెను. మరియు ఇన్ద్రియములను అశ్వములచే కూర్చబడిన శరీరమను రథమును నడుపువాడను నేను అని సూచించుటకు చక్రముద్రాఙ్కితుడైనవాడు. అనామయుడు జన్మాన్తర కర్మవలన బుట్టిన బాహ్యములు, ఆంతరములైన వ్యాధులచే పీడింపబడనివాడు. సంసారమను రోగమునకు ఔషధరూపుడు. కావున గదాధారి. ఉపాసకులచే సేవింపతగినవాడు. కావున పద్మమును ధరించినవాడుగా ప్రదర్శింప బడ్డాడు. దేహాత్మభావనను నశింపజేయువాడు, కనుకనే ముసలము ధరించినవాడని చెప్పుట. ద్వైతప్రపఞ్చమును/భావనను ఖణ్డించువాడు, కనుకనే ఖడ్గపాణిగా వర్ణింపబడ్డాడు.

**ధనురాద్యాయుధోపేత మష్టబాహుధరం హరిమ్।**
**శుద్ధస్ఫటిక సఙ్కాశం చన్ద్రకాన్త సమప్రభమ్॥** ౩౮

**టీ॥ ధనుః** = ధనుస్సు, **ఆద్యాయుధోపేతమ్** = మొదలుగాగల ఆయుధములతో కూడిన వాడును, **అష్టబాహుధరమ్** = ఎనిమిది భుజములు ధరించిన వాడు, **శుద్ధస్ఫటిక సఙ్కాశమ్** = శుద్ధస్ఫటికము వంటి వర్ణము కలవాడు, **చన్ద్రకాన్త సమప్రభమ్** = చన్ద్రకాంత మణుల కాంతితో ప్రకాశించువాడు.

**దీపికా:** ఇంకను హరి ధనురాద్యాయుధములను ధరించినవాడు. జీవభావనను హరించువాడైన హరి ధనురాద్యాయుధములు కలవాడు. **"ప్రణవోధనుః"** ప్రణవమే ధనుస్సు అని శ్రుతియే ప్రమాణీకరిఇచ్చుచున్నది. ఈ ధనుస్సు ఉపనిషత్సంబంధమైనట్టిది. కనుకనే శివ పురాణము, విష్ణుధర్మోత్తర పురాణము వైష్ణవధనువు ఇట్టిదని చెప్పుటకు వీలులేనిదని పలుకుచున్నవి. శరసదృశుడైన జీవుడు ఓఙ్కార ధనువును

ఆలంబనగా గైకొని పరబ్రహ్మమే అగుచున్నాడు. అష్టబాహువులు కలవాడు. అనగా అష్టప్రకృతి రూపములను గ్రహించువాడు. అష్ట ప్రకృతులు అనగా పృథివి, జల, అగ్ని, వాయు, ఆకాశ, మనో, బుద్ధి అహఙ్కారములు (చన్ద్ర సూర్యాగ్నులు). శుద్ధస్ఫటికమువంటి వర్ణము కలవాడు. అనగా అవర్ణుడు. చన్ద్రకాన్తమణుల రీతి ప్రకాశించువాడు.

**పద్మకిఞ్జల్క సదృశం తప్తకాఞ్చన సన్నిభమ్॥ ౩౯**
**కృతే శ్వేతం హరిం విన్ద్యా త్రేతాయాం రక్తవర్ణకమ్।**

**టీ॥ పద్మకిఞ్జల్క సదృశమ్** = పద్మకిఞ్జల్క సదృశుడు, **తప్తకాఞ్చన సన్నిభమ్** = పుటమువేసిన బఙ్గారముతో సమానమైన ప్రకాశము కలవాడును (అయిన), **హరిమ్** = నారాయణుని, **కృతే** = కృతయుగ మునందు, **శ్వేతమ్** = శ్వేతవర్ణునిగా, **త్రేతాయామ్** = త్రేతాయుగము నందు, **రక్తవర్ణకమ్** = రక్తవర్ణునిగా, **విన్ద్యాత్** = తెలియవలెను.

**దీపికా:** ఇంకను ఆ విష్ణువు పద్మకిఞ్జల్కసదృశుడు. పుటమువేసిన బంగారముతో సమానమైన ప్రకాశముకలవాడు. ఈ హరి కృతయుగము న తెల్లనివర్ణమును, త్రేతాయుగమున రక్తవర్ణమును కలవాడు.

**ద్వాపరే శ్యామవర్ణఞ్చ పీతవర్ణం కలౌయుగే॥ ౪౦**
**శుద్ధం సూక్ష్మం నిరాకారం నిర్వికల్పం నిరఞ్జనమ్।**

**టీ॥ ద్వాపరే** = ద్వాపరమందు, **శ్యామవర్ణఞ్చ** = శ్యామవర్ణము కలవానినిగా, **కలౌయుగే** = కలియుగమందు, **పీతవర్ణమ్** = పీతవర్ణము కలవానినిగా (తెలియవలయును), **శుద్ధమ్** = పరిశుద్ధుడును, **సూక్ష్మమ్** = సూక్ష్మరూపుడును, **నిరాకారమ్** = ఆకార రహితుడును, **నిర్వికల్పమ్** = వికల్పరహితుడును, **నిరఞ్జనమ్** = నిరంజనుడును.

**దీపికా:** మఱియు ఆ విష్ణువు ద్వాపరయుగమునందు శ్యామవర్ణము,





కలియుగమున పీతవర్ణమును కలవాడు. అంతియేకాక పరిశుద్ధుడు. అనగా స్వాతిరిక్తమైన వాసనలను గ్రసించువాడు. సూక్ష్మరూపుడు అనగా ఆకాశము మొదలు స్థూలతకుకారణమైన పదార్థములు లేనివాడు అగుటచే సూక్ష్ముడు. ఇన్ద్రియములచే గ్రహింపవీలులేనివాడు. ఆకార శూన్యుడు వికల్పరహితుడు, నిరంజనుడు. అట్టివానిని సేవించాలి.

**అప్రమేయ మజం దేవం తం విన్ద్యాత్పురుషోత్తమ॥ ౪౧**
**తైలాగ్ని వర్తి సంయోగ మధూమజ్యోతి రూపకం।**

**టీ॥ అప్రమేయమ్** = పరిమితి లేనివాడును, **అజమ్** = పుట్టుక లేనివాడు ను, **దేవమ్** = స్వయంప్రకాశమానుడును, **తైలాగ్నివర్తి సంయోగమ్** = తైలము అగ్నివర్తి అనువాని సంబంధము కలదైన, **అధూమజ్యోతి రూపకమ్** = పొగలేని జ్యోతిరూపము కలవాడు(అయిన), **తం** = వానిని, **పురుషోత్తమమ్** = పురుషోత్తమునిగా, (తెలియవలయును)

**దీపికా:** ఇంకను అప్రమేయుడు, పుట్టుక లేనివాడు, స్వయంప్రకాశ మానుడు అని యెఱుంగతగినవాడు. నూనె, వత్తి, నిప్పు, పొగగల జ్యోతివంటివాడు కాడు.

**తాదృశం పరమం స్మరేత్పార్థ హ్యనన్యధీః॥ ౪౨**
**కారణం యోగవిజ్ఞాన హేతుసాధన వర్జితం।**

**టీ॥ తాదృశమ్** = అటువంటి, **పరమమ్** = శ్రేష్ఠమును, **కారణమ్** = సర్వమునకు కారణభూతుడును, **యోగవిజ్ఞాన హేతుసాధన వర్జితమ్** = యోగము,శాస్త్రజ్ఞానము,హేతువు,సాధనము అనునవి లేనివాడును, (అయిన), **రూపమ్** = రూపమును, **హేపార్థ** = ఓ పార్థా! **అనన్యధీః** = ఇతర చింతనలు లేనివాడవై, **స్మరేత్** = స్మరింపవలెను.

**దీపికా:** ఓ పార్థా! అటువంటి శ్రేష్ఠమైన బ్రహ్మమునే ధ్యానింపవలెను.

అతడే సర్వమునకు కారణభూతుడు. యోగవిజ్ఞానహేతుసాధన రహిత రూపుడు. ఇతర బుద్ధి లేనివాడని యెటింగి యాతని పూజించవలెను.

**భిన్నేకుమ్భేయథాఽఽకాశో మహాకాశే విలీయతే॥**
**విభిన్నే ప్రాకృతే దేహేతథాఽఽత్మాపరమాత్మని। ౪౩**

**టీ॥ కుమ్భే** = ఘటము, **భిన్నేసతి** = భిన్నమైనదగుచుండగా, **ఆకాశః** = ఆకాశము, **యాథా** = ఏరీతి, **మహాకాశే** = మహాకాశమునందు, **విలీయతే** = లీనమగుచున్నదో, **తథా** = ఆరీతిగా, **ప్రకృతే** = ప్రాకృతమైన, **దేహే** = దేహము, **విభిన్నేసతి** = భిన్నమైనదగుచుండగా, **ఆత్మా** = జీవుడు, **పరమాత్మని** = పరమాత్మయందు (లీనమగుచున్నది).

**దీపికా:** ఘటమందున్న ఆకాశము ఘటము భిన్నముకాగా మహాకాశము న లీనమైన రీతిగా పఞ్చభూతాత్మకమైన దేహము నశింపగా జీవాత్మ పరమాత్మయందు అణిగియుండును. ఇట్టి పరమాత్మనే సేవింపవలెను.

**అశ్వారూఢో గజారూఢో సఙ్గ్రామే సఙ్కటేతథా।**
**ఏతదేవ సదాధ్యాయీ పరబ్రహ్మోధి గచ్ఛతి॥ ౪౪**

**టీ॥ అశ్వారూఢః** = అశ్వారూఢుడును, **గజారూఢః** = గజారూఢుడును, **తథా** = అట్లే, **సఙ్గ్రామే** = సంగ్రామమునందు, **సఙ్కటే** = ఎంతటి కష్ట సమయమందైనను, **ఏతదేవ** = ఈ బ్రహ్మస్వరూపమును, **సదాధ్యాయీ** = సర్వావస్థలయందును ధ్యానము చేయువాడు, **పరబ్రహ్మోధిగచ్ఛతి** = పరబ్రహ్మమును పొందుచున్నాడు.

**దీపికా:** ఎంతటి కష్ట సమయమందైనను, ఎట్టి సుఖమందైనను పరమాత్మ ధ్యానమును విడువరాదని ఉపదేశించుచున్నాడు. అశ్వారూఢుడై నప్పుడు, గజారోహణమున, యుద్ధసమయమున, సఙ్కటస్థితియందు పరమాత్మనే





హృదయమున ధ్యానించువాడు పరబ్రహ్మమును పొందును. అశ్వారోహణ, గజారోహణములను; యుద్ధ, సఙ్కట స్థితుల క్రమముననే స్మరించుటచే ఇవియు ప్రమాదకారకములని గ్రహింపతగినవి. కావున నిరంతర బ్రహ్మధ్యాన తత్పరుడైయుండవలెను. అశ్వారోహణ గజారోహణాదులు సర్వజన పూజ్యుడను విషయమును తెలుపుచున్నవి. సర్వజనపూజ్యుడై యుండియు, నిరంతరము బ్రహ్మధ్యానతత్పరుడై యుండవలెనని చెప్పుచున్నాడు.

**ఆసీనోవా శయానోవా గచ్ఛన్తిష్ఠన్సదాశుచిః॥**
**తస్మాత్సర్వప్రయత్నేన యోగయుక్తోభవాఽర్జున। ౪౫**

**టీ॥ అర్జున** = ఓఅర్జున, **తస్మాత్** = అందువలన, **ఆసీనోవా** = కూర్చుండియున్నను, **శయానోవా** = శయనించియున్నను, **గచ్ఛన్** = నడుచునప్పుడును, **తిష్ఠన్** = నిలచియున్నప్పుడును, **అశుచిః** = అశుచి యైనను, **సదా** = సర్వకాల సర్వావస్థలయందును, **సర్వప్రయత్నేన** = సకలవిధప్రయత్నములచేతను, **యోగయుక్తః** = యోగముతో కూడుకొ న్నవాడవు, **భవ** = అగుము.

**దీపికా:** ఓ అర్జున ! నీవు కూర్చున్నప్పుడు, పరుండినప్పుడు, నడచు సమయమున, నిలుచున్నప్పుడు, శుచియైనను, అశుచియైనను సర్వకాల సర్వావస్థలయందును పరమాత్మతో కూడియుండుము. పైనచెప్పిన ప్రాణసఙ్కట స్థితియందు, ఇక్కడ చెప్పబడుచున్న స్వగ్రామ, స్వగృహ సంబంధ సుఖస్థితియందు అనగా నీయింట శయన గృహమందు ప్రియవాదినియైన భార్యతోకూడియున్నను, బ్రహ్మధ్యానమును విడువ రాదని ఉపదేశించుచున్నాడు.

**అన్తస్సఙ్గం బహిస్సఙ్గం మాత్మసఙ్గం పరిత్యజేత్॥**
**సర్వసఙ్గనివృత్తాత్మా పశ్యేదాత్మాన మాత్మని। ౪౬**

**టీ॥ అన్తసఙ్గమ్** = ఆంతరంగిక సంబంధమును, **బహిస్సఙ్గమ్** = బాహ్య సంబంధమును, **ఆత్మసఙ్గమ్** = మనస్సుతోడి సంబంధమును, **పరిత్యజేత్** = విడిచిపెట్టవలెను, **సర్వసఙ్గ నివృత్తాత్మా** = సమస్తబంధములను వదిలిన మనస్సుకలవాడు, **ఆత్మానమ్** = తనను, **ఆత్మని** = పరమాత్మయందు, **పశ్యేత్** = చుడవలెను.

**దీపికా:** ఆంతరంగిక సంబంధమును, బాహ్య సంబంధమును, మనస్సుతో సంబంధమును వదలియుండవలెను. ఇవ్విధమున సమస్తబంధములను వదలినవాడై ప్రతివాడు ఆత్మయందు దృష్టిగలవాడై పరమాత్మకూ తనకూ భేదములేదని తలచి తానే పరమాత్మయను దృఢభావన కలిగియుండవలెను.

**విషయాॗ ఉ సక్త చిత్తానామంధస్యేన్దూదయం యధా॥**
**గీతాసారమిదం శాస్త్ర ముక్తం మోక్షార్థ సిద్ధయే। ౪౭**

**టీ॥ విషయాసక్త చిత్తానామ్** = విషయములయందు ఆసక్తమైన మనస్సు కలవారికి, **అన్ధస్య** = అంధునకు, **ఇన్దూదయం** = చన్ద్రోదయము, **యథా** = యెట్లో, **ఉక్తమ్ మోక్షార్థసిద్ధయే** = మోక్షము సిద్ధించుటకొఱకు చెప్ప బడిన, **గీతాసారమ్** = గీతాసారమైనట్టి, **శాస్త్రమ్** = శాస్త్రమును (**తథా**)

**దీపికా:** అంధునకు ఎట్లు చన్ద్రోదయము నిరర్థకమో, నానావిషయ వాఞ్ఛాసక్తులైన వారలకు ఈ గీతాశాస్త్రము అట్లే అగును. శ్రీ భగవద్గీతా సారము కేవలము మోక్షమును కోరువారలకు మాత్రమే.

**తత్ర స్థితం బ్రహ్మశాస్త్రం వేదశాస్త్ర సునిశ్చితం॥**
**ఇదంశాస్త్రం మయాప్రోక్తం గుహ్యం వేదార్థవిస్తరం।౪౮**

**టీ॥ తత్ర** = ఆ బ్రహ్మవిషయమునందు, **స్థితమ్** = ఉన్నదిమును, బ్రహ్మ





**శాస్త్రమ్** = బ్రహ్మ ప్రతిపాదక శాస్త్రమును, **వేదశాస్త్ర సునిశ్చితమ్** = వేదశాస్త్రములను గూర్చిన నిశ్చయార్థరూపమును, **గుహ్యమ్** = రహస్య మును, **వేదార్థవిస్తరమ్** = వేదములయొక్క ప్రయోజనమును విశదీకరించు నదియును(అయిన), **ఇదమ్** = ఈ, **శాస్త్రమ్** = శాస్త్రము, **మయా** = నాచేత, **ప్రోక్తమ్** = చెప్పబడినది.

**దీపికా:** బ్రహ్మపదార్థ ప్రతిపాదకమును, చతుర్వేదములచేతను, శాస్త్రముల చేతను చక్కగా నిర్ణయింపబడునదియు, అతిరహస్యమైనదియు, వేదము యొక్క ప్రయోజనమును విశదీకరించునదియు అగు ఈ గీతాశాస్త్రమును నేను చెప్పియుంటిని. ఇది రహస్యమని చెప్పియుండుటచే ఇహాముత్ర ఫలభోగాది వైరాగ్యము లేనట్టివానికొఱకు ఉపదేశింపతగినది కాదు అని చెప్పియున్నాడు. **"గుహ్యాద్గుహ్యతరైషా న ప్రాకృతాయ ఉపదేష్టవ్యా సాత్త్వికాయ అన్తర్ముఖాయ పరిశుశ్రూషవే"** అని శ్రుతియే ఇట్టివిద్య **"సాత్త్వికాయ"** సత్త్వగుణ విశిష్టునకు **'అన్తర్ముఖాయ'** ప్రపఞ్చవాసనలనుండి విముఖుడై అన్తర్ముఖుడైన వానికొఱకు 'పరిశుశ్రూషవే' స్వాచార్య శుశ్రూషయందు ఆసక్తిగలవానికొఱకు ఉపదేశింపతగినదియని చెప్పియున్నది.

**యః పఠేత్పరయా భక్త్యా సగచ్ఛేద్విష్ణుసామ్యతాం॥**
**ఏతత్పుణ్యం పాపహరం ధన్యం దుస్స్వప్ననాశనం।౪౯**

**టీ॥ పుణ్యమ్** = పుణ్యరూపమైనదియు, **పాపహరమ్** = పాపములను హరించునదియును, **ధన్యమ్** = కృతార్థమును, **దుస్స్వప్ననాశనమ్** = దుస్స్వప్నములను నాశనము చేయునదియును,(అయిన) **ఏతత్** = ఈ గీతములు, **యః** = ఎవ్వడు, **పరయాభక్త్యా** = మిగలభక్తితో, **పఠేత్** = పఠించునో, **సః** = వాడు, **విష్ణుసామ్యతామ్** = విష్ణుసామ్యమును, **గచ్ఛేత్** = పొందును.

**దీపికా:** ఎవడు ఈ గీతాశాస్త్రమును మిగుల భక్తితో చదువుచున్నాడో వాడు విష్ణువుయొక్క సాన్నిధ్యమును పొందును. ఇది మిగుల పవిత్రమైనది. పాపహరము, ధన్యమైనది, దుఃస్వప్నములను నాశనము చేయునది. **పఠేత్పరయాభక్త్యా** అంటే అనుసంధానరూపమైన పఠనము. దాని వలన పుణ్యపాపములు రెండు హరింపబడును. దుస్స్వప్న నాశమనగా **' పుంసాం దుర్వాసనారజ్జుర్నారీ బడిశ పిణ్డికా॥'** దుర్వాసన అనెడి వల త్రాటికి స్త్రీని ఎఱగా నేర్పఱచినాడని మహోపనిషత్తునందు చెప్పబడినది. ఇచ్చట దుర్వాసన అనగా ధర్మవిరుద్ధమైన యిచ్ఛ. భగవద్గీతయందు కూడా **'ధర్మవిరుద్ధో భూతేషు కామో౽స్మి భరతర్షభ'** అని చెప్పబడినది. దానంజేసి దుస్స్వప్న మనగా ధర్మవ్యతిరిక్తమైన భావన. అశాస్వతమైన వాటియందు శాస్వతత్త్వ బుద్ధి, అనాత్మయందు ఆత్మభావన. పుణ్యపాపములు రెండు హరింపబడి వాసనాక్షయరూపముగా అనిత్యమైన వాటియందు నిత్యత్త్వ భావన పరిహరింపబడుతుంది. ఇది దుస్స్వప్న నాశమంటే.

**పఠితాం శ్రుణ్వతాం చైవ విష్ణోర్మాహాత్మ్యముత్తమం॥**
**అష్టాదశపురాణాని దశవ్యాకరణాని చ,**
**క్షణమాత్రస్య యోగస్య కళానార్హన్తి షోడశీం॥** ౫౦

**టీ॥ అష్టాదశపురాణాని** = అష్టాదశపురాణములు, **దశవ్యాకరణాని చ** = పదివ్యాకరణములు, **క్షణమాత్రస్య** = క్షణమాత్రమైన, **యోగస్య** = యోగముయొక్క, **షోడశీం కళామ్** = పదునారవ కళనుగూర్చి, **నార్హన్తి** = తగదు, **పఠితామ్** = చదువువారలకు, **శ్రుణ్వతాం చైవ** = వినువారలకు, **విష్ణోః** = సర్వవ్యాపకుడైన పరమాత్మయొక్క **మాహాత్మ్యమ్** = మాహాత్మము, **ఉత్తమమ్** = శ్రేష్ఠమైనది.

**దీపికా:** అష్టాదశపురాణములు, దశవ్యాకరణములు చదువుట వలన కలుగు ఫలము యోగాభ్యాసము వలన కలుగు ఫలములోని పదునారవ





వంతునకైన సరికాదు. కావున ఎవనికైన చదువు తలంపుకలిగినను, వినతలంపు కలిగిననూ సర్వవ్యాపకుడైన పరమాత్మ మాహాత్మ్యమును బోధించునవియే చదవలెను, వినవలెను. ఎందువలన అనగా ఆ మహిమ పరమాత్మకు భిన్నమైనది కాదు. ఈ విషయమునే **'శ్రు. స్వే మహిమ్ని'** అని ప్రమాణీకరిస్తోంది. దీనివలన సాధకునకు అన్తర్ముఖత్వ సిద్ధి కలగును.

**ఇతి శ్రీమన్మహాభారతే అశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీభగవదర్జున సంవాదే చతుర్థోధ్యాయః**



**నిర్మథ్య చతురోవేదాన్మునినా భారతం కృతం**
**భారతో దధిమంథస్య గీతానిర్మధనస్యచ**
**సారముద్ధృత్య తం కృష్ణో అర్జునస్య ముఖేహుతం।** ౫౧

**టీ॥ మునినా** = వేదవ్యాసునిచే, **చతురోవేదాన్** = నాలుగైన వేదములు, **నిర్మథ్య** = బాగుగా మథింపబడి, **భారతమ్** = మహాభారతము (అను పఞ్చమవేదము), **కృతమ్** = చేయబడినది, **కృష్ణః** = కృష్ణుడు, **భారతోదధి మంథస్య** = భారతమను దధిని మథించునట్టి, **గీతానిర్మథనస్య** = గీతయను నిర్మథనముయొక్క, **సారమ్** = సారమును, **ఉధృత్య** = పైకితీసి, **తమ్** = ఆ సారమును, **అర్జునస్య** = అర్జునునియొక్క **ముఖే** = ముఖమునందు, **హుతమ్** = హుతమొనర్చెను.

**దీపికా:** శ్రీ వ్యాసభగవానుడు చతుర్వేదసార సఙ్గ్రహణరూపముగా భారతమును వ్రాసెను. శ్రీకృష్ణుడు భారతమను పెరుగు కడవను గీతయను

కవ్వముచే చిలికి సారవంతమగు ఉపదేశామృతమును గైకొని అర్జునుని నోటియందువుంచెను. అనగా అర్జునునకు వేదాన్తసారమును ఉపదేశించెను.

**పూజాకోటిసమం స్తోత్రం। స్తోత్రకోటిసమం జపః**
**జపకోటిసమం ధ్యానం। ధ్యానకోటిసమం లయః॥** ౫౨

**టీ॥ స్తోత్రమ్** = స్తోత్రము, **పూజాకోటిసమమ్** = కోటి పూజలకు సమమైనది. **స్తోత్రకోటిసమమ్** = కోటి స్తోత్రములకు సమానమైనది, **జపః** = జపము, **జపకోటిసమమ్** = కోటిసంఖ్యాకమైన జపమునకు సమానమైనది, **ధ్యానమ్** = ధ్యానము, **ధ్యానకోటిసమమ్** = కోటిధ్యానములకు సమమైనది, **లయమ్** = లయయోగము.

**దీపికా:** కోట్లాదిగా పూజలు చేసినందువలన ఎట్టి ఫలమో, అట్టి ఫలము ఒక్క స్తోత్రమువలన కలుగును. కోటి స్తోత్రములతో సమానమైన ఫలము ఒక్క జపమువలన కలుగుచున్నది. కోటి జపములతో తుల్యమైన ఫలము ఒక ధ్యానము వలనను, కోటి పర్యాయములు ధ్యానముచేయుటచే కలుగు ఫలము మనోలయమువలనను కలుగుచున్నవి. అనగా పూజ, స్తోత్ర, జప, ధ్యానములు క్రమముగా మనోలయమునకు కారణమగుచున్నవి.





# శ్రీభగవదుత్తరగీతా

## ప్రథమోధ్యాయః

**॥అర్జున ఉవాచ॥**

**యదేకం నిష్కళం బ్రహ్మ వ్యోమాతీతం నిరఞ్జనమ్।**
**అప్రతర్క్యమవిజ్ఞేయం వినాశోత్త్పత్తి వర్జితమ్॥** ౧
**కైవల్యం కేవలం శాన్తంశుద్ధమత్యన్త నిర్మలమ్।**
**కారణం యోగనిర్ముక్తం హేతుసాధన వర్జితం॥** ౨
**హృదయామ్బుజమధ్యస్థం జ్ఞానజ్ఞేయ స్వరూపకమ్।**
**తత్క్షణాదేవముచ్యేత యద్జ్ఞానాద్బ్రూహి కేశవ॥** ౩

**॥భగవానువాచ॥**

**సాధుపృష్టం మహాబాహో! బుద్ధిమానసి పాణ్డవా।**
**యన్మాం పృచ్ఛసి తత్త్వార్థ మశేషం ప్రవదామ్యహం॥** ౪
**ఆత్మమన్త్రస్య హంసస్య పరస్పర సమన్వయాత్।**
**యోగేన గతకామానాం భావనా బ్రహ్మచక్షతే॥** ౫
**శరీరిణా మజస్యాన్తం హంసత్వం పారదర్శనమ్॥**
**హంసో హంసాక్షరం చైతత్కూటస్థం యత్తదక్షరమ్**
**తద్విద్వానక్షరం ప్రాప్య జహ్యాన్మరణ జన్మనీ॥** ౬

కాకీముఖ కకారాన్త ముకారశ్చేతనాకృతిః।
మకారస్యతు లుప్తస్య కోఽర్థస్స్రమ్ప్రతిపద్యతే॥ ౭
గచ్ఛన్తిష్ఠన్సదాకాలం వాయుస్వీకరణం పరమ్।
సర్వకాలప్రయోగేన సహస్రాయుర్భవేన్నరః॥ ౮
యావత్పశ్యే త్ఖగాకారం తదాకారం విచిన్తయేత్॥ ౯
ఖమధ్యే కురుచాత్మాన మాత్మమధ్యే చ ఖం కురు
ఆత్మానం ఖమయం కృత్వా నకిఞ్చదపి చిన్తయేత్॥ ౧౦
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మావిద్బ్రహ్మణి స్థితః।
బహిర్వ్యోమస్థితం నిత్యం నాసాగ్రేచ వ్యవస్థితమ్
నిష్కళం తం విజానీయాత్ శ్వాసోయత్రలయం గతః॥ ౧౧
పుటద్వయ వినిర్ముక్తో వాయుర్యత్ర విలీయతే।
తత్ర సంస్థమ్మనః కృత్వా తం ధ్యాయేత్పార్థ ఈశ్వరమ్॥౧౨
నిర్మలం తం విజానీయాత్ షడూర్మిరహితం శివమ్।
ప్రభాశున్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయమ్
సర్వశూన్యం నిరాభాసం సమాధిస్థస్య లక్షణమ్॥ ౧౩
త్రిశూన్యం యోవిజానీయాత్ సతుముచ్యేత బన్ధనాత్॥ ౧౪
స్వయముచ్చలితే దేహే దేహీ న్యస్తసమాధినా।
నిశ్చలం తం విజానీయాత్ సమాధిస్థస్య లక్షణమ్॥ ౧౫

అమాత్రం శబ్దరహితం స్వరవ్యఞ్జన వర్జితమ్।
బిన్దునాద కలాతీతం యస్తం వేద స వేదవిత్॥ ౧౬
ప్రాప్తేజ్ఞానేన విజ్ఞానే జ్ఞేయం చ హృదిసంస్థితే।
లబ్ధశాన్తి పదే దేహే నయోగే నైవధారణా॥ ౧౭
యోవేదాదౌ స్వరఃప్రోక్తో వేదాన్తేచ ప్రతిష్ఠితః।
తస్యప్రకృతిలినస్య యఃపర స్సమహేశ్వరః॥ ౧౮
నావార్థీహి భవేత్తావద్యావత్పారం నగచ్ఛతి।
ఉత్తీర్ణేచ సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్॥ ౧౯
గ్రన్థమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞాన తత్పరః।
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రన్థ మశేషతః॥ ౨౦
ఉల్కాహస్తోయథా కశ్చిద్ద్రవ్య మాలోక్య తాం త్యజేత్।
జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్ ॥ ౨౧
యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్।
ఏవం తం పరమం జ్ఞాత్వా వేదైర్నాస్తి ప్రయోజనమ్॥ ౨౨
జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నచాస్తి కిఞ్చిత్కర్తవ్య మస్తిచేన్న స తత్త్వవిత్॥ ౨౩
తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటా నినాదవత్।
అవాచ్యం ప్రణవస్యాగ్రం యస్తం వేదసవేదవిత్॥ ౨౪

ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్।
ధ్యాన నిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యేన్నిగూఢవత్॥ ౨౫
తాదృశం పరమంరూపం స్మరేత్పార్థహ్యనన్యధీః
విధూమాగ్ని నిభన్దేవం పశ్యేదత్యన్త నిర్మలమ్॥ ౨౬
దూరస్థోఽపి నదూరస్థః పిణ్డస్థః పిణ్డవర్జితః।
విమల స్సర్వదా దేహీ సర్వవ్యాపీ నిరఞ్జనః॥ ౨౭
కాయస్థోఽపి నకాయస్థః కాయస్థోఽపి నజాయతే।
కాయస్థోఽపి నభుఞ్జానః కాయస్థోఽపి నబధ్యతే॥ ౨౮
కాయస్థోఽపి నలిప్తస్స్యా త్కాయస్థోఽపి నబాధ్యతే॥౨౯
తిలమధ్యే యథాతైలం క్షీరమధ్యే యథాఘృతమ్।
పుష్పమధ్యే యథాగన్ధ ఫలమధ్యే యథారసః
కాష్ఠాగ్నివ త్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్॥ ౩౦
తథా సర్వగతో దేహీ దేహమధ్యే వ్యవస్థితః।
మనస్థో దేహినాం దేవో మనోమధ్యేవ్యవస్థితః॥ ౩౧
మనస్థం మనమధ్యస్థం మధ్యస్థం మనవర్జితమ్।
మనసా మన ఆలోక్య స్వయంసిద్ధ్యన్తి యోగినః॥ ౩౨
ఆకాశం మానసంకృత్వా మనః కృత్వానిరాస్పదమ్।
నిశ్చలం తం విజానీయాత్ సమాధిస్థస్య లక్షణమ్॥ ౩౩
యోగామృతరసం పీత్వా వాయుభక్షస్సదాసుఖీ।
యమమభ్యస్యతే నిత్యం సమాధిర్మృత్యునాశకృత్॥ ౩౪
ఊర్ధ్వశూన్య మధశూన్యం మధ్యశూన్యం యదాత్మకమ్।
సర్వశూన్యం స ఆత్మేతి సమాధిస్థస్య లక్షణమ్॥ ౩౫
శూన్యభావిత భావాత్మా పుణ్యపాపైః ప్రముచ్యతే॥ ౩౬

॥అర్జున ఉవాచ॥

అదృశ్యే భావనా నాస్తి దృశ్యమేతద్వినశ్యతి।
అవర్ణమస్వరం బ్రహ్మ కథం ధ్యాయన్తి యోగినః॥ ౩౭

॥భగవానువాచ॥

ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణం మధ్యపూర్ణం యదాత్మకమ్।
సర్వపూర్ణం తదాత్మేతి సమాధిస్థస్య లక్షణమ్॥ ౩౮

॥అర్జున ఉవాచ॥

సాలమ్బస్యాప్యనిత్యత్వం నిరాలమ్బస్య శూన్యతా।
ఉభయోరపి దోషత్వాత్కథం ధ్యాయన్తి యోగినః॥ ౩౯

॥భగవానువాచ॥

హృదయం నిర్మలఙ్కృత్వా చిన్తయిత్వాప్యనామయం।
అహమేకమిదం సర్వమితి పశ్యేత్పరం సుఖీ॥ ౪౦

॥అర్జున ఉవాచ॥

అక్షరాణి సమాత్రాణి సర్వేబిన్దు సమాశ్రితా।
నాదేనభిద్యతే బిన్దుస్సనాదః కేన భిద్యతే॥ ౪౧

॥భగవానువాచ॥

అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్యయోధ్వనిః।
ధ్వనేరన్తర్గతం జ్యోతిః జ్యోతిరన్తర్గతం మనః।
తన్మనో విలయంయాతి తద్విష్ణోః పరమంపదమ్॥ ౪౨
ఓఙ్కారధ్వని నాదేన వాయోః సంహరణాన్తికమ్।
నిరాలమ్బం సముద్దిశ్య యత్ర నాదో లయఙ్గతః॥ ౪౩

॥అర్జున ఉవాచ॥

భిన్నేపఞ్చాత్మకే దేహే గతే పఞ్చసుపఞ్చధా।
ప్రాణైర్విముక్తే దేహేతు ధర్మాధర్మౌ క్వ గచ్ఛతః॥ ౪౪

॥భగవానువాచ॥

ధర్మాధర్మౌ మనశ్చైవ పఞ్చభూతాని యాని చ।
ఇన్ద్రియాణి చ పఞ్చైవ యాశ్చాన్యాః పఞ్చదేవతాః॥ ౪౫
తాశ్చైవ మనసా సర్వే నిత్యమేవాభిమానతః।
జీవేన సహ గచ్ఛన్తి యావత్తత్త్వం నవిన్దతి॥ ౪౬

॥అర్జున ఉవాచ॥

స్థావరం జఙ్గమం చైవ యత్కిఞ్చిత్సచరాచరమ్।
జీవా జీవేన సిధ్యన్తి సజీవః కేన సిద్ధ్యతి॥ ౪౭

॥భగవానువాచ॥

ముఖనాసికయోర్మధ్యే ప్రాణస్సఞ్చరతే సదా।
ఆకాశః పిబతే ప్రాణం స జీవః కేన జీవతి॥ ౪౮

॥అర్జున ఉవాచ॥

బ్రహ్మాణ్డ వ్యాపితం వ్యోమ వ్యోమ్నా చావేష్టితం జగత్।
అన్తర్బహిశ్చ తద్వ్యోమ కథం దేవో నిరఞ్జనః॥ ౪౯

॥భగవానువాచ॥

ఆకాశో హ్యవకాశశ్చ ఆకాశవ్యాపితం చ యత్।
ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే॥ ౫౦

॥అర్జున ఉవాచ॥

దన్తోష్ఠతాలు జిహ్వానామాస్పదం యత్ర దృశ్యతే।
అక్షరత్వం కుతస్తేషాం క్షరత్వం వర్తతే సదా॥ ౫౧

॥భగవానువాచ॥

అఘోషమవ్యఞ్జన మక్షరఞ్చాప్య తాలుకణ్ఠోష్ఠ మనాసికఞ్చ।
అరేఫజాతం పరమూష్మ వర్జితం తదక్షరం నక్షరతే కథఞ్చిత్॥ ౫౨

॥అర్జున ఉవాచ॥

జ్ఞాత్వా సర్వగతం బ్రహ్మ సర్వభూతాధివాసితమ్।
ఇన్ద్రియాణాం నిరోధేన కథం సిద్ధ్యన్తి యోగినః॥ ౫౩

॥భగవానువాచ॥

ఇన్ద్రియాణాం నిరోధేన దేహే పశ్యన్తి మానవాః।
దేహేనష్టే కుతో బుద్ధి ర్బుద్ధినాశో కుతోజ్ఞతా॥ ౫౪
తావదేవ నిరేధ స్స్యాద్యావత్తత్త్వం నవిన్దతి।
విదితే తు పరేతత్త్వే ఏకమేవాను పశ్యతి॥ ౫౫
నవచ్ఛిద్రాన్వితా దేహాః స్రవన్తి గలికా ఇవ।
నైవబ్రహ్మ నశుద్ధ్య స్యా త్పుమాన్ బ్రహ్మవిన్దతి॥ ౫౬
అత్యన్త మలినో దేహో దేహీచాత్య నిర్మలః।
ఉభయోరన్తరం జ్ఞాత్వా కస్యశౌచం విధీయతే॥ ౫౭



# శ్రీభగవదుత్తరగీతా

## ద్వితీయోధ్యాయః

ఆరూఢస్య ముముక్షుశ్చ స్వరూపం పరికీర్త్యతే।
తత్రారూఢస్య బిన్దైక్యం కథంస్యాదితి పృచ్ఛతి॥ ౧
॥అర్జున ఉవాచ॥
జ్ఞాత్వా సర్వగతం బ్రహ్మ సర్వజ్ఞం పరమేశ్వరమ్।
అహం బ్రహ్మేతి నిర్దేష్టుం ప్రమాణం తత్ర కిం భవేత్॥౨
॥భగవానువాచ॥
యథాజలఞ్జలే క్షిప్తం క్షీరేక్షీరఙ్ఘృతే ఘృతమ్।
అవిశేషో భవేత్తద్వ జ్జీవాత్మ పరమాత్మనోః॥ ౩
జీవేపరేణ తాదాత్మ్యం సర్వగం జ్యోతిరీశ్వరమ్।
ప్రమాణలక్షణైః జ్ఞేయం సర్వమేకాగ్రవేదినా॥ ౪
॥అర్జున ఉవాచ॥
జ్ఞానాదేవ భవేద్జ్ఞేయం విదిత్వా తత్ క్షణేనతు।
జ్ఞానమాత్రేణ ముచ్యేత కిం పునర్యోగధారణాత్॥ ౫
॥భగవానువాచ॥
జ్ఞానేన దీపితే దేహే బుద్ధిర్బ్రహ్మసమన్వితా।
బ్రహ్మజ్ఞానాగ్నినావిద్వా న్నిర్దహేత్కర్మబన్ధయమ్॥ ౬
తతఃపవిత్రం పరమేశ్వరాఖ్య
మద్వైతరూపం విమలామ్బరాభమ్।
యథోదకే తోయమనుప్రవిష్టం
తథాత్మరూపో నిరుపాధి సంస్థః॥ ౭

ఆకాశవత్సూక్ష్మశరీర ఆత్మా
నదృశ్యతే వాయుతదన్తరాత్మా।
సబాహ్యమభ్యన్తర నిశ్చలాత్మా
జ్ఞానోల్కయా పశ్యతి చాన్తరాత్మా॥ ౮
యత్రయత్ర మృతో జ్ఞానీ యేనకేనాపి మృత్యునా।
యథా సర్వగతం వ్యోమ తత్రతత్ర లయం గతః॥ ౯
శరీరవ్యాపితం వ్యోమ భువనాని చతుర్దశ।
నిశ్చలో నిర్మలో దేహీ సర్వవ్యాపీ నిరఞ్జనః॥ ౧౦
ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ।
సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్॥ ౧౧
దక్షిణే పిఙ్గలానాడీ వహ్నిమణ్డలగోచరా।
దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ॥ ౧౨
ఇడా చ వామనిశ్వాస సోమమణ్డలగోచరా।
పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్య తిష్టతి॥ ౧౩
గుదస్య పృష్ఠభాగేఽస్మిన్ వీణాదణ్డస్య దేహభృత్।
దీర్ఘాస్థిమూర్ధ్ని పర్యన్తం బ్రహ్మదణ్డీతి కథ్యతే॥ ౧౪
తస్యాన్తే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః।
ఇడాపిఙ్గలయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ
సర్వం ప్రతిష్ఠితం తస్మిన్ సర్వగం సర్వతోముఖమ్॥౧౫
తస్యమధ్యగతా స్సూర్యసోమాగ్ని పరమేశ్వరాః।
భూతలోకా దిశః క్షేత్రసముద్రాః పర్వతాశ్శిలాః॥ ౧౬
ద్వీపాశ్చ నిమ్నగా వేదాః శాస్త్రవిద్యాకలాక్షరాః।
స్వరమన్త్రపురాణాని గుణాశ్చైతే చ సర్వశః॥ ౧౭

బీజం బీజాత్మకాస్తేషాం క్షేత్రజ్ఞాః ప్రాణవాయవః।
సుషుమ్నాన్తర్గతం విశ్వం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్॥ ౧౮
నానా నాడీ ప్రసవకం సర్వభూతాన్తరాత్మని।
ఊర్ధ్వమూలమధశ్శాఖం వాయుమార్గేణ సర్వగమ్॥ ౧౯
ద్విసప్తతి సహస్రాణి నాడ్యస్స్యు ర్వాయుగోచరాః।
కర్మమార్గేణ సుషిరా స్తిర్యఞ్చః సుషిరాత్మకాః॥ ౨౦
అధశ్చోర్ధ్వ గతాస్తాసు నవద్వారాణి శోధయన్।
వాయునాసహ జీవోర్ధ్వ జ్ఞానీ మోక్షమవాప్నుయాత్॥ ౨౧
అమరావతీన్ద్రలోకోఽస్మి న్నాసాగ్రే పూర్వతోదిశి।
అగ్నిలోకో హృది జ్ఞేయ శ్చక్షుస్తేజోవతీపురీ॥ ౨౨
యామ్యాం సంయమినీ శ్రోత్రే యమలోకః ప్రతిష్ఠితః।
నైరృతోహ్యథ తత్పార్శ్వే నైరృతో లోక ఆశ్రితః॥ ౨౩
విభావరీ ప్రతీచ్యాం తు పృష్ఠేవారుణికాపురీ।
వాయోర్గన్ధవతీ కర్ణపార్శ్వే లోకః ప్రతిష్ఠితః॥ ౨౪
సౌమ్యా పుష్పవతీ సౌమ్యే సోమలోకస్తు కణ్ఠతః।
వామకర్ణే తు విజ్ఞేయో దేహమాశ్రిత్య తిష్ఠతి॥ ౨౫
వామే చక్షుషి చైశానీ శివలోకో మనోన్మనీ।
మూర్ధ్ని బ్రహ్మపురీజ్ఞేయా బ్రహ్మాణ్డం దేహమాశ్రితం॥ ౨౬
పాదాదధశ్శివోఽనన్తః కాలాగ్నిప్రళయాత్మకః।
అనామయమధశ్చోర్ధ్వం మధ్యమం తు బహిశ్శివమ్॥ ౨౭
అధః పదోఽతలం విద్యాత్పాదం చ వితలం విదుః।
నితలం పాదసన్ధిశ్చ సుతలం జఙ్ఘముచ్యతే॥ ౨౮

మహాతలంతు జానుస్యా దూరుదేశో రసాతలమ్।
కటిస్తలాతలం ప్రోక్తం సప్తపాతాల సంజ్ఞయా॥ ౨౯
పాతాలం నాభ్యధోభాగే భోగీన్ద్రఫణిమణ్డలమ్।
వేష్టితస్సర్వతోఽనన్తః సమ్బిభ్రజ్జీవ సంజ్ఞకః॥ ౩౦
భూలోకం నాభిదేశం తు భువర్లోకం తు కుక్షితః।
హృదయం స్వర్గలోకంతు సూర్యాదిగ్రహతారకాః॥౩౧
సూర్యస్సోమ స్సనక్షత్రోబుధశ్శుక్ర కుజాఙ్గిరాః।
మన్దశ్చ సప్తమో జ్ఞేయః ధ్రువోస్త స్స్వర్గలోకతః॥ ౩౨
హృదయే కల్పయన్యోగీ తస్మిన్సర్వసుఖం లభేత్
హృదయేచ మహర్లోకో జనోలోకం తు కణ్ఠతః
తపోలోకం భ్రువోర్మధ్యే మూర్ధ్ని సత్యం ప్రతిష్టితమ్॥౩౩
బ్రహ్మాణ్డ రూపిణీ పృథ్వీ తోయమధ్యే విలీయతే
అగ్నినా పచ్యతే తోయం వాయునా గ్రస్యతేఽనలః॥ ౩౪
ఆకాశంతు పిబే ద్వాయుం మనశ్చాకాశ మేవ చ
బుద్ధ్యహఙ్కార చిత్తఞ్చ క్షేత్రజ్ఞః పరమాత్మని॥ ౩౫
అహం బ్రహ్మేతి మాం ధ్యాయేదేకాగ్ర మనసా సకృత్।
సర్వంతరతి పాప్మానం కల్పకోటిశతైః కృతమ్॥ ౩౬
ఘటసంవృత మాకాశం నీయమానే యథాఘటే।
ఘటో నశ్యతి నాకాశం తద్వజ్జీవః ఇహాత్మని॥ ౩౭
ఘటాకాశ మివాత్మానం విలయం వేత్తి తత్త్వతః।
సగచ్ఛతి నిరాలమ్బం జ్ఞానాలోక్యం నసంశయః॥ ౩౮
తపేద్వర్షసహస్రాణి ఏకపాదస్థితో నరః।
ఏకస్య ధ్యానయోగస్య కలాం నార్హతి షోడశీం॥ ౩౯

బ్రహ్మహత్యా సహస్రాణి భ్రూణహత్యాశతానిచ।
ఏకో హి ధ్యానయోగశ్చ దహత్యగ్నిరివేన్ధనమ్॥ ౪౦
అధీత్య చతురోవేదాన్ ధర్మశాస్త్రాణి సర్వదా।
యోవై బ్రహ్మ నజానాతి దర్వీపాకరసం యథా॥ ౪౧
యథా ఖరశ్చన్దన భారవాహీ
సారస్య వాహీ న తు చన్దనస్య।
ఏవం హి శాస్త్రాణి బహూన్యధీత్య
సారం న జానన్ ఖరవ ద్వహేత్సః॥ ౪౨
అనన్త కర్మశౌచం చ జపోయజ్ఞస్తథైవ చ,
తీర్థయాత్రానుగమనం యావతత్త్వం న విన్దతి॥ ౪౩
గవా మనేక వర్ణ్ణానాం క్షీరం స్యాదేకవర్ణకమ్।
క్షీరవదృశ్యతే జ్ఞానం దేహినాఞ్చ గవాం యథా॥ ౪౪
అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనామ్
ద్వేపదే బన్ధమోక్షాయ న మమేతి మమేతిచ,
మమేతి బధ్యతే జన్తుర్నమమేతి విముచ్యతే॥ ౪౫
మనసో హ్యున్మనీ భావాద్ద్వైతం నైవోపలభ్యతే।
యదాయాత్యున్మనీ భావం తదా తత్పరమం పదమ్॥౪౬
హన్యాన్ముష్టిభిరాకాశం క్షుధార్తః ఖణ్డయేత్తుషమ్।
నాహం బ్రహ్మేతి జానాతి తస్యముక్తిర్నజాయతే॥ ౪౭



# శ్రీభగవదుత్తరగీతా

## తృతీయోధ్యాయః

యోగీవ్యర్థక్రియాలాప పరిత్యాగేన శాన్తధీః।
తృతీయో శరణంయాతి హరిమేవేతి కీర్త్యతే॥ ౧

॥భగవానువాచ॥

అనన్త శాస్త్రం బహువేదితవ్య
మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యం
హంసో యథాక్షీర మివామ్బుమిశ్రమ్॥ ౨
పురాణం భారతం వేదశాస్త్రాణి వివిధాని చ।
పుత్రదారాది సంసారో యోగాభ్యాసస్య విఘ్నకృత్॥ ౩
ఇదం జ్ఞానమిదం జ్ఞేయం యస్సర్వం జ్ఞాతుమిచ్ఛతి।
అపి వర్షసహస్రాయుః శాస్త్రార్థం నాధిగచ్ఛతి॥ ౪
విజ్ఞేయో౽క్షర తన్మాత్రం జీవితఞ్చాపి చఞ్చలమ్।
విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతామ్॥ ౫
పృథివ్యాం యాని భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్।
జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యా కిమ్ప్రయోజనమ్॥ ౬
తీర్థానితోయరూపాణి దేవాన్పాషాణమృణ్మయాన్।
యోగినో న ప్రపద్యన్తే ఆత్మధ్యాన పరాయణాః॥ ౭
అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్।
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్॥ ౮
సర్వత్రావస్థితం శాన్తం నప్రపశ్యే జ్జనార్దనమ్।

జ్ఞానచక్షుర్విహీనత్వా దన్ధ సూర్యమివోదితమ్॥ ౯
యత్రయత్ర మనోయాతి తత్ర తత్ర పరం పదమ్।
తత్ర తత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్॥ ౧౦
దృశ్యతే దృశి రూపాణి గగనం భాతి నిర్మలమ్।
అహమిత్యక్షరం బ్రహ్మ పరమం విష్ణుమవ్యయమ్॥ ౧౧
దృశ్యతేచే త్ఖగాకారం ఖగాకారం విచిన్తయేత్।
సకలం నిష్కలం సూక్ష్మం మోక్షద్వారేణ నిర్గతమ్॥ ౧౨
అపవర్గస్య నిర్వాణం పరమం విష్ణుమవ్యయమ్।
సర్వతో జ్యోతిరాకాశం సర్వభూతాధి వాసినమ్॥
సర్వత్ర పరమాత్మానం బ్రహ్మాత్మా పరమవ్యయమ్। ౧౩
అహం బ్రహ్మేతి యస్సర్వం విజానాతి నరస్సదా।
హన్యాత్స్వయ మిమాన్కామాన్సర్వాశీ సర్వవిక్రయీ॥ ౧౪
నిమిషం నిమిషార్ధం వా శీతాశీత నివారణమ్।
అచలా కేశవే భక్తిర్విభవైః కిం ప్రయోజనమ్॥ ౧౫
భిక్షాన్నం దేహరక్షార్థం కన్థా శీతనివారణం।
అశ్మానం చ హిరణ్యం చ శాకం శాల్యోదనం తథా॥ ౧౬
సమానం చిన్తయేద్యోగీ యది చిన్త్యామపేక్షతే।
భూతవస్తు న్యశోచిత్వే పునర్జన్మ నవిద్యతే॥ ౧౭



# శ్రీభగవదుత్తరగీతా

## చతుర్థోధ్యాయః

॥అర్జునఉవాచ॥

ఓఙ్కారస్యతు మాహాత్మ్యం రూపంస్థానం పరం తథా।
తత్సర్వం శ్రోతుమిచ్ఛామి బ్రూహిమే పురుషోత్తమ॥ ౧

॥శ్రీ భగవానువాచ॥

సాధుపార్థ మహాబాహో యన్మాం త్వం పరిపృచ్ఛసి।
విస్తరేణ ప్రవక్షామి తత్తే నిగదితం శృణు॥ ౨
పృథివ్యగ్నిశ్చ ఋగ్వేదో భూరిత్యేవ పితామహః।
అకారేతు లయం ప్రాప్తే ప్రథమే ప్రణవాంశకే॥ ౩
అన్తరిక్షం యజుర్వేదో భువో విష్ణు స్సనాతనః।
ఉకారేతులయం ప్రాప్తే ద్వితీయే ప్రణవాంశకే॥ ౪
ద్యౌస్సూర్య స్సామవేదశ్చ స్వరిత్యేవ మహేశ్వరః।
మకారేతులయం ప్రాప్తే తృతీయే ప్రణవాంశకే॥ ౫
అకారః పీతవర్ణశ్చ రజోగుణ సముద్భవః
ఉకార శ్శుక్ల వర్ణశ్చ సత్వగుణ సముద్భవః॥ ౬
మకారః కృష్ణవర్ణశ్చ తమోగుణ సముద్భవః।
అకారేచ ఉకారేచ మకారేచ ధనఞ్జయ॥ ౭
ఇదమేకం సునిష్పన్నమోమితి జ్యోతిరూపకమ్।
త్రిస్థానంచ త్రిమాత్రం చ త్రిబ్రహ్మాత్ర్యక్షరం తథా॥ ౮
త్రిమాత్ర మర్ధమాత్రం చ ప్రణవస్య విశేషతః।
అష్టాఙ్గఞ్చ చతుష్పాదం త్రిస్థానం పఞ్చదైవతమ్॥ ౯

ఓఙ్కారం యోనజానాతి బ్రాహ్మణో నసబ్రహ్మణః।
ఓమిత్యేవ పరంరూపం పరంబ్రహ్మ ప్రవర్తితమ్॥ ౧౦
ఓఙ్కారేతు ప్రవిష్టో౾హం ప్రభవః ప్రళయస్తథా।
ప్రణవే సర్వగం దేవమేకీకృత్య సమభ్యసేత్॥ ౧౧
భూర్భువస్స్వేతి మన్త్రేణ శరీరం పరిశుద్ధ్యతే।
శరీరీ ప్రణవం ధ్యాయే త్సర్వాజ్ఞాన నివర్తకమ్॥ ౧౨
రేచకోచ్ఛ్వాస నిశ్వాసః పూరకః పరిచక్షతే
తద్రోధః కుమ్భకశ్చైవ ప్రాణాయామ స్స ఉచ్యతే॥ ౧౩
నివర్తన్తే క్రియా స్సర్వాః తస్మిన్దృష్టే పరాపరే।
ఓఙ్కార ప్రభవా వేదా ఓఙ్కార ప్రభవాస్స్వరాః॥ ౧౫
ఓఙ్కార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్।
ఓమిత్యేవ పరంరూపం హృత్పద్మే చ వ్యవస్థితమ్॥ ౧౬
తస్మాత్త దభ్యసేదేకం సర్వగం పరమేశ్వరమ్।
హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః॥ ౧౭
అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద సవేదవిత్।
ఓఙ్కార ప్రభవోవిష్ణు స్త్రినేత్రో వచసాంపతిః॥ ౧౮
తస్యోచ్చారణ మాత్రేణ పరం బ్రహ్మాధి గచ్ఛతి।
ధ్రువమగ్నిమయం రూపం తద్దేహే సమధిష్ఠితమ్॥ ౧౯
ఇన్ద్రియాణి పశూన్ హత్వా ఆత్మనైవతు తుష్యతి।
హృత్పద్మ కర్ణికామధ్యే శుద్ధం దీపశిఖాకృతి॥ ౨౦
అఙ్గుష్ఠమాత్ర మచలం ధ్యాయేదీశ్వర మవ్యయమ్।
హృదయకమలమధ్యే దీపవద్వేదసారం॥ ౨౧
ప్రణవమయ మతర్క్యం యోగిహృద్ధ్యాన గమ్యమ్।
అజహరి శివయోగం సర్వభూతస్థమేకం॥ ౨౨

సకృదపి మనసా మాం ధ్యాయతే యస్సముక్తః।
ఇడాయాం వాయుమారోప్య పూరయిత్వోదర స్థితమ్॥ ౨౩
తతో౾గ్నిం దేహమధ్యస్థం ధ్యాయేజ్జ్వాలా వళీవృతమ్।
రేచకం బిన్దు సంయుక్త మగ్నిమణ్డల సంస్థితమ్॥ ౨౪
ధ్యాయేచ్చ రేచయే త్పశ్చాన్నాదం పిఙ్గల మాప్నుయాత్।
బ్రహ్మాతు పూరకోజ్ఞేయః కుమ్భకో విష్ణురుచ్యతే॥ ౨౫
రేచకస్తు తథాజ్ఞేయో క్షరాక్షర మయశ్శివః।
దేహోదేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః॥ ౨౬
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సో౾హంభావేన పూజయేత్।
బహిర్భ్రామ్యతి యఃకశ్చిత్త్యక్త్వా దేహస్థమీశ్వరమ్।
స్వగృహే పాయసం త్యక్త్వా భిక్షా మటతి దుర్మతిః॥ ౨౭
శిలామృద్దారు పాత్రేషు దైవబుద్ధిః ప్రకల్పితః॥
అకల్పిత స్స్వయంజ్యోతిరాత్మనో దేవతా న కిం। ౨౮
నాభిమూలే స్థితం పద్మం నాళం తస్య దశాఙ్గులమ్।
కోమలం తస్య తన్నాళం నిమ్న పద్మ మధోముఖమ్
కదళీపుష్ప సఙ్కాశం చన్ద్రకాన్త సమప్రభమ్॥ ౨౯

॥అర్జున ఉవాచ॥

దుర్విజ్ఞేయం దురారాధ్యం దుష్ప్రగమ్యం జనార్దన
అధోముఖం యథా భూత్వా హృదయే కేనగచ్ఛతి॥ ౩౦

॥భగవానువాచ॥

అధోముఖన్తు హృత్పద్మ ముద్ధృత్య ప్రణవేనతు,
గత్వాతు పద్మకోశాన్త మేకస్సేవ్యో పునఃపునః॥
తతః పశ్చాద్భవేత్పద్మం సర్వగాత్ర సుఖావహమ్। ౩౧

హృదిస్థితం పఙ్కజమష్టపత్రం
సకేసరం కర్ణిక మప్యలీనమ్।
అఙ్గుష్ఠమాత్రం మునయోవదన్తి
ధ్యాయేతి విష్ణుం పురుషం పురాణమ్॥౩౨
అష్టపత్రస్తు హృత్పద్మం ద్వాత్రింశత్కుసుమస్తథా
తత్ర మధ్యస్థితం ధ్యాయేదిన్ద్రాద్యాన్దిశి దేవతాన్॥ ౩౩
తస్యమధ్యగతో భానుర్భానుమధ్యగత శ్శశీ।
శశిమధ్యగతో వహ్నిర్వహ్నిమధ్యగతా ప్రభా॥ ౩౪
ప్రభా మధ్యగతం పీఠం నానారత్న ప్రవేష్ఠితమ్।
అనేక రత్న సఙ్కీర్ణం జ్వలనార్క సమప్రభమ్॥ ౩౫
తస్య మధ్యస్థితం దేవం నారాయణ మనామయమ్।
శ్రీవత్స కౌస్తుభోరస్కం ముక్తాహారోప శోభితమ్॥ ౩౬
అనేక సూర్యసఙ్కాశం మకుటాధిష్ఠ మస్తకమ్।
శఙ్ఖం చక్రం గదాపద్మం ముసలం ఖడ్గమేవచ॥౩౭
ధనురాద్యాయుధోపేత మష్టబాహుధరం హరిమ్।
శుద్ధస్ఫటిక సఙ్కాశం చన్ద్రకాన్త సమప్రభమ్॥ ౩౮
పద్మకిఞ్జల్క సదృశం తప్తకాఞ్చన సన్నిభమ్॥ ౩౯
కృతే శ్వేతం హరిం విన్ద్యా త్రేతాయాం రక్తవర్ణకమ్।
ద్వాపరే శ్యామవర్ణఞ్చ పీతవర్ణం కలౌయుగే॥ ౪౦
శుద్ధం సూక్ష్మం నిరాకారం నిర్వికల్పం నిరఞ్జనమ్।
అప్రమేయ మజం దేవం తం విన్ద్యాత్పురుషోత్తమ॥ ౪౧
తైలాగ్ని వర్తి సంయోగ మధూమజ్యోతి రూపకం।
తాదృశం పరమం స్మరేత్పార్థ హ్యనన్యధీః॥ ౪౨

కారణం యోగవిజ్ఞాన హేతుసాధన వర్జితం।
భిన్నేకుమ్భేయథాऽఽకాశో మహాకాశే విలీయతే॥
విభిన్నే ప్రాకృతే దేహేతథాऽఽऽత్మాపరమాత్మని। ౪౩
అశ్వారూఢో గజారూఢో సఙ్గ్రామే సఙ్కటేతథా।
ఏతదేవ సదాధ్యాయా పరబ్రహ్మాధి గచ్ఛతి॥ ౪౪
ఆసీనోవా శయానోవా గచ్ఛన్తిష్ఠస్సదాశుచిః॥
తస్మాత్సర్వప్రయత్నేన యోగయుక్తోభవాऽఽర్జున। ౪౫
అన్తస్సఙ్గం బహిస్సఙ్గం మాత్మసఙ్గం పరిత్యజేత్॥
సర్వసఙ్గనివృత్తాత్మా పశ్యేదాత్మాన మాత్మని। ౪౬
విషయాऽऽసక్త చిత్తానామంధస్యేన్దూదయం యధా॥
గీతాసారమిదం శాస్త్ర ముక్తం మోక్షార్థ సిద్ధయే। ౪౭
తత్ర స్థితం బ్రహ్మశాస్త్రం వేదశాస్త్ర సునిశ్చితం॥
ఇదంశాస్త్రం మయాప్రోక్తం గుహ్యం వేదార్థవిస్తరం।౪౮
యః పఠేత్పరయా భక్త్యా సగచ్ఛేద్విష్ణుసామ్యతాం॥
ఏతత్పుణ్యం పాపహరం ధన్యం దుస్స్వప్ననాశనం।౪౯
పఠితాం శ్రుణ్వతాం చైవ విష్ణోర్మాహాత్మ్యముత్తమం॥
అష్టాదశపురాణాని దశవ్యాకరణాని చ,
క్షణమాత్రస్య యోగస్య కళానార్హన్తి షోడశీం॥ ౫౦
నిర్మథ్య చతురోవేదాన్మునినా భారతం కృతం
భారతో దధిమంథస్య గీతానిర్మథనస్యచ
సారముద్ధృత్య తం కృష్ణో అర్జునస్య ముఖేహుతం। ౫౧
పూజాకోటిసమం స్తోత్రం। స్తోత్రకోటిసమం జపః
జపకోటిసమం ధ్యానం। ధ్యానకోటిసమం లయః॥ ౫౨



